# మెట్ట భూమి పంటలు దాహంతోనే కాదు, ఆకలిగా కూడా ఉంటాయి!




# సామ్రాట్ 18:46:0

## మీ లేత మొక్కలకు కావలసిన పోషకాహారం!

- వర్షాధార ప్రాంతాలకోసం ఆదర్శవంతమైన, అత్యధిక పోషక పదార్థాలు గల ఎరువు.
- ఎదిగే మొక్కలకు నత్రజని, ఫాస్ఫేట్ అనే సరైన పోషక పదార్థాలను, సరైన పాళ్లలో అందిస్తుంది.
- దీన్ని ఎరువు-విత్తనం గొర్రు ద్వారా సులభంగా వేయవచ్చు—ఆ విధంగా పంటకు పూర్తిగా అందుతుంది.
- దీనిలో గల 18 శాతం నత్రజని అమోనియా రూపంలో ఉంటుంది—కనీసపు వర్షపాతంతో సైతం ఇది లేత మొక్కలకు అత్యవసరంగా కావలసిన పోషక శక్తినిచ్చి అవి తొందరగా, ఏపుగా ఎదిగేలా చేస్తుంది.
- దీనిలో గల 46 శాతం ఫాస్ఫేట్, నీటిలో కరిగే రూపంలో ఉంటుంది—ఇది వేళ్ల బలంగా ఎదిగి లోతుగా వ్యాపించేలా చేస్తుంది. అంచేత మొక్క భూమి నుంచి మరింత ఎక్కువగా పోషక పదార్థాలనీ, తేమనీ పీల్చుకోగలుగుతుంది.
- దీనిలో హెచ్చు పాలులో వుండే ఫాస్ఫేట్, చిక్కుడు జాతి పంటల్లో వేళ్ల బొడిపెలు (నాడ్యూల్స్) గాలి నుంచి హెచ్చు నత్రజని పీల్చుకొనేందుకు తోడ్పడుతుంది—అంచేత మొక్కలు ఏపుగా, ఆరోగ్యంగా ఎదిగి, నాణ్యమైన దిగుబడి పుష్కలంగా ఇస్తాయి.
- సంతులితమైన ఎరువుల అత్యధిక దిగుబడికి హామీ. ● జువారి ఉచిత భూసార పరీక్ష సేవకోసం అడగండి.



## జైకిసాన్

## ఎరువులు

తెలివైన రైతులకు సుఖ సంపదల మార్గం.

**జువారి అగ్రో కెమికల్స్ లిమిటెడ్** జైకిసాన్ భవన్, జువారినగర్, గోవా 403 726.

**ప్రాంతీయ విక్రయ కార్యాలయాలు :**

సికింద్రాబాద్, విజయవాడ, బెంగుళూరు, హుబ్లి, నాగ్‌పూర్, పుణే, ఇండోర్, ఆగ్రా, ఔరంగాబాద్, జువారినగర్.

# ఉత్తరాలు

## కథలు

12-18 జూన్ పత్రిక "అంబిక" ముఖ చిత్రం అత్యంత ఆకర్షణీయంగా ఉంది. కథలలో "పెన్ ఫ్రెండ్" కథ బావుంది. పెన్ ఫ్రెండ్ చేసే వాళ్ళలో నూటికి పదిమందయినా మోహన్‌లాంటి వాళ్ళు ఉంటే కలం స్నేహానికి విలువ పెరుగుతుంది. రచయితకు మా ధన్యవాదాలు.

-శ్రీపాద శ్రీనివాస్, కొల్నూరు శాంతామణి, బొబ్బిలి

★ ★ ★

12-18 '87 తేదీన వెలువడిన 'పత్రిక' చాలా బాగుంది. మల్లికార్జున గారి "పెన్ ఫ్రెండ్" కథ చాలా బాగుంది. ఈ కథ ద్వారా ఒక పెన్ ఫ్రెండ్‌గా చాలా ఆనందించాను. చిరంజీవిగారి "రేపు" కథ ఆసక్తిదాయకముగా ఉంది. రేపు జరుగబోయే వివిధ సమస్యలను చిరంజీవిగారు చక్కగా వివరించారు. వారికి నాయొక్క ధన్యవాదాలు.

-యస్. ప్రవీణ్ నారాయణరాజు, కోటబొమ్మాళి

★ ★ ★

12-18 జూన్ '87 సంచికలో 'అహల్యా శాప విమోచనం' కథ చదివాక ఈ ఉత్తరం రాయాలనిపించింది. పోటీల్లో బహుమతి పొందే స్థాయిలో వుంది యితివృత్తం. మంచి కథ. మద్దాళి నిర్మలగారికి అభినందనలు. మన సమాజంలోని అనేక తల్లులకి 'అహల్య' ఆదర్శప్రాయం కాగలదు. అహల్య మిగిలిన యిద్దరు పిల్లల్తో విడిపడటంతో కథ ముగిసింది కానీ- ఆ తర్వాత? ఆ యిద్దరు పిల్లలూ కూడా అన్నగారి మార్గాన్నే అనుసరిస్తే? ఆ ఆలోచనే బాధ గల్గించింది! 'కడుపు తీపి' ఆడదానికి శాపమేమో! -పి. వి. ఆర్. శివకుమార్. ఔరంగాబాద్

★ ★ ★

12-18 నాటి జూన్ సంచికలో 'అహల్యా శాప విమోచనం', 'వర్షించని మేఘం' అన్న కథలు బావున్నాయి. -రమాదేవి, హైదరాబాదు

★ ★ ★

12-18 జూన్ సంచికలో ప్రచురించిన "కాల సూత్రం" కథ రియల్లీ సూపర్బ్. మనిషి ఎన్ని ఘోరమయిన, నీచమయిన పనులు చేయడానికి కూడా వెనుకాడక పోవటానికి కారణం ఆకలి, దరిద్రం. మారే కాలంతో పాటు మనిషీ మారుతున్నాడు. యుగధర్మం మారినపుడు అందుకు అనుగుణంగా మనిషీ మారక గత్యంతరం లేదేమో అని రచయిత చాలా చక్కగా వివరించారు. రేపు, పెన్ ఫ్రెండ్ కథలు చాలా బాగున్నాయి.

-మేచినేని అనూరాధ, అశ్వారావుపేట

★ ★ ★

"ఈ కథకు ముగింపు ఇంతేనా?", "రేపు" కథలు బాగున్నాయి. -దండెం రాజయ్య, దోర్నకల్

## సీరియల్స్

మీ పత్రికలో వచ్చే సీరియల్ నవలలు చాలా బాగుంటున్నాయి. విశ్వనాథవారి 'వేయి పడగలు' నవల ఈనాడు కూడా ఎంతో ఆసక్తికరంగా ఉంది. కొత్త రవీంద్రబాబుగారి సీరియల్ మొదట్లోనే మా అందరి అభిమానం చూరగొన్నది.

-జి. విజయదుర్గ, కుమ్మమూరు (కృష్ణా)

## వ్యాసాలు

12-18 జూన్ '87 అంబిక ముఖ చిత్రంతో అందంగా ఉంది. ప్రొద్దుటూరు రోటరీ సేవా సంస్థవారి అంధత్వ నివారణకు అవిరళ కృషి నిజంగా అభినందనీయం. "పంచేంద్రియానాం నయనం ప్రధానం" అన్నట్లుగా మన శరీరంలో కండ్లకు ఎంతో ప్రాధాన్యత ఉంది. అభినందనీయులు.

-పోలోజు వెంకటాచారి, హైదరాబాద్

## శీర్షికలు

12-18 '87 అంబిక ముఖ చిత్రంతో వెలువడిన పత్రిక చాలా ఆకర్షణీయంగా ఉంది. చిన్నారి బాలల దీన గాథలు, ప్రశ్నావళి, అభిమాన తారలపై అభిప్రాయము శీర్షికలు ఇంటరెస్టుగా ఉన్నాయి.

-శి. నాగేశ్వరి, కోటబొమ్మాళి □


# ఆంధ్రసచిత్రవారపత్రిక

వ్యవస్థాపకులు :

దేశోద్ధారక కాశీనాథుని

నాగేశ్వరరావు పంతులుగారు

స్థాపితం : 1908

శివలెంక శంభుప్రసాద్

సంపాదకుడు : (1938-1972)

10-16 జూలై, '87

శ్రీ ప్రభవ నామ సం. ఆషాఢ శు. చతుర్దశి

సంపుటము 79 : సంచిక 45

ముఖ్య సంపాదకుడు :

శివలెంక రాధాకృష్ణ

కార్యవాహక (యాక్టింగ్) సంపాదకుడు :

మతుకుమల్లి మాధవరావు

| | |
|---|---|
| విడి ప్రతి వెల | రు. 2.75 |
| పోస్టులో 6నెలల చందా | రు. 80.60 |
| పోస్టులో 12నెలల చందా | రు. 161.20 |

ఆంధ్రపత్రిక కార్యాలయము,

గాంధీనగరం, విజయవాడ-520 003


## విషయానుక్రమణిక

ముఖచిత్రం :

నటి అనూరాధ

(ఫొటో : ప్రభుశంకర్)

### కథలు :



### సీరియల్ నవలలు:



### వ్యాసాలు, శీర్షికలు :

# న్యూఢిల్లీ లేఖ



డా. జయదుబాషి

# వెయ్యారో జాలవైఫల్యం!

భారతీయుడుగా ఉండడం ప్రమాద కరమైనటు వంటి విషయం. ఫిజీలో మిమ్మల్ని ఓ సగం సైనికాధికారి కూడా ఇబ్బంది పెట్టగలడు. మీ వోటు హక్కును రద్దు చేయగలడు. శ్రీలంకలో జయవర్ధనే విమానాలు మీ మీదికి దూసుకొచ్చి మీ ఇళ్ళనూ కుటుంబాలనూ నాశనం చేయగలవు. దక్షిణాఫ్రికాలో మీరు అటు తెల్లవాళ్ళకూ చెందక, ఇటు నల్లవాళ్ళకూ చెందక రెండు వైపుల నుంచీ కష్టాలే పడుతుంటారు. మీరు ప్రపంచయాత్ర చేస్తే మధ్యలో ఎక్కడో ఒక చోట ప్రయాణికుల కౌంటర్ ముందు పడిగాపులు పడుతూ, ఒకదాని వెనుక ఒకటిగా సంజాయిషీలు ఇచ్చుకోవలసి వస్తుంది.

స్వదేశంలో కూడా పరిస్థితులు ఏమీ బాగా లేవు. పంజాబ్‌లో మీరు హిందువైనా, సిక్కు అయినా లేదా ముస్లిమ్ అయినా– ఆ సుభిక్ష మైనటు వంటి రాష్ట్రాన్ని వధ్యశాలగా మార్చిన క్రూరమృగాల – దాడి కోసం ఎదురు చూస్తున్న పక్షుల్లా ఉంటారు. ఢిల్లీలో మీరు దారికి మరో పక్క నుంచి వచ్చారంటే మీ పని అయిపోయినట్టే– ప్రపంచంలో కల్లా ఎక్కువ రక్షణ సౌకర్యాలతో ఉన్నటువంటి, చివరికి దక్షిణాఫ్రికా అధ్యక్షుడు బోథా ఇంటికన్న ఎక్కువ రక్షణతో ఉన్నటువంటి ప్రధాని రాజీవ్ గాంధీ ఇంటికి మీరుకొన్ని మైళ్ళ దూరంలో మాత్రమే ఉన్నా సరే, ఎక్కడ చూసినా సమస్యలున్నాయి. మతతత్వం సమస్య, రాజకీయ సమస్య. ఒకప్పుడు పాలూ తేనే ప్రవహించిన ఈ భూమిలో రెండు పూటలా తిండి దొరకటం సమస్య. దేశాన్ని ఈ స్థితికి తెచ్చినది ఒక నీతి నిజాయితీలు లేనటువంటి కుటుంబం, వాళ్ళతైనాతీలు.

ఫిజీలో భారతీయుల పరిస్థితి చూడండి. ఒక్కరు కూడా కాదు ఇద్దరు మంత్రులు ఫిజీకి కాకుండా ఒకరు ఇటు చివర సిడ్నీకి, మరొకరు అటు చివర లండన్‌కు వెళ్ళడం రాజీవ్ గాంధీ ప్రభుత్వం పనిచేసే పద్ధతికి మంచి ఉదాహరణ. ఇద్దరూ కూడా అసలు సంఘటన జరిగిన స్థలానికి వేలాది మైళ్ళ దూరంలో ఉన్నటువంటి చోట్లకే వెళ్ళారు. ఫిజీలోని పాలకులతో మన ఇబ్బందులతో మధ్యవర్తులుగా ఆస్ట్రేలియాను న్యూఢిల్లీ ఎందుకు ఉపయోగించుకోవాలి? మనకూ ఫిజీ పాలకులకూ మాట్లాడుకునే సంబంధాలు లేవా? ఏదో ఒకరకమైన మధ్యవర్తులు లేకుండా ద్వైపాక్షిక సమస్యలను పరిష్కరించు కోలేనటువంటి వాళ్ళ లాగ న్యూఢిల్లీ ప్రతి సమస్యనూ, కాశ్మీర్ నుంచి ఫిజీ దాకా ప్రతి విషయాన్ని ఎందుకు అంతర్జాతీయం చేస్తున్నది? చిన్న చిన్న ఫిజీ దీవుల చుట్టూ ఆస్ట్రేలియా తన ఐదు నౌకాదళం నౌకల్ని నిలిపి ఉంచింది. నేనే ఫిజియన్‌ను ఐతే, ఆస్ట్రేలియాను అక్కడ్నించి వెళ్ళిపోయి తన పనేదో తాను చూసుకొమ్మని చెపుతాను. మన మంత్రులు సిడ్నీకో, వెల్లింగ్టన్‌కో లండన్‌కో వెళ్తున్నారు గాని ఫిజీకి వెళ్ళడం లేదు. అక్కడ మన హైకమిషనర్ ఉన్నప్పటికీ. అంతేగాక మధ్యవర్తులు ఏమీ సాధించలేరని మన పాత అనుభవం చెపుతూనే ఉన్నది.

మనం ఈ మధ్యనే మీరట్‌లో, చివరికి రాజధాని నగరంలో కూడా "మత" కల్లోలాలు చూశాం. నేను మత కల్లోలాలు అనే మాటను ఇతరుల మాటగా ఎందుకు చెపుతున్నానంటే అవి అవేనా అని నాకు అనుమానం ఉన్నది. అవి రాజకీయ కల్లోలాలు కావచ్చునని నాకు అనిపిస్తున్నది. పాలక పార్టీ ప్రతిష్ఠ దిగజారి పోతున్నప్పుడు, ఏదో ఒకరకమైన పక్క ఆలోచనను కలిగించ వలసిన అవసరం దానికి ఉన్నప్పుడు, ఈ కల్లోలాలను రాజకీయ వేత్తలు సృష్టించారని నాకు అనిపిస్తున్నది. రాజీవ్ కాంగ్రెస్ పాలించే రాష్ట్రాలలో మాత్రమే ఈ మత" కల్లోలాలు ఎందుకు జరిగాయి? ఎందుకంటే గొడవలను రెచ్చగొట్టే వాళ్ళు ఇందిరాగాంధీ పాలించేటప్పుడు ఆమె మనుషులు చేసి నట్టుగానే ప్రస్తుతం రాజీవ్ గాంధీ మనుషులే గొడవలకు కారకులు. ఎందుకంటే ఉత్తర ప్రదేశ్‌లోని కల్లోలాల వల్ల శ్రీ విశ్వనాథ్ ప్రతాప్‌సింగ్ **అవినీతి** పరులైన కాంగ్రెస్ వాదుల మీద, స్వీడన్, ఇటలీ, స్విట్జర్లాండ్‌లలోని వారి మధ్యవర్తుల మీద తల పెట్టిన దాడి పదును తగ్గి పోతుంది గనుక. ఆయన ఇక ప్రజలకు తన వైపు నుంచి వివరణను ఇచ్చుకునే అవకాశం రద్దయి పోతుంది గనుక. కల్లోలాలు ఒక రకమైన భయోత్పాతం. నీచులకు అవే చివరి ఆశ. హర్యానాలో కూడా వోటర్లను భయోత్పాతంలో ముంచటానికి, పాలక పార్టీకి వోట్లేసేలా మాడడానికి ఒక పథకం ప్రకారం ఎన్నికల సమయంలో కల్లోలాలు జరిగితే నేను ఆశ్చర్యపడను. ఇవన్నీ మత కల్లోలాలు కావు. కులఘర్షణలు. ఎందుకంటే కింది స్థాయి ప్రజలలో పాలక పార్టీని ఎన్నో సంవత్సరాల నుంచి సమర్థిస్తూ వచ్చిన కులాలలో [illegible] ఇప్పుడు పాలకపార్టీని సమర్థించడం మా[illegible]ంటున్నాయి.

రాజీవ్ ప్రభుత్వంతో సమస్[illegible]ంటంటే, అది తన పరిస్థితి మెరుగు పరుచుకోవడానికి నిరుత్సాహంతో స్వల్పకాలిక పరిష్కారాల కోసం వెతుకుతున్నది. కాని భారతదేశం తాత్కాలిక పరిష్కారాలకు అనువైనటు వంటి దేశం కాదు. నిజానికి అడ్డదారులు ప్రమాదకరం కూడా కావచ్చు. అకాలీలను ఎదిరించడానికి, సిక్కు ప్రజల మీద వాళ్ళ పట్టును తొలగించడానికి కాంగ్రెస్ భింద్రన్‌వాలే భూతాన్ని సృష్టించింది. చివరికి భింద్రన్‌వాలే చేతికందని మనిషై పోయి వాళ్ళ పేక మేడల్ని మంటల్లో ముంచెత్తాడు. పశ్చిమ బెంగాల్‌లో రాజీవ్, ఆయన అనుచరులు తయారీలో ఉన్నటు వంటి మరొక భింద్రన్‌వాలేను, ఘీసింగ్ వంటి మనిషిని. ఆదరించడం మొదలు పెట్టారు ఘీసింగ్

ఎత్తుగడల గురించి ప్రశంసాపూర్వకమైన వాదనలు ముందుకు తెచ్చారు. ఇప్పుడు పశ్చిమబెంగాల్ ఎన్నికలలో ఓడిపోయిన తర్వాత రాజీవ్ ఘీసింగ్‌ను గూర్ఖా లిబరేషన్ ఫ్రంట్‌ను మర్చి పోయారు. సందర్భవశాత్తూ, ఆ ఎన్నికలలో మరే నాయకుడూ సాధారణంగా మాట్లాడని విషయాలు ఎన్నిటినో రాజీవ్ మాట్లాడారు.

శ్రీమతి గాంధీ నుంచి అధికారం తీసుకున్న తర్వాత ఒక సంవత్సరం లోపు గానే స్నేహ సహకారాలు సంపాదించ డానికి, అక్కడి ప్రజల ఆదరాభిమానాలు పొందడానికి రాజీవ్ అమెరికా వెళ్ళారు. రాజీవ్ గాంధీ తమ స్వంత రొనాల్డ్ రీగన్‌కు అనుకరణే నని అమెరికన్లు అజ్ఞానంతో అనుకున్నా రు. వాషింగ్టన్ పత్రికా సమావేశంలో ఆయనసరదాగా గడిపారు. పాఠశాల విద్యార్థులు తమ ఉమ్మడిగదుల్లో ప్రవర్తించినట్టు ప్రవర్తించారు అమెరికన్లు ఆయనను తమలో ఒకరిగానే భావించారు. అమెరికన్ పత్రికలన్నిటిలోకీ అభివృద్ధినిరోధక మైన దయిన వాల్‌స్ట్రీట్ జర్నల్ సంపాదకీయంలో ఆయనను రాజీవ్ రీగన్ అని ప్రశంసించింది. రాజీవ్ గాంధీకి సరఫరా ప్రధాన మైన ఆర్థిక వ్యవస్థ అంటే ఏమిటో తెలుసునా, దాని గురించి అసలు పట్టించుకుంటాడా అనేది అనుమానమే. అదే పర్యటనలో రాజీవ్ అప్పటికి అక్కడి జైల్లో మోసం అభియోగంపై యావజ్జీవ శిక్ష గడుపుతున్న మహమ్మద్ యూనస్ కుమారునికి




## న్యూఢిల్లీ లేఖ

క్షమాభిక్ష ప్రసాదించమని అడిగి, సాధించారు. రాజీవ్ కోరిన ఈ అసాధారణ మైనటువంటి కోర్కెతో ఆయన ప్రతిష్ఠ దిగజారడం మొదలు పెట్టింది. ఎందుకంటే అమెరికన్లు ఆయన నిర్ణయాలని మాత్రమే గాక, ఆయన నిజాయితీని కూడా శంకించడం మొదలు పెట్టారు.అప్పటి నుంచి ప్రతిదీ తారుమారయింది. అమెరికన్లు ఏదో ఒక సాకు చూపుతూ వారి కంప్యూటర్‌ని ఇవ్వడానికి నిరాకరించారు. మాదక ద్రవ్యాల రవాణా అభియోగంపై జైలు శిక్ష పడిన ఖైదీని , కేవలం తన స్నేహితుడనే కారణంతో విడుదల చెయ్యమని తన మొదటి విదేశీ పర్యటనలోనే అడగగలిగినటువంటి వ్యక్తిని వాళ్ళు నమ్మక పో వడమే ప్రధాన కారణం. రాజీవ్ గాంధీ పట్ల, ఆయనస్నేహితుల పట్ల అమెరికన్లకు ఇప్పుడు చిన్నచూపు ఉన్నది. రాజీవ్ బృందం అనుమానాస్పదమైన రక్షణ వ్యవహారాలలో,ఇతర లావాదేవీలలో చిక్కుకున్నారంటే అందులో వాళ్ళకేమీ అనుమానం లేదు.

మొన్నో రోజు, రాజీవ్ పాలన గురించి మధ్యంతర అంచనా ఇమ్మని ఒక మిత్రుడు అడిగాడు. జరిగినటువంటి దాన్నంతా వర్ణించడానికి ఒకే ఒక్క మాట ఉన్నదని నేను అన్నాను. అది ఘోర వైఫల్యం అనేమాట. ఈ పాలన మొట్ట మొదటి రోజు నుంచీ ఘోర వైఫల్యమే. మొదట ఢిల్లీ మారణ కాండ, తర్వాత భోపాల్‌లో సామూహిక మారణాలు, పంజాబ్‌లో అంతం లేని హత్యలు, రహస్య ఖాతాలలోకి తరలించుకు పోయిన కోట్లాది రూపాయల లూటీ, ఇప్పుడు ప్రపంచ వ్యాప్తంగా భారతీయుల మీద జరుగుతున్నటు వంటి దాడులు. ఇప్పటికి ఘోర వైఫల్యంతో కూడిన వెయ్యిరోజులు గడిచి పోయాయి. ముగింపు ఇంకా కనుచూపు మేరలో లేదు. ☐



# నిత్య నూతన సీరియల్

## కవిసమ్రాట్ విశ్వనాథ సత్యనారాయణ



# వేయిపడగలు

(గత సంచిక తరువాయి)

అది ఆదివారము. ధర్మారావు పాండురంగ మాహాత్మ్యము తెచ్చి చదువుచుండెను. ఆ వార మెల్ల అదియే చదివెను. తనకు కష్టమై క్రింద లఘు వ్యాఖ్య చూచినపుడెల్ల తన కెచట సంశయమో వ్యాఖ్యాకారునకు కూడ అచటనే సంశయము.

పుస్తకము పూర్తి ఆయ్యెను.

ఈసారితో ధర్మారావు తన కవితాభిప్రాయము లన్నియు మార్చుకొనెను. ఇది యేమి గ్రంథము! తెలుగు వాఙ్మయమున ఆ గ్రంథమునకున్న మర్యాదయు, గౌరవమును ధర్మారావు మొగమున వచ్చి కొట్టెను. ఇది వఱకు ధర్మారావు "కవిత్వ మనగా మెత్తని మాటలు తెచ్చి పొదుగుట" అనుకొనెను. ఒత్తు అక్కరములు లేక అదొక విధమైన ప్రవాహముగా పోవునని, లోకమున మనము బహుశః ఉపయోగించునవి, ఒయ్యారమైన అర్థము కలవి అగు శబ్దములే కవితకు పనికి వచ్చును; తక్కినవి చెవికింపుగావు. పద్యమును సాఫీగా నడువనీయవు; పద్యము తేలికగా ఉండవలయును, ధారాళముగా పోవలయును. యతి ప్రాసములు వాని అంతట అవి అతికినట్లు ఉండవలయును- ఈ పూర్వ భావమిది వరకే కొంత మారినది. ఇప్పుడు పూర్తిగ మారిపోయెను. ప్రతి శబ్దమునందును సొగసున్నది. కవి చూడగలిగి ఉండవలయును. ఇతరులకు పాండు రంగనికి లక్ష వ్యత్యాసము కనబడెను. అతని భావములే వేరు. ఆయన చెప్పెడి వైఖరియే వేరు. ప్రతి పద్యము జాత్యశ్వము కదను వోయినట్లు ఉండును. ధర్మారావునకు తక్కిన వైఖరి పేలవమని పించెను. కవిత్వమనినచో పాండు రంగనిదే కవిత్వము. పింగళి సూరన్నగారును మహానుభావుడే. కాని తెనాలి కవి కూర్పు బ్రహ్మభేద్యము. అతని కతడే సాటి. మరల చూడగా ఎవరి త్రోవ వారిదే. అన్నింటిలో నను మాధుర్యము కలదు.

జిహ్వకు రుచి వేయిరీతులు. మఱిగ కాచిన పాల రుచి వేరు; పంచదార కలిపిన పాల రుచి వేరు, తేనె పాకము రుచి వేరు; తేనె రుచి వేరు చెఱకు పానకము రుచి వేరు- అందులో మరల పలురకములు. షరబత్తు రుచి వేరు. ఇంకేది కాదందుము?

కాని స్వచ్ఛమైన క్షీరము, మధువు, చెరకు పానకము తక్కినవానికన్న శ్రేష్ఠములు. మధువు దోసె డెవరైన త్రాగగలరా? అడవిలోనున్న కోయవాండ్రు త్రావుదురు. ఇప్పపూవు తిని తేనె త్రాగు వారి రుచి యెట్టిదో? మనకైనచో నాలుగు బొట్టులు త్రాగువరకే మొగము మొత్తును అసలు రుచి అట్లు ఉండవలయునేమో? అచ్చముగా పాలు తాగలేక మనము పంచదార కలుపుకొందుము. మన రుచి చెడిపోయినది. ఉప్పుకారములు తిని జిహ్వచెడి అచ్చమైన క్షీరములు, తేనె వీనియందు వైరస్యము పుట్టినది. ఇదియొక వ్యాధియేమో? అడవిలోని వారికి సహజ రుచి పోలేదు. వారికి వెగటు లేదు.

అప్పుడే కొండకొమ్ము నుండి పట్టు దులిపి తెచ్చిన పచ్చి తేనెవలె ఉన్నది తెనాలి కవి గ్రంథము. ఇంకను కొన్ని పురుగులు కూడ బ్రతికియే ఉన్నవి. ఆ దశావతార వర్ణన మేమిటి? అందులో కూర్మావతార వర్ణనము!

కవిత హృదయమునకు తాకవలయునుగాని మనస్సునకు తాక రాదందురు. మనస్సు ద్వారా కాక యింద్రియ విషయములకు హృదయ ప్రవేశ మెట్లు కలుగును? "అన్య దాలోచనామృతం" అన్నవారు కూడ మనసా చర్వితమ్మైన కొలది ఆనందము కలుగునదియే కవిత్వ మనిరి.

అట్లు వినిన వెంటనే తెలియవలయున యేని-చూచినంతనే కనుల కింపయిన వస్తువువలె కవిత్వమును శీఘ్రపరిత్యాజ్య ద్రవ్యగణము లోననే చేరును. ఆలోచించిన కొలది రమ్యముగా ఉండవలయును అనగా ఆలోచించిన కొలదియు అందు విశేషముగా తెలిసికొనవలసిన అంశము లుండవలయునన్నమాట! అర్థము శాఖోప శాఖలుగా ఉండి, తదనుగుణమ్మైన శబ్ద ప్రయోగము, తద్వైచిత్రి, తత్పరస్పర సంబంధము, చివరకు సర్వమును కలసి రసమునందు పర్యవసించుటః యింత జరుగవలయును.

రసమునందు పర్యవసించుట ఎవనికి? రసజ్ఞుడైన వానికి. ప్రతి విషయము నెవడు హృదయముదాక తెచ్చుకొన గలుగునో వాడు రసజ్ఞుడు. ప్రతివాడు అట్లు చేయలేడు, ప్రతి విషయము నందంత శక్తి లేదు. భగవంతుడెంతయ్యైన లోతైన విషయము. ఆ లోతు మహా పరిపక్వ దశ యందున్న దేవదాసి మనస్సుకే తెలియుచున్నది. భాగవతము లోని పద్యము లామెకు తానే చెప్పినది. ఆమె వాని అర్థములు హృదయముదాక ఎరిగినది. అందు కనియే వానియందు లీనమగుచున్నది. ఏ సంగతియ్యైన అంతదాక తెలిసిననే తెలిసినట్లు. తనకు భాగవతములోని పద్యముల యందలి భాగవతార్థముకన్న సారస్వతార్థమే ఎక్కువ తెలిసినది. అందువలన అచటి నుడికారపు సొంపు, అక్షరముల కూడిక పద్యము నడక, వీనిని చూచి తాను సంతోషించుచున్నాడు.



తెలియుటలో నున్న తరతమభావము లనంతములై యిదమిత్థమని నిర్ణయించ రాకున్నది. ఒకనికి తెలిసిన దింకొకనికి తెలియదు. అందుచే జగత్తు బహు సహస్రథా విభక్తమ్మైపోయినది. పాపము! వారొకరి నొకరు తెలిసికొనవలయుననియు ప్రయ



త్నించరు. సర్వసృష్టి నావరించిన మాయ అనెడు అహంకారము, వివేకమును చేరకట్టనీయదు. ఎదుటివాని యూహ యూహించనీయదు.

ఈ యూహ పరంపరవేళ రాఘవరావు వచ్చెను. ఇద్దరును కలసి వాహ్యాళికి బయలు దేరిరి. సాయంకాలమయినను వేడి తగ్గలేదు. కలిసి నల్ల చెరువునకు పోయి అచట కూర్చుండిరి.

రాఘు : మొన్న శ్రీ నాథుడు సీసపద్యము పాడు చేసెనంటివే! ఆ సంగతి కొంచెము చెప్పుము. "వినం గౌతూహలం బయ్యెడిన్."

ధర్మా: నీ తో ఆ సంగతి యింక మాట్లాడను పో!

రాఘు : మఱల కొట్టనులే! ఇది ఫిరంగిపురము కాదుగా!

ధర్మా: నీ మొగము, పోదూ!

అని ఊరకుండెను. రాఘవరావు బతిమాలెను. ధర్మారావు మెత్తబడలేదు.

రాఘు : శ్రీనాథునకు తెలియనిదేమిటి? నీకు తెలిసిన దేమిటి?

ధర్మా: అంతే నీకును శ్రీనాథునకును దెలియును.

రాఘు : సూర్యపతి జీవు మనల నిద్దరను రమ్మని కబురు పంపించెను.

ధర్మా : ఎందుకు? ఊరి వెంట తిరుగుటకు కాబోలు!

రాఘు : రేపు శాకుంతల నాటకమట! మనము ముగ్గురము కలిసిగాని యీ నాటకము చూడ రాదట. ఇదివరకే నాలుగుసార్లు కబురులు పంపించగా మనము పోలేదు. నీ విచటనుండి కదలలేదు. నేను బందరు నుండి పోలేదు. ఈసారి తప్పక రమ్మనియు, రాకపోయిన ఇంక మనతో మాట్లాడననియు కబురంపెను.

ధర్మా : నా కీ న్నాటకములు చూచినచో ఒడలు మండిపోవును. ఈ పిచ్చివానికి ప్రతివాడును నటకుడే. మనముకూడ అతడు మెచ్చుకొన్న వానిని మెచ్చుకొనకపోయినచో మన ప్రాణములు తీయును. లక్ష చెప్పి ఒప్పించినగాని నిదుర పోనీయడుగా.

రాఘు: రేపు పోవుదుమా మరి? రేపు శనివారము.

ధర్మా: రేపు ప్రొద్దుననే పోదము.

మరునాడు నలుగురు స్నేహితులును కలసిరి. దినము చాల భాగము యథాపూర్వముగానే సాగెను. కృష్ణా స్నానము శేసిరి. సూర్యపతి మేడమీద పఱుపులు పరచిన మంచములమీద శయనించిరి. ఎవ్వరును నిద్రపోలేదు. "రాత్రికి నాటకము చూడవలయును, పగలు కొంచెము నిదుర పోద"మని ఒకరు; "సరే" అని మరియొకరు; కాని నిద్రపోవు వేళకు నలుగురు అల్లరియే చేయుదురు.

రెండు గంటలైనది. బత్తాయి తొనలు, కమలా

# వేయిపడగలు

ఫలముల తొనలు, చక్కెరకేళి ముక్కలతో నిండిన పళ్ళెములు మేడమీదికి వచ్చినవి. ఆ ఫలహారములు చేసి, నిమ్మకాయ పిండిన పలుచని మజ్జిగ దాహము త్రావి, మఱల కొంచెముసేపు మాట్లాడి షికారు బయలు దేరిరి. హాలు వద్దకు పోయి టిక్కెట్టు కొనిరి.

రాత్రికి పెందలకడ భోజనములు కానిచ్చి నాటకము వేళకు హాలులో పోయి కూర్చుండిరి. మధ్య సూర్యపతి, అతనికి రెండు వైపుల ధర్మారావు, రాఘవరావులు, ధర్మారావు ప్రక్కన కిరీటి.

హాలు క్రొత్త తెరలతో, చెమికి పని చేసిన ప్రక్క తెరలతో, విద్యుద్దీపముల వెలుంగున కనులకు మిరుమిట్లు కొలుపుచుండెను. సూర్యపతి హాలును తెగ మెచ్చుకొనుచుండెను. "లక్ష రూపాయలు వ్యయముచేసి యీ హాలు కట్టించిరి. ఏమి తెరలు, ఏమి తెరలు!" అని.

ధర్మా : నోరు మూసికొనుము. ఏమిటి! దుర్వ్యయముగా నున్నది!

సూర్య : నీవు ప్రతి దానిని విమర్శించుటయే తప్ప మెచ్చుకొనవయ్యా.

ధర్మా : సరేకాని, ఆ తెరమీద బొమ్మ ఎవరిది?

సూర్య : ఎవరో దొరసానిది. గ్రీసుదేశపు దేవతయట.

ధర్మా : ఇచ్చట ఆడు నాటకములు మన సంప్రదాయముతో కూడినవికదా! మన నాటకము లాయెను! సరస్వతీదేవిదో లక్ష్మీదేవిదో వేయరాదా? కట్టించినవారి కీ వ్యామోహ మెందుకు? గ్రీసు దేశపు విద్యాధి దేవతలు మన నాటకములను చిత్రకళలను పాలించవలయును కాబోలు. ఇంక నట్టి జరుగునులే.

సూర్యపతికియు దోషము తెలిసెను. ఇన్నాళ్ల మెచ్చుదల ఒక్క నిముసములో అదృశ్యమయ్యెను.

"అవునయ్యా. వారికి తోచదు. నీవు పోయి వారితో చెప్పరాదూ!" అనెను.

"మూర్ఖులకు చెప్పుటకు మూర్ఖులే కావల యును. నీవు వెళ్ళుము" అని రాఘవరావనెను.

ముగ్గురును నవ్విరి. అంతలో హార్మనీ మ్రోగుట, తెర యెత్తుటయు జరిగెను.

సూర్య : అదిగోనయ్యా. దుష్యంతుడు వచ్చుచున్నాడు. చూడుము, చూడుము. ఆహాహా! ఏమి పాడునయ్యా! జనము దిగ్భ్రాంతమయి పోవును.

దుష్యంతుడు వచ్చెను. జనులు కరతాళధ్వనులు చేసి మెచ్చుకొనిరి. ఆయన రంగము నుండియే శరీరోర్ధ్వకాయము వంచి దొరవలె గౌరవము ప్రకటించెను. తరువాత "గ్రీవాభంగాభిరామం" పాడెను. మరల తెలుగు పద్యము పాడెను. అట్టలతో కట్టిన రథము, గుఱ్ఱములు, దాని వెనుక దుష్యంత పాత్రధారి. పద్యము లతడందరకు వినబడుటకు రంగము ముందునకు వచ్చి చదువును. దుష్యంతుని యందు శరీర లాఘవముగాని, ముఖ విన్యాసముగాని ఏమియు లేదు. మృగయాను గుణములైన దుస్తులు లేవు. అంత వెలగల దుస్తులెందుకు? తరువాత శకుంతల కనబడినపుడు; "అసంస్కృతమైన బుద్ధిగలవాడు, నీచ నాయికా దర్శనమున తొంగి తొంగి చూచినట్లు, కన్ను కొట్టినట్లు" నటింప నారంభించెను. సభికులు దానిని మెచ్చి మెచ్చి కరతాళములు మ్రోగించుచు వచ్చిరి.

సూర్యపతి "ఎట్లున్న"దని తరచి తరచి ధర్మారావు నడిగెను. శంఖములో పోసినగాని తీర్థము కాదన్నట్లు ధర్మారావు మెచ్చినగాని అతనికి తృప్తి లేదు. ధర్మారావు "కానీ. చెప్పెదను" అనెను.

ద్వితీయాంకము ప్రారంభమయ్యెను. నాయకుడు, నర్మ సఖుడు ప్రవేశించిరి. వెనుక తెరమీద యూరపులోని పల్లెటూరి "చర్చి" చిత్రింపబడి ఉండెను. ధర్మారావు "చూడవయ్యా. ఆ వెనుక తెర! అదిగో మునిపల్లె! అదీ కణ్వ మహాముని ఆశ్రమము." అనెను. నలుగురు పకాలున నవ్విరి.

చుట్టును ఉన్నవారికి వీరు మొదటినుండియు అల్లరియే చేయుచున్నట్లు తోచెను. కాని చాలామంది సూర్యపతి ధనవంతుడని ఎరుగుదురు. కొందరు ధర్మారావు కవీశ్వరుడని, బుద్ధిమంతుడని ఎరుగుదురు. అందుచే దాటిపోయినది.

దుష్యంత పాత్రధారి వెకిలి నవ్వులు, తన నాయికను గూర్చి చెప్పుచు దురర్థము దుర్భావము స్ఫురించునట్లు కనుగీటుటలు, శరీరము వంచుటలు చూచిన కొలది ధర్మారావునకు మనస్సు కలత పొందెను. చివరకు నాయకుడు "చరణమున గ్రుచ్చుకొనె కుశాంకురమటంచు"నని చదివి, తనకు దర్భ కాలిలో గ్రుచ్చుకొన్నట్లు కుంటుట మొదలు పెట్టెను. నాయిక తిరిగి చూచినట్లు తిరిగి చూచెను. పైనున్న పెద్ద ముఖమల్లు అంగీ ప్రక్కనున్న పూల మొక్కపై వైచి అట్లు నాయిక చేసినదని తా నభినయించెను. ధర్మారావు "ఛీ! ఛీ!" అని బిగ్గరగా అనెను. అది యెంతో యభినయమనుకొన్న చుట్టుప్రక్కల వారందరతని వంకనే చూచిరి.

సూర్య : అంత బాగున్నచో అట్లందువేమి?

ధర్మా : మీరందరు తెలివిమాలిన వారైన అది బాగుండదా?

సూర్య : మరి దోషమేమిటో చెప్పుము.

ధర్మా : ఇప్పుడు చెప్పునది కాదు. మన మింటికి పోయిన తరువాత చెప్పెదను. అది చెప్పవలయు నన్న చాలసేపు పట్టును.

తరువాత ధర్మారావు వెడలిపోయి హాలు బయట

**జరిగిన కథ – 13:** సుబ్బన్నపేట జమీందారు కృష్ణమనాయని మరణానంతరం రంగారావుగారికి పట్టాభిషేకం జరుగుతుంది. రుక్మిణమ్మాగారు కబురు పంపగా ధర్మారావు కోటలోనికి వెడతాడు. ధర్మారావు భార్య అరుంధతి కాపురానికి వస్తుంది. రుక్మిణమ్మా రావుగారి సాయంతో ధర్మారావు గుంటూరు కళాశాలలో చేరతాడు.ధర్మారావునకు సూర్యపతి అనే మిత్రుడు ఉంటాడు. అతడు చాలా ధనవంతుడు. పూటకూళ్ల ఇంటిలో భోజనం చేస్తూ ఉంటారు. అనేక విషయాలమీద మిత్రులు చర్చించుకుంటూ ఉంటారు. సీస పద్యాన్ని శ్రీనాథుడే నాశనం చేసాడని ధర్మారావు అంటాడు. రాఘవరావు ధర్మారావును చెంపదెబ్బ కొట్టి పశ్చాత్తాప పడతాడు.

# ఇతర డైలు అన్నీ కలిపి ఎంతమంది వాడుతారో అంతకంటే ఎంతో ఎక్కువ మంది తనంతటతానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైనే వాడుతారు.

ఇవిగో 3 మంచి కారణాలు:




రెండు నైసర్గిక రంగులలో లభ్యం— బ్లాక్ మరియు డార్క్ బ్రౌన్.

**1** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై మీ జుట్టుకు అందిస్తుంది నైసర్గిక రంగు, రూపం. జుట్టును మృదువుగానూ, ఎలా కావలిస్తే అలా చక్కగా వుంచుకోడానికి దీనిలో కండిషనర్ కూడా వున్నది. నిజానికి, వేసుకొన్నారని మీరు చెప్పితే తప్ప ఎవరికీ తెలియదు.

**2** ఇతర హేర్ డైలలాగా కాకుండా, తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డైని సులభంగా, అనుకూలంగా వేసుకోవచ్చు. అవును, జుట్టును షాంపూ చేసుకోవడం లాగే ఎంతో సులభం.

**3** తనంతట తానే వ్యాపించే గోద్రెజ్ హేర్ డై నాణ్యత సంబంధంగా మీరు నిశ్చింతగా వుండవచ్చు. ఎందుకంటే, మీ జుట్టును, చర్మాన్ని సంరక్షించడానికి ఇది ప్రత్యేకంగా తయారు చేయబడినది. పరిపూర్ణ రక్షణ— ఇదే గోద్రెజ్ వాగ్దానం.

**గోద్రెజ్® తనంతట తానే వ్యాపించే పర్మనెంట్ హేర్ డై.**



CLARION/B/GS/50/244 TEL

తిరుగుచుండెను.

సూర్య : రాఘువరావు! నీకును బాగుండ లేదటో యి?

రాఘు : నేను ధర్మారావు చూచినట్లు చూడను నేను వీనిని గురించి విచారించను. నాకు బాగు లేదు, ఓగులేదు.

రాత్రి యింటికి తిరిగిపోవుచు సూర్యపతి సగము చచ్చిన ఉత్సాహముతో ధర్మారావు వద్దకు పోయి "ఏమయ్యా! ఏమియు బాగుగా లేదా?" అనెను.

ధర్మా : బాగేమిటి? వాండ్రు విచారించినవారు కాదాయెను. తెలిసినవారు కాదాయెను. పెద్దల నడిగి తెలిసి కొనినవారు కాదాయెను. చూడు! **అభినయము- నృత్యము, నృత్తము, నాట్యము నని మూడు రకములు.** శబ్దము యొక్క అర్థము నభినయించుట నృత్యము, ఇది వీథి నాటకమువారు చేయుదురు. గానము లేకుండ చేయునట్టి నృత్యము నృత్తము, ఇది వారాంగన లపుడపుడు చేయునది. నాట్యమనగా పద్య భాగము నభినయించునది. ఈ నాటకములలో చేయదగినది అది. ఆ పద్యము చదువుచు దాని భావము సామాజికుల కర్థమగునట్లు నటించవలయును. ఇప్పుడా పద్య మున్నది, అది శకుంతలయొక్క శృంగార భావ విశేష లీలను చెప్పుచున్నది. ఆ లీలవలన దుష్యంతు డామెకు తనయందు ప్రేమ ఉన్నదని అనుకొనెను. ఆ శకుంతల చేసిన తిరిగి చూచుట, సామాజికులు వెనుకటి అంకమున చూచినదే. నర్మ సఖునితో అది నచ్చుచెప్పుటకు దుష్యంతుని నేత్రములయందు అతనికి విశ్వాసము పుట్టించగలట్టి తీక్ష్ణదృష్టి, ప్రేమజ్యోతి వెలుగ వలయునుగాని, దానివలెతి డినచో అది కలుగునా? అదియుకాక వేటకు వచ్చిన దుష్యంతునకు గాడిద మోయునంత ఆ బరు వెందుకు? వేటకు వెళ్ళునప్పుడు పైని మైసూరు మహారాజాగారివలె పెద్ద వ్రేలాడు కోటు వేసికొందురా యేమి?

అభినయము నాల్గు విధములు. అందులో మొదటి దాహార్యకము. ఆహార్యకమనగా పాత్ర కనుగుణమైన వేషమును ధరించుట. "దుష్యంతు డెట్టివాడు?" అని విచారణ చేయుము. రాజర్షి, నిత్యాగ్నిహోత్రి. ధర్మమైన ఊహ తప్ప అతనికి వేరే ఊహయే రాదు. మహాయోధుడు. ఇంద్రునకు రాక్షసుల జయించువేళ ఉపయోగ పడినవాడు. అట్టి క్షత్రియమూర్తి ఎట్లుండునో మన మూహించనే లేము. దుష్కాల - మా రోజులకు, మనకు అంతరితమై మన కా పూర్వ రాజర్షుల మూర్తి గోచరింపించుటలేదు.

శిల్పమునం దాకృతి నిర్మాణమునకు రెం డాధారములు. ఒకటి సంప్రదాయము. అది లేనప్పు డూహ. సంప్రదాయము చచ్చిపోయినది. **ఊహచేత దుష్యంతుని వేషమును భావించుము.** మహాధానుష్కుడు గాన నిత్య వ్యాయామముచేత గట్టిపడిన యొడలు గలవాడు. అది యే పాత్రధారికిని లేదు. నిత్యాగ్నిహోత్రి, ధర్మి గనుక మొగమున బ్రహ్మ వర్చస్సు తాండవించును.




వైరస్యము = విరస లక్షణము
అంతరితమై = నడుమ ప్రవేశించినదై
ప్రతి = బదులు

# వేయిపడగలు

చెవులకు కుండలము లుండవచ్చును. కర్మిష్ఠి కనుక ఉత్తరీయము లేకుండ నుండడు. మన రాజ వేషధారులందఱు ఉత్తరీయము ప్రసక్తియే చేయరు. వారికి రాజ వేష మనగా నేటి మహా రాజుల బొమ్మవలె నుండుటయే అని. మన పాఠశాలలో ఇంగ్లీషు నాటకములు సాంవత్సరికోత్సవములకు ప్రదర్శింతురు. అపుడు వేషధారులు యూరపు దుస్తులు ధరించుటకు, వారికివలెనే ఉండుటకు ఎంత ప్రయత్నింతురు! కళాశాలలలో విద్యార్థులా నాటకములు వేయుట కంత శ్రద్ధ వహించినపుడు, కళా సంస్థలయిన యీ సమాజముల వారి కా మాత్రము శ్రద్ధ లేనందు కనుకొనవలయును. **ఎంతవఱకును వెలగల దుస్తులు, రంగు రంగుల తెరలు, సామాన్య జనుల హృదయా కర్షకములయిన నీచ భావ ప్రకటనములు- వీని తోడనే కాలక్షేపము జరుగుచున్నదిగాని కళా సరస్వతిని చక్కగా ఉపాసించవలయు నన్న భావము లేదు. లోకము సర్వము నట్లే ఉన్నది.**

సూర్య : నీవు చదువుకొని, వీనిని గుఱించి ఆలోచించినావు కావున, నీకు వీనినింద తప్పులు కనబడుచున్నవి. తక్కినవారి కానందముగానే ఉన్నదికదా?

ధర్మా : నీవు మనిషివై పుట్టితివిగాన మనస్సున ఆలోచన చేసి నీతియు అవినీతియు, ధర్మము, అధర్మము వివేచన చేసి ధర్మాచరణము చేయుచున్నావు. మనస్సు లేని పశ్వాదులు చేయుట లేదు. వాని కాస్థితి సుఖముగానే ఉన్న దందువా?

అందరు నింటికిపోయి నిద్రించిరి. మరునాడు ప్రొద్దెక్కి లేచిరి. సూర్యపతి కా నాటకముమీదనున్న వ్యామోహము నశించినది. ఆ నా డంతయు బెజవాడలోననే కడపిరి. ధర్మారావునకు కొండ ఎక్కుటయే పని. కొండ ఎక్కుదమని తక్కినవారి ప్రాణములు తీయును. వారు నతని పోరు పడలేక పోదురు. మరునాడు రాఘువరావు ధర్మారావులు గుంటూరికిని, కిరీటి బందరునకును వెళ్ళిరి.

ఇంతలో వేసగి సెలవులు వచ్చెను. తేపు సుబ్బన్నపేటకు పోవును. ఆ రాత్రి మనస్సంతయు అరుంధతి వైపునకే మఱలినది. ఆ కార్యమయిన అరు రాత్రులే! మఱల ఆమెను చూడలేదు, ఆమెను చూచి ఏడు నెల లయినది. రాణిగారు ప్రతి నెలయు ఏబది రూపాయలు పంపించుచుండెను. తల్లికి పది పంపించి, తాను నలుబది రూపాయలతో గడుపుకొనుచుండెను. సెలవలకు కూడ ఇంటికి పోలేదు. ఏ ధ్యాస పడిననదే! రమ్మని తల్లి పది ఉత్తరములు వ్రాయించెను. ఇతడు సమాధానము కూడ వ్రాయలేదు. పిల్లను తీసుకొనిపోయి గుంటూరులో కాపురము పెట్టుమని తల్లి వ్రాయించెను. అతడు దేనికిని ప్రతి లేదు.

మఱల అరుంధతి వచ్చును. ఈ ఏడు నెలలలో ఆమె హూతీ ఉండును. మునుపటికన్న ఎదిగి యుండును. నాల్గు రాత్రుల ఆ దివ్య సౌఖ్య మతని ఆత్మలో నిశ్చలమై పాతుకొనిపోయి, తుఫానులకు కూడ కదలని దీప స్తంభమువలె జీవితయాత్రలో ఒక పెద్ద గురుతుగా ఉండెను. ఎప్పుడు సుబ్బన్నపేట పోవుట. ఎప్పుడామెను గలసికొనుట! ఆమె తన మధ్య, నేల దూరమే కాని యింకొకడు లేదు. తనకో రెక్కలు లేవు. తెల్లవారిన గాని రైలు లేదు. తెల్లవారి నాలుగు గంటలకు రైలు. మొన్న బెజవాడపోయినపు డట్టింటికైన వెళ్ళివచ్చినాడు కాదు.

బెజవాడలో మోటారెక్కెను. తనతో పాటు ముప్పది ఏండ్ల రాజుగారొకరు, భార్యయు, ఒక కుమారుడును మోటారులో కూర్చుండిరి. ధర్మారావు వారిని చూచెను గాని, అరుంధతీ లగ్నబుద్ధియై వారిని గూర్చి విచారించలేదు. కొంతదూరము పోయిన తరువాత రాజుగారు ధర్మారావును "మీదేయూరండి?" అని పలుకరించెను.

ధర్మారావు "సుబ్బన్నపేట" అనెను! ఆయన "సుబ్బన్నపేటా!" అని, "ధర్మారావు నెరుగుదురా?" అనెను.

ధర్మారా వాశ్చర్యపోయెను- తన నాయన యెరుగడు, తన్ను గూర్చి అట్లు మాటాడునేమి?- ధర్మారావు " మీ రాయన నెరుగుదురా?" అనెను. ఆయన "ఎరుగుదును. అతడు మా తమ్ముడేనండి. కాని నే నతనిని చాల చిన్నప్పుడు చూచితిని. ఇప్పుడు గురుతుపట్టలేనేమో?" అనెను ధర్మారావు నకు తెలిసినది. ధర్మారావు నవ్వెను. రామచంద్రరాజు గ్రహించెను. "నీవేనా ధర్మారావు? నేను గురుతు పట్టలేకపోతిని సుమా? నీ వింతవాడవు. నేను నిన్నెత్తుకొని తిరిగెడివాడను. అన్నా! అన్నా! అని నీవు నా వెంటబడి తిరిగెడివాడవు. నీవు పెద్దవాడ వయినావని అమ్మగారు వ్రాయచునే ఉన్నది. కాని యిట్లుండువని అనుకొనలేదు సుమా!" అని రాజు తనని · కౌగలించుకొని, "అబ్బా! నిన్నెన్నాళ్ళకు చూచితిని! నాయనగారి మృతి వేళకు రాలేక పోయితిని. కర్మ నేను విడిగా చేసినాను. ధర్మశాస్త్ర

మెవరును చెప్పలేదు. తరువాత నేనే స్మృతులు చదివితిని. నాయనగారి యాబ్దికము పది రోజు లున్నదికాదా!" అనెను.

ధర్మారావునకు విచిత్రమయ్యెను. తలవని తలంపుగా అతనిని కలసికొనుట, అతడు తన్ను మఱచిపోక పోవుటయే కాదు, తన తండ్రిమీద అంత అనురాగము, అంత కర్మ అందలి విశ్వాసము కలిగియుండుట- యివి చూచి ధర్మారావున కానందమయ్యెను. రామచంద్రరా జతనిని తన భార్యకు చూపించెను. కుమారు డేడాది వాడు. ధర్మారావు కుమారు నెత్తుకొనెను. పసిపిల్లవాడు క్రొత్త లేకుండ పిన తండ్రి వద్దకు పోయెను. రామచంద్రరాజు "వాడికిని దెలియును. నీవు బాబాయి వని. దూరాన నుండిన నేమి? నెత్తురులో నున్నది" అని, "మొదట ఒకపిల్లవాడు పుట్టి పోయినాడు" అని విచారించెను.

ధర్మారా "వింత యకస్మాత్తుగా ఏల వచ్చు చుండిరి?" అని అడిగెను.

రామ : అమ్మగారికి చాల జబ్బుగా నున్నదట.

ధర్మా : ఎవరికి? రంగాజమ్మగారికా? పెద్ద జబ్బే? ఏమి జబ్బు? నాకు ఉత్తరమ్మైనను వ్రాయలేదే?

ధర్మారావు గొంతుకలో గద్గదిక చూచి రామ చంద్రరాజు తన తల్లి యెడల ఆతనికి గల గౌరవమును, ప్రేమయు తెలిసికొనెను.

రామ : నాకును తెలియదు. మొన్న ఉత్తరము వచ్చిన వెంటనే ఆలస్యము చేయక బయలుదేరి వచ్చితిని. ఎట్లున్నదో?

మోటారు చాల నెమ్మదిగ నడచి నట్లుండెను ఇంటికి పోయిన తరువాత నిద్దరును రంగాజమ్మ గారింటికే పోయిరి. ఆమె మంచమునందే ఉండెను. పక్కన సావిత్రమ్మగారు కూర్చుండి ఉన్నది. సావిత్రమ్మగారే వండి పెట్టుట. మంగ వచ్చి పరిచర్య చేయుచున్నది. అందరు నొక్కసారి హఠాత్తుగా కలిసికొనిరి. వారి యానందమునకు మితిలేక పోయెను. శ్రీధర మొక్కడే లేనిది.

సావిత్రమ్మగారు రామచంద్రరాజును చూచి "నాయనా! ఎన్నాళ్ళకు వచ్చితివి! ఇప్పటికయినను వచ్చితివి. ఆమె అదృష్టము. ఇంక నెట్లయినను ఫరవాలేదు" అనెను.

రంగాజమ్మగారు కొడుకును, కోడలిని, మనుమని చూచి కన్నులలోనికి నీరు తెచ్చుకొని "నాయనా! నామీద దయ ఉన్నది గనుక వచ్చితివి. నీ చేతిమీదుగా పోవలెనని తపించిపోయినాను" అని మనుమని ప్రక్కలో నుంచుకొని ముద్దాడెను.

రంగాజమ్మగారు కోడలికి పిన్నత్తగార్ల నిద్దఱను చూపించెను. అమెయు వారును ఏదియో మాటాడుకొనిరి. సావిత్రమ్మగారును ధర్మారావును స్వగృహమునకు చనిరి.

రంగాజమ్మగారు మంగతో, "చెల్లెలా! నీ ఋణము తీర్చుకోలేనమ్మా. ఇంక నీవు పొమ్ము. నా కోడలు వచ్చినదికదా. ఇంక ఆమె చేయును లెమ్ము" అని ఆమెను పంపించెను. మంగ మనుమని ముద్దాడి యింటికి పోయెను.

రామచంద్రరాజు తల్లి దగ్గఱ కూర్చుండి ఆమెకు పాధ సంవాహనము చేయుచుండెను. తల్లి కొడుకు లిద్దఱకు ఎదలనిండ ప్రేమ పొంగారుచుండెను. కన్నులలో నీరు తాండవించుచుండెను. తల్లి కుమారుని యొడలు నిమురుచుండెను.

ధర్మారావు భోజనము చేయుచు అత్తవారి ప్రసంగము తెచ్చెను. తల్లి తాను నాలుగైదుసార్లు కబుర్లు పంపించినను వారు పిల్లను పంపించ లేదనియు, పిల్లను కాపురమునకు పంపించుడనిన ప్రత్యుత్తరము గూడ చెప్పరనియు చెప్పెను. ధర్మారావు లేచిన తరువాత రామచంద్రరాజును చూడబోయెను. ఇద్దరును ప్రొద్దు వాటారు వఱకును సర్వ విషయములును మాటాడిరి. సుబ్బన్నపేటను గూర్చి సగము వర్తమానము రామచంద్రరాజునకు తెలిసెను.

అపుడు ధర్మారావు పని ఉన్నదని యెచ్చటికో పోయెను. అతడు రంగాపురమునకు త్రోవ తీసెను. అత్తవారింటికి పోవుసరికి అరుంధతి వాకిలి కస వూడ్చుచు మగనిని చూచి లోనికి పోయెను. అతడనుసరించెను.

ధర్మా : ఇంట ఎవ్వరును లేరా?

అరుం : లేరు. ఎచ్చటికో పోయిరి. మా చెల్లెలున్నది- అని కాళ్ళు కడుగుకొనుటకు నీరు తెచ్చి యిచ్చెను.

ధర్మారావు పోయి భార్య వద్ద నిలుచుండి ఆమె చేయి చేతిలో పూనెను. అరుంధతి ఏడ్చుచుండెను. అత డామె శిరస్సు ఎదమీద హత్తుకొని "ఎందుకు? ఎందుకు?" అనెను. అరుంధతి "అమ్మ వచ్చునేమో." అనెను. అతడు "రాదులే" అని చెప్పి ఆమెను గాటముగా కౌగిట పట్టి వదలినాడు కాదు. ఆమె కుక్కిరి బిక్కిరైనది.

అరుం : నన్ను తీసికొనిపోవుటకు వచ్చినారా?

ధర్మా : మీ వాండ్రు పంపింతురా? మా అమ్మ ఎన్ని కబురులు పంపించినను జవాబైనను ఇచ్చిరి కాదట.

అరుం : వారు పంపించున దేమిటి? మా నాన్న ఊరిలో లేడు. అమ్మ వచ్చును. మీ రామెతో చెప్పుడు, కలసి పోదము.

ధర్మారావున కేమియు తోచినదికాదు. ఈ సన్నివేశ వేమిటి? లోకమునకు విడ్డూరముగా నుండునేమో? అది తరువాతి మాట. ఇద్దరును కలసి సుబ్బన్న పేటకు నడిచిపోయినచో ఎట్లుండునో? ప్రొద్దు క్రుంక వచ్చినది. నాగమ్మగారు వచ్చెను. అల్లుడు "భార్యను తీసికొని పోవుటకు వచ్చితి" ననెను. ఆమె కర్థము కాలేదు. ధర్మారావు భార్యను లేచిరమ్మనెను. ఆమె వచ్చెను. ఇద్దరును కలసి సుబ్బన్నపేట త్రోవ పట్టిరి. నాగమ్మ దిగ్భ్రాంతురాలయ్యెను. మఱొక సందర్భములో నైనచో ఆమె అఱచి యూరిలోని వారందరను పిలిచి పెద్ద రభస చేసి యుండును. ఇప్పుడామె కేమి చేయుటకును తోచలేదు. అత డట్లు వచ్చుట ఏమి? ఆ అడుగుటయేమి? ఆ రమ్మనుట ఏమి? ఆ వెళ్ళుటయేమి?

(ఇంకా ఉంది)





## వ్యక్తిగతం



బ్రిటిష్ పార్లమెంటు చరిత్రలో అపూర్వమైనటు వంటి విజయాన్ని సాధించారు ఇనుపమహిళగాపేరు పొందిన శ్రీమతి మార్గరెట్ థాచర్. పందొమ్మిదో శతాబ్దం తొలి రోజుల్లో వరుసగా మూడు సార్లు ప్రధానిగా గెలుపొందిన లార్డ్ లివర్‌పూల్ తర్వాత మూడు సార్లు గెలుపొందిన ఘనత మళ్ళీ శ్రీమతి థాచర్‌కే దక్కింది ఆమె మహిళ కావడంతో ఈ విజయం అసాధారణ మైనదని, అపూర్వమైనదని పత్రికలు కీర్తిస్తు న్నాయి 61 సంవత్సరాల వయసు గల శ్రీమతి థాచర్ కన్సర్వేటివ్ పార్టీ నాయకురాలిగా గత రెండు ఎన్నికలలోనూ గెలిచి ప్రధానమంత్రి అయి ఇంగ్లాండ్ ఆర్థిక వ్యవస్థని కొత్త పుంతలు తొక్కించారు ఆమె ఆర్థిక, రాజకీయ విధానాలని ఇంగ్లాండు ప్రజలు సమర్థిస్తున్నారని ఈ ఎన్నికలు మరొకసారి రుజువు చేశాయి 650 సీట్ల, పార్లమెంటులో కన్సర్వేటివ్ పార్టీ గణనీయమైన మెజారిటీతో గెలిచింది ఈ గెలుపుతో శ్రీమతి థాచర్ పదవీ కాలం 1992 దాకా కొనసాగుతుంది శ్రీమతి థాచర్‌ను అభినందించడానికి గుమి కూడిన జన సమూహం ఆమె ఎల్లకాలం తమను పరిపాలించాలని నినాదాలు చేశారు! 'నాలుగో సారి కూడా పోటీ చేస్తారా' అని విలేకరులడిగిన ప్రశ్నకు చూద్దాం' అని ఆమె జవాబిచ్చారు . □



విదేశాలలో విజయాలు సాధిస్తున్న భారతీయుల జాబితాకు అంతం ఉన్నట్టు లేదు! బ్రిటిష్ పార్లమెంటు ఎన్నికలలో కూడా గెలుపొందిన భారతీయుల గురించి వార్తలు వస్తున్నాయి గోవాకు చెందిన కీత్ వాజ్ ప్రస్తుతం బ్రిటిష్ పార్లమెంటులో తూర్పు లీసెస్టర్ నియోజక వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తున్నారు టైమ్స్ ఆఫ్ ఇండియా పత్రికలో పనిచేస్తూ కీత్ తండ్రి ఇంగ్లండ్‌కు వలస వెళ్ళడంతో కీత్ విద్యా భ్యాసం అక్కడే జరిగింది కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయంలో న్యాయశాస్త్రం చదివిన కీత్ విద్యార్థి దశలోనే కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయ ఫేబియన్ సొసైటీకి అధ్యక్షులుగా పని చేశారు. విశ్వవిద్యాలయానికి చెందిన న్యాయ శాస్త్ర పత్రిక సబ్ జుడీస్‌కు సంపాదకత్వం వహించారు లేబర్ పార్టీ నాయకుడిగా పేరు పొందిన ఆయన 1983 ఎన్నికలలో కూడా పోటీ చేసారు కానీ ఓడిపోయారు. ఈయన వయసు 31 సంవత్సరాలు మాత్రమే . □

# వారఫలం

### 10–7–1987 శుక్రవారం మొదలు 16–7–1987 గురువారం వరకు

★ **మేషం :** ఎంతో దూరాన్నుండి బంధువులు గాని, మిత్రులు గాని రాగలరు. ఏదో వ్యవహార విషయంగా కావచ్చు. ఒక వేళ కోర్టు వ్యవహార సంబంధంగా కావచ్చు. వృత్తి రీత్యా కావచ్చు. స్త్రీలకు : అదాయ మున్నది. .సర్వరంగాలలో సదవకాశాలు.

★ **వృషభం :** వారఫలం ఉత్తమం. ఎలాతెలుస్తుంది. మంగళ, బుధవారాలందు గ్రహిస్తారు. వృత్తిరీత్యా ప్రసిద్ధి ఏర్పడుతుంది. రాజకీయంగా మేలుగాదు ఇంటా బయటా వృత్తిరీత్యా అభివృద్ధి. పొరపాటున వ్రాసి యిచ్చారుగా కాగితం, దాని విషయంగా వత్తిడి. స్త్రీలకు వాహన సౌఖ్యం రాజకీయంగా మేలు.

★ **మిధునం :** పెద్ద పదవులందున్న వారికి అభివృద్ధి సూచకవారం. ఎంతో కాలంగా ఎదురుచూచే విషయం, సులభంగా, చులకనగా తేలిపోవటం గ్రహింప గల్గుతారు. బుధవారం అసాధ్య వ్యవహారం సాధింప బడుతుంది. స్త్రీలకు : ఉద్యోగ రీత్యా, వ్యాపార రీత్యా మేలు.

★ **కర్కాటకం :** దూర ఘారాలకు పోగల స్థితి, ఒక వేళ విదేశాలకు వెళ్ళగల అవసరం కొందరకు ఏర్పడుతుంది. విరోధి వర్గ మున్నది. గమనించి మెలగాలని చెప్ప నవసరం లేదుగా! స్త్రీలకు : రచనా విధానాన, నాట్య నాటక, చిత్ర రంగానుభవాన మేలు చేకూర్చ గలవారం.

★ **సింహం :** స్వజనులతో, పరాయి వారితో మాటలాడే సమయాన, భాగస్థులతో మాట్లాడే సమయాన పని పాటల వారితో మెలగే సమయాన, అంటే ఈవారం జాగ్రత్త పడాలి స్త్రీలకు . సులువుగా ఒకానొక వివాదగ్రస్త విషయం యిట్టే తేలిపోతుంది

★ **కన్య :** అనుకూల మిత్రులు చేరుతారు. ఎందుకో? శనిగ్రహం అనుకూలుడు కాబట్టి, ఆదాయం ఉన్నది, ఎందుకో? గురువు సర్వాను కూలుడు. వైద్యం చేయించు కోవాలంటే, ఇదే అదను, ఈ వారమే మేలు. స్త్రీలకు . శుభకార్య తత్పరత, ఉద్యోగ రీత్యా మేలు. కళారంగాన కొందరకు అనుకూలం, అదాయం.

★ **తుల :** వృత్తి యందు రాణింపు లేక పోవటంతో మనోవ్యధ. వ్యవహారాలందు అనుకూలత కనిపించక పోవటంతో బాధ, నలుగురిలో తిరుగుటలో అధైర్యము, అశక్తతలు కనిపించటం, కార్యాచరణ యందు విలంబన. స్త్రీలకు · స్వల్పాదాయం, వృధా త్రిప్పట.

★ **వృశ్చికం :** వెనుక ముందులకు పోవలసిన అగత్య మున్నది రాజకీయంగా ఎటు ఆలోచించినా అంతు చిక్కని పరిస్థితులుంటాయి. అనుకొనేది ఒకటి, చేయగలిగినది ఒకటిగా ఉంటుంది. శిరోబాధ, దంత బాధలతో కొందరకు చికాకు. స్త్రీలకు : ఆరోగ్య లోపం, అననుకూల వార్తా శ్రవణం.

★ **ధనుస్సు :** అన్ని రంగాలలో, ఈ రాశి జాతకులకు ఆనంద మున్నది. అయితే నేం? ఏదో కొరత, ఎక్కడో ఉన్నట్లుగా బాధ పడక తప్పదు. ఏదో పోగొట్టు కొన్నట్లు కొందరు చాలా బాధ పడుతారు. అంతా వ్యయరాశి యందున్న 'శనిగ్రహ' ప్రభావం. స్త్రీలకు . వస్తు సేకరణకు, వాహన సంపాదనకు అనుకూలమని గ్రహించాలి.

★ **మకరం :** వృత్తిరీత్యా గాని, ఉద్యోగరీత్యా గాని, మీరు చేసే నిర్ణయమే నిర్ణయం. మీకు తిరుగు లేదు. ప్రజారంగాన పేరు ప్రతిష్ఠలు రానున్నవి. సాంఘిక సేవ యందు మంచిపేరు తెచ్చి కొంటారు. కళారంగాన చక్కని అవకాశాలున్నాయి స్త్రీలకు · వృత్తి రీత్యా మేలు ధనలాభం. శుభప్రస్తావనలు

★ **కుంభం :** శుక్ర శనివారాలు మీరు గావించే యత్నాలు సఫల మవుతాయి మాట నలుగురిలో బాగా చెలామణీ అవుతుంది వృత్తి యందు వికాస మున్నది. ఆరోగ్య రీత్యా పెంపు చెప్పదగిన సమయం. నలుగురు 'సెబాస్' అనగల కార్యాచరణ మున్నది. స్త్రీలకు : ధన విషయంగా ఏమాత్రం కొరత లేదని గ్రహింపవచ్చు

★ **మీనం :** అనేక విధాల మేలు జరుగనున్న వారం నాట్య నాటక కోవిదులకు చక్కని అవకాశా లుంటాయి చాలా ధనవంతుల సహాయ సంపత్తులు అమరుతాయి. విద్యా వేత్తల సంబంధమున్నది. ఆరోగ్య రీత్యా సర్వానుకూలత గలవారం స్త్రీలకు · ఉద్యోగరీత్యా అధిక గౌరవం, ఒకవేళ కొందరకు ఇంక్రిమెంట్లు రావచ్చు.

–విద్వాన్ కోట సత్యరంగయ్యశాస్త్రి

మహిళా పాఠకులకి

# ఈకాలం పెళ్ళిళ్ళు



మన సంస్కృతిలో వివాహానికి అత్యంత ప్రాముఖ్యం, ఎంతో పవిత్రత ఉన్నాయి. ప్రతి వ్యక్తి జీవితంలో పెళ్ళి అన్నది అతి ముఖ్యమైన మలుపు. స్త్రీ పురుషుల జీవితాలలో అది ఒక మధురమైన దివ్యానుభూతి, నూరేళ్ల పంటగా నిలిచే పవిత్ర బంధం.

మారుతున్న నేటి సమాజంలో పెళ్లిళ్లు ఎలా జరుగుతున్నాయి? వివాహాల విషయంలో ఎలాంటి సమస్యలు ఎదురవుతున్నాయి? మొదలైన విషయాలని చర్చిస్తూ ఈ కింద పేర్కొన్న అంశాలపై, లేదా వాటిలో కొన్నిటిని గురించి కానీ వ్యాసాలు రాసి పంపవచ్చును.

1. మారుతున్న సామాజిక పరిస్థితులు
2. విడాకులు/పునర్ వివాహాలు
3. భార్యల సంపాదనలు/ఉద్యోగాలు
4. కట్నం
5. సమిష్టి కుటుంబం
6. వివాహంలో వ్యభిచారం/సెక్స్
7. కులాంతర వివాహాలు
8. వివిధ కులాలలో వివాహ వ్యవస్థ
9. మతాంతర వివాహాలు
10. ఇంకా రాబోయే మార్పులు
11. సినిమాల/పత్రికల ప్రభావం
12. భర్తలని హింసించే భార్యలు

★ రచనలు ఆలోచనలని రేకెత్తించేట్టుగా ఉండాలి.

★ ఆడవారి రచనలకే ఎక్కువ ప్రాధాన్యత ఉంటుంది.

★ రచనతో పాటు రాసినవారి ఫొటో పంపవచ్చు.

★ రచనలు కాగితానికి ఒక వైపే సిరా లేదా బాల్‌పెన్‌తో రాయాలి.

★ వ్యాసాలు రెండు అర తావు పేజీలకి మించకుండా ఉంటే మంచిది.

★ ప్రతి రచనతో ఈ పేజీలో ఇచ్చిన కూపన్ జతపరచి పంపాలి. కూపన్ జత పరచకుండా పంపిన వ్యాసాలు పరిశీలింపబడవు.

★ వ్రాత ప్రతి మీద వ్యాసం రాసిన వారి పేరు, పూర్తి చిరునామా ఉండాలి.

★ ప్రచురించిన ప్రతి రచనకీ రు. 50/- పారితోషికం ఇస్తాము.

★ ప్రచురణకి స్వీకరించని వ్యాసాలని, ఫొటోలని తిప్పి పంపగోరేవారు తగినన్ని తపాలా బిళ్లలు అతికించిన స్వంత చిరునామా కల కవరు జతపరచి పంపాలి. వాటి విషయంలో ఎటువంటి ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు.

★ ప్రచురణకి స్వీకరించిన రచనల విషయం ఆయా రచయిత్రులకి తెలియ చేయటం జరుగుతుంది.

★ పరిశీలనకి పంపే వ్యాసాలని "ఈ కాలం పెళ్లిళ్లు" శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్రసచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ-520 003 అనే చిరునామాకి పంపాలి.

–సంపాదకుడు



కూపన్

## ఈ కాలం పెళ్ళిళ్ళు

పంపిన వారి పేరు ..........................................

పూర్తి చిరునామా ..........................................

..........................................

..........................................

పిన్ కోడ్ : ..........................................

# ప్రయోజకుడు

నన్నా వారి చిన్నవాడు సన్యాసరావు-తిన్నగా ఉండలేక సన్నసన్నగా చిన్న నిర్ణయం ఒకటి తీసుకున్నాడు.

మిన్ను విరిగి మీదపడినా-

కన్ను ఊడి పన్ను మీదపడినా-

కన్న వారెంత తన్నుకు చచ్చినా-

లేదా, తనని తన్నడాన్కి వచ్చినా సరే-

వెన్ను చూపని వీరుడిలాగ, వన్నె తరగని శూరుడిలాగ, వెన్న తినని విక్రమార్కుడిలా-తను ఆ నిర్ణయాన్కి కట్టుబడివుండాలి- అని మరో గాఠి నిర్ణయం కూడా తీసుకున్నాడు

ఇంతకూ సదరు నిర్ణయం ఏమనగా-

కాణీకట్నం గైకొనకుండానే, జున్నులాంటి కన్నెపిల్లను చేపట్టవలెనని!

నిన్నకాక మొన్న పుట్టిన చిన్నవాడుకూడా పాల కోసం కాక కట్నంకోసం ఏడుస్తున్న ఈ రోజుల్లో ఈ కుర్రసన్యాసి ఈలాంటి నిర్ణయం తీసుకోవడంతో కన్నతల్లి గుండె రెండంగుళాలు కదిలిపోగా, కన్నతండ్రి గుండె ఐదంగుళాలు అదిరిపోయింది

మిగిలిన బిడ్డ లందరూ ఆరోగ్యంగా పుట్టినా చివరివాడు మాత్రం నరంలాగ బిక్కుబిక్కుమంటూ పుట్టాడు. పిచ్చిసన్యాసి! బ్రతికి బట్టకడతాడో లేదోనని బెంగపడింది కన్నతల్లి. పిల్లవాడు ఏడ్చినా, నవ్వినా ఏపని చేసినా "పిచ్చిసన్యాసి!" అంటూ ముద్దులు కురిపించేది ఆమె.

అదిగో ఆవిధంగా అతనిపేరు-ఊరిలో "పిచ్చి సన్యాసి" అనీ, స్కూలులో "ఉత్తిసన్యాసి" అని స్థిరపడిపోయింది.

ఉత్త పిచ్చిసన్యాసి అయినా, అతగాడు తెలివి తేటల్లో అన్నలకన్నా మిన్న రోజూ శ్రద్ధగా చదువుకునేవాడు. మాష్టార్లంటే భయభక్తులున్నాయి.

కాని అతని అన్నలు ఎప్పుడూ చదివేవారుకాదు. మాష్టార్లని ఎదిరించేవారు. అయినా పరీక్షల్లో వాళ్ళకే మంచిమార్కులు వచ్చేవి! వాళ్ళు బ్రతకనేర్చినవాళ్ళుమరి!

అందుకే చిన్నకొడుకునిచూసి "పిచ్చిసన్యాసి" ఎలా బ్రతుకుతాడో, ఏమో"నని మరీమరీ జాలికురిసిపోయేది కన్నతల్లి.

ఏవో తంటాలుపడి కొడుకులందరూ ఉద్యోగాలు సంపాదించారు. పెద్దవాళ్ళిద్దరూ రెండుచేతులా సంపాదిస్తూ, మరో రెండుచేతులు-కనీసం అరచెయ్యి అయినా, అదనంగా లేనందుకు బాధపడుతోంటే, సన్యాసిది మాత్రం ఒంటి చేతి సంపాదనే! టేబుల్ కింద చెయ్యిపెడితే తేలు కుట్టుతుందన్న భయం కాదుగాని ఎందుకనో, సన్యాసికి టేబుల్‌కింది వ్యవహారాలూ, చీకటిమాటున చాటుమాటు వ్యవహారాలూ కిట్టవు

కన్నతల్లికి అదో బెంగ! ఎలా బ్రతుకుతాడో పిచ్చిసన్యాసి! ఆ బెంగలన్నీ ఏదో విధంగా భరించింది ఆమె కాని కొడుకు కట్నం వద్దనడాన్ని మాత్రం భరించలేకపోయింది.

కట్నం యివ్వలేక, పెళ్ళికాక, ఆత్మహత్య చేసుకున్న ఏ కన్నె దెయ్యం అయినా పట్టి పీడిస్తున్నదేమో పిచ్చిసన్యాసిని! అని కన్నతల్లి తల్లడిల్లిపోయింది. భూతవైద్యునివద్దకు లాక్కువెళ్ళింది సన్యాసిని.

కాకినాడలో కట్నంకోసం కాల్చివేయబడిన కోడలుపిల్ల దయ్యంగామారి మన సన్యాసిని ఆవహించిందని నిర్ధారించాడు భూతయ్య. తన వూహ నిజం అయినందుకు కన్నతల్లి సంతోషించి భూతయ్యను శరణుజొచ్చింది

ఆ తర్వాత పూజలూ, పునస్కారాలూ కోడి కోతలకూ వెయ్యిరూపాయలు వదిలాయిగాని కొడుక్కి పట్టిన దయ్యం మాత్రం వదలలేదు. ఇలా ఖర్చయిన వెయ్యిరూపాయిలు కూడా కట్నంతో కలిపి గుంజుదామనుకున్న కన్నతల్లి ఆశలు అడియాసలయ్యాయి ఈసారి ఒక బాబాగార్ని దర్శించుకుంది.

"దీనికి శ్రీ కట్నమహిమ అను ఒక వ్రతరాజము గలదు. అద్దానిని నీవుగాని నీ కుమారుడుగాని భక్తి శ్రద్ధలతో నలుబదియైదు దినములు ఆచరించిన ఆ శ్రీ కట్నపరమాత్మ అనుగ్రహించును" అని ఆ వ్రత విధానం ఎరిగించి, ధర్మడిబ్బీలో, వెయ్యిన్నీ ఆఫై నూటపదహార్లు వెయ్యమని ఆదేశించినవారైరి ఆ బాబాగారు.

ఈ బాబాగారి చందాకూడా కట్నంతో బాటు గుంజవచ్చని భావించింది ఆ కన్నతల్లి.....వెర్రితల్లి!

నలుబది యైదు దినంబులు పరమనిష్ఠతో ఆ వ్రతం బాచరించి బాబాగారిచ్చిన శ్రీ కట్నపరమాత్మ విభూతితో బాటు ప్రసాదం కొడుక్కిచ్చింది ఆ సాధ్వి.

"శ్రీలక్ష్మీ సహిత కట్నపరమాత్మ విభూతి కంటే శ్రీ కిస్‌మిస్ సహిత పరమాన్నమే నాకు పరమయిష్టం" అంటూ పాయసం తినేసి, విభూతి ప్రక్కకు నెట్టేశాడు సన్యాసి.

అయినా కన్నతల్లి నిరాశచెందలేదు. శ్రీ కట్న పరమాత్మ పరీక్షిస్తున్నాడనుకొంది. మరింత దీక్షతో పూజలూ, వ్రతాలూ, ప్రయత్నాలూ కొనసాగిస్తూనే వుంది మరోప్రక్క పెళ్ళిచూపుల తతంగాలు జోరుగా సాగుతూనేవున్నాయి.

మొట్టమొదట-పన్నీరుబుడ్డీలాంటి అన్నుల మిన్నను చూడడాన్కి కన్నులూరు వెళ్ళాడు సన్యాసి-తల్లి దండ్రులతోనే.

వారు పిల్ల యింటిని సమీపించగానే చూరుపట్టుకుని వేలాడుతున్న గబ్బిలం లాంటి శాల్తీ కనిపించింది వాళ్ళకి ఆ శాల్తీ కథ తర్వాత తెలిసింది

అతడు సన్యాసి చూడవచ్చిన పిల్లకు మేనమామ. అతనికి అపరాధ పరిశోధన ఒక పిచ్చి అయితే మేనగోడలి మీద అపరిమితమైన పిచ్చి-మరోటి. ఈ రెండు పిచ్చిలతో పెచ్చరిల్లిపోయే ఆ "పిమేమా" (పిల్ల మేనమామ!) ఆ పిల్ల తనకోసమే పుట్టిందనుకున్నాడు. అందరూ అలాగే అన్నారు కూడా కానీ, పిచ్చివాళ్ళు, ఆ పిల్ల తల్లి దండ్రులు మాత్రం వేరే సంబంధాలు చూడడం మొదలు పెట్టారు. దానితో [illegible] రెచ్చిపోయింది. పచ్చివుండు అయింది పేట్రేగిపోయాడు. అతని పిచ్చి చూసి అక్కకు తిక్కరేగి తక్షణం యింట్లోంచి బయటకుపొమ్మని అదిలించింది. అదిగో- అప్పటినుండీ అతగాడు ఆ యింటి చూరుపట్టుకొని వేలాడుతున్నాడు!

పిల్లను చూడవచ్చిన సన్యాసికి ఘనంగానే మర్యాదలు జరిపాడు పిల్లతండ్రి. (పి. త!) ఆమాటా, ఈ మాటా అయ్యాక చివరకు కట్నాల ప్రసక్తి వచ్చింది

కట్నం వద్దన్నాడు సన్యాసి

పి త ఖంగుతినేసాడు. విభ్రాంతిగా విగ్రహంలా ఉండిపోయాడు. పిల్ల తల్లికి గుండె జారిపోయింది. మతిపోయినదానిలా వెర్రిచూపులు చూస్తూ వుండిపోయింది.

పిత్తపరిగిల్లాంటి కళ్ళు పిటపిటలాడించి, కొరకొరా చూసింది ఆ పిల్ల!

పి.మే.మా చూరునుండి జారిపోయి దభేల్‌మని కిందపడిపోయాడు. లేచి నెమ్మదిగా దుమ్ము దులుపుకుంటూ ఆలోచనల్లో జారిపడ్డాడు. ఇందులో ఏదో భయంకర పన్నాగం లాంటి పన్నాగం వుంది.....వుంది ....వుంది.. .అని ముమ్మారు అనుకున్నాడు. "సన్యాసి పన్నాగం ఏమిటో పటాపంచలుచేసిగాని ఈ యింటి గుమ్మం తొక్కను" అని చాణక్య ప్రతిజ్ఞ వేసి జుట్టువిరేపుకొని అటునుండి అటే వెళ్ళిపోయాడు పి.మే.మా.

వారం రోజులపాటు ఆవూరూ, ఈవూరూ తిరిగాడు. ఆగాలీ, ఈగాలీ పోగుచేశాడు. ఆ వార్తలన్నీ మూటకట్టి తెచ్చి అక్కముందు విప్పాడు. చివరకు తన పరిశోధనాఫలితం రెండు ముక్కల్లో తేల్చి చెప్పాడు "అబ్బాయికి అన్నీ వున్నాయి గాని అసలైనదే లేదు! కట్నం యివ్వక్కర్లేదని పెళ్ళి చేసేస్తే అమ్మాయి బ్రతుకు అధ్వాన్నమైపోతుంది!"

అంతే.....ఆ సంబంధం తప్పిపోయింది.

అందుకు సన్యాసి విచారించినా-

మరో ఊరు-మరో సంబంధం-

విస్సన్నగారు ఆ ఊరు తాలూకా ఆఫీసులో ప్యూనుగారు. "కలక్టర్ ఉద్యోగం కంటే కండక్టర్ ఉద్యోగమే ఘనమైనది. ఆఫీసర్‌కంటే ప్యూనే ఘనుడు" అని నమ్మిన ప్రాణి. ప్యూనుకంటే పెద్ద ఉద్యోగమే సంపాదించడాన్కి తగిన విద్యార్హత లున్నాయి ఆయనకు.

ఆయన స్నేహితులు మొదట గుమాస్తాగా చేసి టెస్టులు పాసై యిప్పుడు ఆఫీసర్‌లు అయిన వాళ్ళున్నారు.

ఆఫీసర్‌లేకాని వాళ్ళెవరికీ స్వంత యిళ్ళులేవు. కిందివాళ్ళందరూ వాళ్ళని తిడుతూవుంటారు. పైవాళ్ళు మొట్టుతూ వుంటారు. వాళ్ళకి ఆఫీసులో సుఖశాంతులు లేవు. త్రిశంకు స్వర్గం వాళ్ళది.

కాని విస్సన్నగారికి సొంత యిల్లుంది. అతనిని తిట్టడాన్కి కిందివాళ్ళంటూలేరు. పైవాళ్ళు ఆయనని మొట్టరు. పైగా బ్రతిమాలుతారు నెలాఖరు రోజుల్లో పదులూ, వందలూ అప్పు యిమ్మని!

అందువల్ల ఆఫీసర్‌గా కష్టాలు పడడంకంటే ప్యూనుగా సుఖించడం మేలు-అని విస్సన్నగారు చెప్పింది వేదమై కూర్చుంది.

ఆ విస్సన్నగారి అమ్మాయినే చూడడాన్కి వెళ్ళాడు సన్నాసి.

చూపులు అయాయి.

మాటలూ అయాయి.

సన్నాసి కట్నం వద్దన్నందుకు ప్యూన్‌గారు షాకుతినలేదు. గుబురు మీసాల్లోంచి నవ్వుకున్నాడు. అయితే ఆ.సంబంధమూ తప్పిపోయింది అప్పుడే.

అవ్విధంబెట్టిదన-

వెళ్ళేముందు-విస్సన్నగారు సన్నాసి రెండు చేతులూ తనచేతిలోకి తీసుకున్నాడు. షేక్‌హాండ్ చేస్తున్నట్లు నటించి, ఆ చేతుల్ని సునిశితంగా, సుదీర్ఘంగా, సున్నితంగా పరిశీలించి, పరిశోధించి పరీక్షించి చూసి ఒదిలేశాడు.

వాటిలో ఏదో తేడా గ్రహించాడు విస్సన్నగారు. "అల్లుడుగారూ! తమ ఎడమచేయి చాలా సుకుమారంగా, నాజూకుగా కనిపిస్తోంది. దానికి తగినంత పనికల్పించడంలేదా?" అని అడిగాడు లెక్కంగా.

"నా ఎడమచేయి చేసేపని ఒకేఒక్కటి!" అని నవ్వాడు సన్నాసి.

అతగాడు రెండు చేతులా సంపాదించడంలేదనీ, ఒక్కగా నొక్క ఒంటిచేతి సంపాదన అనీ గ్రహించిన విస్సన్నగారి ముఖం గంభీరంగా మారిపోయింది.

"లంచం పట్టడం చేతగాని చేతిని నా ముద్దులపట్టి చేపట్టదు. పో బాలకా! పో పొమ్మికన్!" అని ఖచ్చితంగా చెప్పేశాడు. ఆ భాష అర్థంకాకనో, భావం అవగతంకాకనో, గుమ్మం వద్దనే నిలబడిపోయిన సన్నాసిని బయటకు గెంటి తలుపులు భడేల్‌మని మూసేశాడు విస్సన్నగారు.

మరోసారి-విశాఖపట్నంలో -

చూపుల తతంగం అంతా అయ్యాక-అబ్బాయి ఆదర్శాల గురించి అంతా విన్నాక అయోమయంగా చూస్తూ వుండిపోయాడు పి.త. (అంటే పిల్ల తండ్రి!) చివరకు అన్నాడు......

"తమరు మరోవిధంగా భావించనంటే నాదొక చిన్న విన్నపం. ఈ ఊళ్ళో మాకు తెలిసిన పిచ్చి డాక్టర్ ఒకరున్నారు. ఆయన మీ అబ్బాయిని పరీక్షించాక ఓకే అంటే, మేమూ ఓకే-బావగారూ!" అన్నాడు సన్నాసి. కన్నతండ్రితో వినయంగా, అతివినయంగా !

సన్నాసికి కోపం వచ్చింది. చర్రునలేచి చరచర వెళ్ళిపోయాడు.

ఇంకోచోటా-యింతే!

మరోచోటా-అంతే!

సంవత్సరాలు గడిచిపోతున్నా-సన్నాసి సంసారి కాలేదు.

మన రాష్ట్రంలో కాకులులేని గ్రామం లేనేలేదు. పైగా ఏ గ్రామం కాకి ఆ గ్రామంలోనే వుండిపోదు. టికట్ కొనక్కర్లేదు కదాని తెగ తిరుగుతూ వుంటాయి, ఎగురుతూవుంటాయి ఈ గ్రామం నుండి ఆ గ్రామంకి. ఎగురుతూ, ఎగురుతూ ఈ గ్రామం కబుర్లు పోగేసి ఆ గ్రామంలోనూ, ఆ గ్రామం కథలూ, కాకరకాయలూ ఈ గ్రామంలోనూ-కాకాకొడుతూ వుంటాయి.

సన్నాసిరావుకి పెళ్ళికాని వైనం గ్రామగ్రామాల్లోనూ, కాకులు కాకారావాలుచేశాయి.

అమ్మాయికి పెళ్ళి కాలేదంటే అర్థంచేసుకోవచ్చు. అబ్బాయికి పెళ్ళికాలేదంటే అనుమానించాల్సిందే- అని చెవులు కొరుక్కున్నారు చెవులేగాని బుర్రలేని పెద్దలు!

దానితో కాకిగోల మరింత ఎక్కువైంది.

ఆ గోల కన్నవారి చెవుల్లో పడడమేకాక కన్నెగుండెల్లోనూ పడింది. సన్నాసి ఏ గ్రామం ఏ పిల్లను చూడడాన్కి వెళ్ళినా.....తమబ్రతుకు బండలు చేయడానికే ప్రత్యేకంగా అవతరించాడు కాబోలు ఈ బండబాబు- అని హడలిపోయి పారిపోయేవారు అమ్మాయిలు!



# ప్రయోజకుడు

సన్యాసి తల తిరిగిపోయింది తిరిగిపోయిన తలలో ఒక కొత్త ఆలోచన మొలిచింది.

ఇంతవరకూ సన్యాసి కానో, కూసో కట్నం యివ్వగల అమ్మాయిలనే చూస్తూ వచ్చాడు అందువల్లనే తను వాళ్ళకి లోకువ అయాడు. ఇంక యిలా కాదని-

పొట్టకోసినా రూపాయి ముక్కలేని అమ్మాయిలనూ, ఏవో లోపాలవల్ల పెళ్ళిళ్ళ సంతలో చెల్లని అమ్మాయిలనూ చూడాలనుకున్నాడు వాళ్ళయితే తన ఔదార్యానికి ఎగిరిగంతేసి ఒళ్ళో వాలిపోతారు-అనుకున్నాడు. వాళ్ళలో కాస్త బాగున్న చిన్నదాన్ని ఎంచుకుంటే సరి-అని ఎగిరి గంతేసి చూపులకు బయలుదేరాడు

కానీ వాళ్ళంతా కాకిగోల విన్నవాళ్ళే.

ఈ సంబంధం వద్దని ఎత్తుపళ్ళపిల్ల ఎదురుతిరిగింది! నత్తిపిల్ల నెత్తి బాదుకుంది!! మెల్లకన్నుపిల్ల మెయిలు కిందపడి చస్తానంది!! అలా సంబంధాలన్నీ తప్పిపోయాయి

వాళ్ళకి కూడా సన్యాసి లోకువ అయిపోయాడు

అతని తల మరోసారి తిరిగిపోయింది

అప్పో, సప్పో చేసి అయినాసరే, ఆస్తులు తెగనమ్ముకుని అయినాసరే కట్నం యిచ్చే పెళ్ళి చేస్తాంగాని కట్నం వద్దనే బేవార్స్‌గాడికి పిల్లనిస్తామా? అనే ధోరణిలో ఆలోచించే ఈ పెద్దల మూర్ఖత్వాన్ని చూసి సన్యాసి కుతకుత ఉడికిపోయాడు సలసలమరిగిపోయాడు, సెగలూ, పొగలూ కక్కాడు చివరకు తలపంకించాడు

* * * * *

కాకులు దూరని కారడవిలోంచి ప్రయాణించేసి, రాష్ట్రం పొలిమేరలుదాటి, హిందీకాకులు తప్ప తెలుగు కాకులు లేని పట్నం వెళ్ళాడు సన్యాసి-పిల్లని చూడడాన్కి

పాపం, ఆ పిల్లకి తెలుగు తెలుసు. కాని మాట్లాడలేదు తలిదండ్రులు మాత్రం తెలుగు మాట్లాడగలరు మాట్లాడారుకూడా

చివరకు కట్నాల ప్రసక్తి వచ్చింది

"నా రేటు యాభైవేలు" అన్నాడు సన్యాసి-కసిగా, తిక్కగా

అంతే పిల్ల తలిదండ్రులతో బాటు సన్యాసి తలిదండ్రులుకూడా ఉలిక్కి పడ్డారు దిగ్భ్రాంతిగా కొడుకుని చూస్తూ వుండిపోయారు

ముందుగా కన్నతల్లి ఆశ్చర్యం నుండి తేరుకుంది "అంతా శ్రీ కట్నపరమాత్మ మహిమ!' అని మనసులో నే నమస్కారం పెట్టుకొని కొడుకు చెవిని తన నోటివద్దకు లాక్కుని "ఒరేయ్ బాబూ! బాబాలకూ వ్రతాలకూ నేను నాలుగువేలు ఖర్చు పెట్టానురా కట్నంలో అదికూడా కలిపి కొత్త రేటు వెంటనే చెప్పరా" అంది-గుసగుసగా

"ఆ ఖర్చేకాదు, మనం యింతవరకూ పెళ్ళిచూపుల ప్రయాణాలకోసం పి. ఎఫ్. డి. ఏ. మొత్తం నాలుగువేల నాలుగు వందలముప్ఫై తొమ్మిది రూపాయిల నలభై అయిదు పైసలు ఖర్చుపెట్టాం. అది కూడా కలుపుకుంటే నా రేటు ఈ క్షణంలో రూ. 58,439 45" అన్నాడు సన్యాసి కళ్ళలోంచి అగ్ని కురిపిస్తూ

పి.త (పిల్ల తండ్రి) చటుక్కున కుర్చీలోంచి లేచాడు. వినయంగా వంగిపోయాడు. చేతులు జోడించాడు 'అనుగ్రహించాలి అంత సమర్పించుకోలేను' అన్నాడు

"పోనీ, పై నలభై అయిదు పైసలూ తగ్గిస్తాం" అన్నాడు సన్యాసి ఉదారంగా

పి త మరింతగా వంగిపోయాడు మరింత వినయంగా అన్నాడు 'తమరు దయదలచి మరో అంకె చెప్పాలి. బీదవాడ్ని! కనికరించాలి

సరే 58 వేలు! అంకొక పైసాకూడా తగ్గదు!" ఖండితంగా చెప్పేసి, మూతి బిగించి పళ్ళు పటపటలాడించాడు సన్యాసి

* * * * *

ఫెళ్ళున పెళ్ళి జరిగిపోయింది

సన్యాసి సంసారి అయిపోయాడు

రెండుచేతులా సంపాదిస్తున్నాడు యిప్పుడు.

కాకులు గోల మానేశాయి

"సన్యాసి ప్రయోజకుడయాడోహో" అని లోకం కోడైకూసింది! □




# బైద్యనాథ్ ఆరోగ్య దీపిక

## పాఠకుల ప్రశ్నలకి బైద్యనాథ్ ఆయుర్వేద భవన్ వైద్య ప్రముఖుని సమాధానాలు

**వి. రాజేశ్వరరావు, తణుకు, వై. కోటేశ్వరరావు, కొండయ్యపాలెం, జి. మురళీధర్, నగరి**

ప్ర : జలుబు, కఫము, పిల్లికూతలు, తుమ్ములు, ముక్కు దిబ్బడ.

జ : బైద్యనాథ్ శ్వాసకల్ప 1 మాత్ర, బైద్యనాథ్ లక్ష్మివిలా సరస (నారదీయ) 1 మాత్ర చొప్పున ఉదయం సాయంత్రం వాడుతూ భోజనం తరువాత బైద్యనాథ్ అర్జునారిష్ట వాడాలి. బైద్యనాథ్ షడ్బిందు తేల్ ముక్కులో 2 చుక్కలు చొప్పున నశ్యముగా వేయాలి.

**కొంగర రాధాకృష్ణ, మల్లాం (తూ. గో. జిల్లా)**

ప్ర : 25 సంవత్సరములుగా అమీబియాసిస్

జ · బైద్యనాథ్ అమీబికా టాబిలెట్స్ 2 చొప్పున ఉదయం సాయంత్రం చల్లని నీటితో లోనికి వాడాలి. భోజనం తరువాత బైద్యనాథ్ కుటజారిష్ట రోజుకు రెండుసార్లు వాడాలి. పులుపు, ఉప్పు, కారం బాగా తగ్గించాలి. అమీబికా వాడినప్పుడు మలబద్ధకము ఏర్పడితే తేలిక విరేచనముకు మందు వాడాలి. 40 రోజుల తరువాత మోతాదు 1 మాత్ర 2 సార్లు వేసుకోవాలి.

**వి. రమేష్, సోంపేట**

ప్ర : నాన్నగారి వయస్సు 50. కాలి మడమ నొప్పి.

జ : బైద్యనాథ్ రుమా ఆయిల్ మర్దన చేసి ఆముదపు ఆకుతో కాపడము పెట్టాలి.

**యం. లక్ష్మీనారాయణ, సికింద్రాబాద్**

ప్ర : దీర్ఘ మధుమేహ వ్యాధి. బలహీనత.

జ : బైద్యనాథ్ మధు మేహారియోగ్ 1 మాత్ర ఉదయం, బైద్యనాథ్ బసంత కుసుమాకర రస 1 మాత్ర సాయంత్రం సేవించండి. బైద్యనాథ్ మహా చందనాది తేల్ అరికాళ్లకు మర్దన చేయించండి.

**కె. శివరాం ప్రసాద్, ఒంగోలు**

ప్ర : హస్త ప్రయోగం, నిక్కాక, నిస్త్రాణ నరముల బలహీనత.

జ : బైద్యనాథ్ విటా ఎక్స్ 1 మాత్ర, బైద్యనాథ్ శక్రవల్లభ రస 1 మాత్ర చొప్పున ఉదయం, సాయంత్రం పాలతో సేవించండి. బైద్యనాథ్ అశ్వగంధారిష్ట భోజనం తరువాత ప్రతి రోజు 2 సార్లు లోనికి వాడాలి.

**బిట్రగుంట రామమోహన్, దూండి**

ప్ర : మా పిల్లవానికి జ్ఞాపకశక్తి తక్కువ.

జ : బైద్యనాథ్ బ్రెయిన్ టాబ్లెట్ 1 మాత్ర, బైద్యనాథ్ బ్రహ్మచారి (బుద్ధి వర్ధక) 1 మాత్ర చొప్పున ఉదయం, సాయంత్రం పాలతో ఇవ్వండి.

**కె. మధుసూదన్, మిర్యాలగూడ**

ప్ర : కీళ్ల నొప్పులు, నరముల బలహీనత.

జ : బైద్యనాథ్ స్వర్ణ మహాయోగరాజ గుగ్గులు 1 మాత్ర చొప్పున ఉదయం, సాయంత్రం బైద్యనాథ్ మహారాస్నాది కాడతో వాడండి. బలహీనతకు బైద్యనాథ్ విటా ఎక్స్ బైద్యనాథ్ చ్యవనప్రాశ స్పెషల్ వాడండి.

**వై. రజని, భుసావల్**

ప్ర : బాగా లావుగా ఉంటాను. పొట్ట కూడా ఉన్నది. తగ్గటానికి మందు.

జ : బైద్యనాథ్ మేదోహర విడంగాది లోహ బైద్యనాథ్ పునర్నవాది గుగ్గులు కలిపి బైద్యనాథ్ మహారాస్నాది కాడతో ఉదయం, సాయంత్రం వాడండి. వ్యాయామం శరీర శ్రమ అవసరం.

**కె. బాబ్జి, ఒంగోలు**

ప్ర : బుడ్డ. ఒంటిపై శోభి.

జ : బైద్యనాథ్ వృద్ధి వాదికబటి 1 మాత్ర, బైద్యనాథ్ యోగరాజ గుగ్గులు 1 మాత్ర, బైద్యనాథ్ సురక్తా స్ట్రాంగుతో ఉదయం, సాయంత్రం విడవకుండా వాడాలి.

**యస్. వి. యస్. శర్మ, శ్రీకాకుళం**

ప్ర : మొహముపై మొటిమలు పోవటానికి జ్ఞాపకశక్తికి.

జ : బైద్యనాథ్ బ్రెయిన్ టాబిలెట్స్ 2 చొప్పున, బైద్యనాథ్ సురక్తా స్ట్రాంగుతో ఉదయం, సాయంత్రం విడవకుండా లోనికి వాడాలి. బైద్యనాథ్ బ్రాహ్మీ తేల్ తలనూనెగా వాడండి.

**కె. సీతామహాలక్ష్మి, విజయవాడ**

ప్ర : పొత్తి కడుపులో నొప్పి తగ్గాలంటే?

జ : బైద్యనాథ్ సుందరీకల్ప ఫోర్టే విడవకుండ ఉదయం, సాయంత్రం లోనికి వాడండి.

**కె. రమాదేవి, గుంటూరు**

ప్ర నేను చామన చాయగా ఉంటాను. తెల్లగ ఉండాలని కోరిక.

జ : బైద్యనాద్ సురక్తా స్ట్రాంగ్ ఉదయం సాయంత్రం వాడుతూ ఎండలో ఎక్కువగ తిరగకుండా ఉండాలి.

**బి. చిట్టెమ్మ, పూరి**

ప్ర : నెల సరిగా అవదు. సంతానము లేదు.

జ : బైద్యనాథ్ నష్ట పుష్పాంతకరస, బైద్యనాథ్ సుందరీకల్ప ఫోర్టుతో ఉదయం, సాయంత్రం కొంత కాలం విడవకుండా వాడండి. ఈ ఔషధముల వాడే ముందు బైద్యనాథ్ రజః ప్రవర్ధినీబటి 2 మాత్రల చొప్పున 2, 3 రోజులు బహిష్టుకు ముందు వాడండి.

**వి. జనార్ధనరావు, బరంపురం**

ప్ర : పెప్టిక్ అల్సర్, కడుపు నొప్పి.

జ : బైద్యనాథ్ సూత శేఖర రస నెం.1 బైద్యనాథ్లఘుసూత శేఖర్ రస్, ఉదయం సాయంత్రం వాడండి. పై వాటితో బైద్యనాథ్ కామదుదా మోతీయున గూడ కలిపి వాడవచ్చు.

**యన్. సి. ఆర్. ఆచార్యులు, మచిలీపట్నం**

ప్ర : కలర్ బ్లైండ్‌నెస్.

జ : బైద్యనాథ్ వారి మహాత్రి ఫలఘృతం ఉదయం పరకడుపున వాడి చూడండి.

**పుల్లయ్య, బరోడా**

ప్ర : శీఘ్ర స్కలనము, సంతోషము లేదు.

జ : బైద్యనాథ్ విటాఎక్స్ 2 మాత్రలు చొప్పున ఉదయం సాయంత్రం పాలతో సేవించండి.

**మంగళ, అహమ్మదాబాద్**

ప్ర : బహిష్టు దోషము, తెలుపు, అతినీరసము.

జ : బైద్యనాథ్ లూకోనిల్ 2 మాత్రల చొప్పున బైద్యనాథ్ సుందరీకల్ప ఫోర్టుతో ఉదయం సాయంత్రం సేవించండి □

---

**కూపన్**

**ఆంధ్ర సచిత్ర వారపత్రిక**

**బైద్యనాథ్ ఆరోగ్య దీపిక**

ప్రశ్న :..................................................

..................................................

..................................................

పంపినవారి పేరు :

పూర్తి చిరునామా :



శ్రీరంగ పట్టణములో "టిప్పు" కట్టించిన "జుమ్మామసీదు" (1787లో)



టిప్పుసుల్తాన్ వేసవిమహల్ (దరియాదౌలత్) కర్నల్ ఆర్థర్ వెల్లస్లీ, డ్యూక్ ఆఫ్ వెలింగ్టన్‌లు యిక్కడే బస చేశారు. (1799)

# హిందూ ముస్లిం ఐక్యత సాధించిన మైసూర్ పులి 'టిప్పు' సుల్తాన్

దక్షిణ భారత దేశాన్నేలిన ముస్లిం రాజులలో ానవతా వాదిగా, మహామనీషిగా, పరమత హనానికి పట్టుగొమ్మగా, హిందూ హమ్మదీయులను కన్నబిడ్డల కన్న మిన్నగా చూచిన మహావీరుడు, నిజమైన భారతీయుడు, ్వాతంత్ర్య రక్షణకై పరవళ్ళు త్రొక్కి, పరాసుల దిర్చి, ఆఖరిశ్వాస ఆగేదాక, కత్తిపట్టి దనరంగములో వీరవిహారం చేసి, నేలకొరిగి రతమాత కౌగిట్లో కన్ను మూసిన కర్మవీరుడు, ైసూర్ పులి, టిప్పుసుల్తాన్.

టిప్పుసుల్తాన్ హైదరాలీ, ఫక్రున్నిసాలకు ిప్పుమస్తాన్ కులియా సన్యాసి ఆశీర్వాదముతో ైసూరు సమీపమందలి దేవవహళ్ళి గ్రామములో వంబర్ 20వ తేదీ 1750లో శుక్రవారం న్మించాడు. టిప్పును భగవత్సేవ కర్పించమన్నది



టిప్పుసుల్తాన్ చివరి పోరు మే 4వ తేదీ 1799లో.... (ఘెంచి చిత్రకారుడు వేసిన చిత్రం)

ఆ సన్యాసి యిచ్చు. అయితే హైదరాలీకి అత్యంత సన్నిహితులు అవసరము కావడముతో 'టిప్పు'ను తనవెంట యుద్ధాలకు తీసుకొని వెళ్ళే వాడు చిన్నతనమునుండి.

టిప్పు సుల్తాన్ చిన్నతనములో గోవర్ధన పండితుడు, మౌల్వీ ఒబేదుల్లాల వద్ద సంస్కృతము, పారశీక భాషలు నేర్చి హిందూ ముస్లిం మత గ్రంథాలను చదివి, మానవతను, సహనాన్ని, ఓర్పును నేర్చినాడు. పాఠశాల నుండి యుద్ధభూమికి నడిచిన టిప్పూను 'గజీఖాన్' అనే వీరుని అండదండలు కొండవలె కాపాడాయి.

క్రీ. శ. 1774 సంవత్సరము 'రుకయాబాను' ను వివాహమాడిన టిప్పుకు ఆరుగురు కుమారులు కలిగారు. తన తండ్రి మరణం తరువాత టిప్పు సింహాసనాన్నధిష్ఠించి శ్రీరంగ పట్టణము రాజధానిగా మైసూరు రాజ్యాన్ని పాలిస్తూ, తమిళ నాడులోని, దిండిగల్, తిరుచునాపల్లి మొదలైన దుర్గాలని జయించి తన రాజ్యాన్ని విస్తరింప

"టిప్పు" ధరించిన దుస్తులు, డాలు



టిప్పుసుల్తాన్ పార్థివ శరీరం పడియున్న చోటు



జేశాడు.

మహామంత్రి పూర్ణయ్య రాజకీయము, గండరగండులైన ఘుజీఖాన్, రాజాఖాన్, చింతామణి, బలరామ్, శేఖర్‌ల వంటి సేనానాయకుల పౌరుష ప్రతాపాలు, గోవర్ధన పండితుడు, మౌల్వీ ఒబేదుల్లా వంటి పండితుల సంస్కారమూ కలిసి 'టిప్పూ'ను మహావీరుడుగా, మానవతా వాదిగా చేశాయి.

కర్నాటక రాజ్యములో నేడు పట్టు పరిశ్రమ మూడు పువ్వులు, ఆరు కాయలుగా విలసిల్లడానికి పునాది వేసిన మహానుభావుడు 'టిప్పు' అని చాలమందికి తెలియదు. దేశములో మొదటిసారి: త్రాగుడును నిషేధించిన రాజు టిప్పు. విదేశీయులు



ఫ్రెంచి చిత్రకారుడు చిత్రించిన టిప్పుసుల్తాన్ చిత్రం

తప్ప స్వదేశీయు లెవ్వరు త్రాగకూడదని ఫర్మానా జారీ చేశాడు 1787లో.

అంతటి మనీషి, 'మీర్ సాదిక్' అనే ద్రోహి కుట్రకు బలియై కూలిపోయాడు.

శ్రీరంగపట్టణము కోట బ్రద్దలయింది. మీర్‌సాదిక్ కుట్ర ఫలించింది. వేలమంది సైనికులు తమ ప్రభువుకై ప్రాణాలర్పించారు. ప్రభుభక్తి పరాయణులు, మహావీరులు నైన ఘుజీఖాన్, ముల్కీ మహమ్మద్, బలరామ్ మొదలైన వీరులు నేలకొరిగారు.

ఆరోజు మైసూరు రాజ్యములో మామూలుగానే తెల్లవారింది. ఆనాడు మేనెల 4వ తేది 1799 సంవత్సరము. టిప్పు ఆజ్ఞ మేరకు మహామంత్రి కోట వదిలి పోవలసి వచ్చింది. 'టిప్పు' భార్య రుకయ్యా బాను కోటపై కావలి కాస్తున్న వారిని వుత్సాహపరుస్తున్న సమయములో విదేశీయుల తుపాకికి బలై తన భర్త చేతుల్లో ఆఖరిశ్వాస వదిలింది. మొండి ధైర్యముతో టిప్పు తన ప్రియమైన గుఱ్ఱం 'రెండవ దిల్‌కుష్' పై లంఘించాడు. వరలో పచ్చల పిడి బాకు, చేతిలో కరవాలము, వీపున డాలు, వంటికి అంటుకపోయిన మెరిసే కవచము, శిరస్త్రాణము. తెల్లవారి తలలు బంతుల్లా యెగురుతున్నాయి. 'విజయమో వీర మరణమో'– రాజాఖాన్ అంగరక్షకుడుగా, చింతామణి సేనాని తన వెనుకరాగా, టిప్పు వాటర్ గేటు వరకు వచ్చాడు. వేలమంది పరాసులు పరమపదించారప్పటికే. టిప్పుకు అప్పటికే రెండు "బయనెట్" పోట్లు తగిలాయి, అయినా ముందుకు దూషుకు పోతూంది ఆయన అశ్వము "దిల్‌కుష్" కోట ద్వారానికి కొంత దూరములో యుద్ధం చేస్తున్న 'టిప్పు'కు గుండు దెబ్బ తగిలింది. తనను ఎన్నో యుద్ధాల్లో విజయము వైపుకు మళ్లించిన తన గుఱ్ఱం తన యజమానిని కాపాడడానికై తన రెండు కాళ్ళు పైకెత్తి ఫిరంగి గుండును స్వీకరించి నేలకొరిగింది. గుఱ్ఱం కళ్లలో మెరిసే సంతోషం – టిప్పు కళ్లలో విషాదం. అంతలోనే చింతామణి సేనాని శరీరం ముక్కలు ముక్కలై టిప్పు కాళ్ల ముందు పడింది బ్రిటిష్ వారి ఫిరంగి దెబ్బకు. అంగరక్షకుడు, అకళంక రాజభక్తుడు రాజాఖాన్, టిప్పూను చేరుకున్నాడు. విషయం అర్థమయిన 'రాజా', టిప్పును ప్రార్థించాడు. "సుల్తాన్–



జుమ్మా మసీదులోని ఒక శిఖరం

మనము వెనకకు తిరుగుదాం– మరోసారి మన సమయము వస్తుంది" అన్నాడు. "రాజా– నీ రాజభక్తి, నీ దేశభక్తి నేనెరుగనిది కాదు. నీకేమిస్తే నా ఋణం తీరుతుంది– అయినా, యెత్తిన కరవాలం దించేదిలేదు. ఇంతమంది హితులను స్నేహితులను ప్రజలను పోగొట్టుకున్న మనము పారిపోయి సాధించేదేమిటి– చివరి శ్వాస వరకు పోరాడుదాం", అన్నాడు. రాజాఖాన్ చేసేది లేక టిప్పూను అనుసరిస్తూ వుండగా, వెనుక నుండి వచ్చిన తుపాకి గుండు రాజాఖాన్ రక్తాన్ని చవిచూచింది.

ఒక్కక్షణం చలించి పోయాడు 'టిప్పు'. అప్పటికే రక్త స్రావము జరిగి, కళ్ళు బైర్లు కమ్మిన సుల్తాన్‌ను పదిమంది విదేశీ సైనికులు ఎదుర్కొన్నారు. తన కరవాలముతో నలుగురి తలలు నేల రాల్చాడు టిప్పు అంతే! "ఆగండి – అది

శిథిలమై పోయిన శ్రీరంగపట్టణం కోట ప్రవేశ ద్వారం
(ప్రక్కన కందకము)



1799లో శ్రీరంగపట్టణములో ఆంగ్లేయులు
ఉపయోగించిన "ఫిరంగి"



పులి – తుపాకి పేలుస్తా" అన్న శబ్దముతో పాటు, తుపాకి పేలిన శబ్దము.

అప్పుడు సూర్యాస్తమయమవుతూంది. మైసూర్ పులి, మహావీరుడు వంటరివాడై నేలకొరిగాడు. అది మేనెల 4వ తేదీ 1799 సంవత్సరము. మహావీరుడు మానవతా వాది ఆఖరిశ్వాస అనంత వాయువుల్లో కలిసి పోయింది.

టిప్పు మరణానంతరము బ్రిటిష్ వారు శ్రీరంగపట్టణాన్ని 1799 తరువాత ముమ్మడి కృష్ణరాజ వడయార్‌కు యిచ్చి ఆయన్ను తమ సామంతుడిగా స్వీకరించారు.

## శ్రీరంగపట్టణములో దర్శనీయ స్థలాలు:

శ్రీరంగపట్టణములో టిప్పు సుల్తాన్ కట్టించిన జుమ్మా మసీద్, యిప్పటికీ చెక్కు చెదరకుండ ఆనాటి వైభవానికి ప్రతీకగా నిలిచి యాత్రికుల నాకర్షిస్తూంది. ఈ మసీదు రెండంతస్తుల భవనం. రెండవ అంతస్తుపై రెండు మినార్లు నిర్మింపబడి చూపరుల నాకర్షిస్తాయి. ఇప్పటికీ చెక్కు చెదరని మసీదిది. దీన్ని ఒక ఫకీరు కోర్కె మేరకు 1787లో టిప్పు సుల్తాన్ నిర్మింపజేశాడు.

## కోట ద్వారము :–

అత్యంత పటిష్టమయిన కోట ప్రవేశ ద్వారమిది.



శ్రీరంగపట్టణములో నున్న వీక్షణ శిఖరం. ఇక్కడ నుండి మైసూరు కూడ కనిపిస్తుంది

## 'టిప్పు' సుల్తాన్

కోట చుట్టూ కావేరి నదీ జలాలతో నిండిన లోతైన కందకముండేదానాడు. నేడీ కందకము పూడిపోయి వుంది.

## దరియా దౌలత్ :–

ఇది టిప్పు సుల్తాన్ స్వయంగా కట్టించిన వేసవి భవనము. సువిశాలమైన మైదానములో రెండతస్తులలో కట్టిన 'వేసవి భవనము'. దీన్ని పూర్తిగా చెక్కతోనే నిర్మాణము చేశారు. మండు వేసవిలో కూడ ఈ భవనములో చల్లగా వుండడము విశేషము. టిప్పు మరణము తరువాత వెల్లస్లీ ఈ భవనములోనే విడిది చేశాడు. ఇప్పుడిక్కడ నాటి వస్తువులన్నిటిని చేర్చి 'మ్యూజియం'గా మార్చారు. ఈ భవనము ముందు నాటి 'ఫిరంగి', భవనములో టిప్పు వాడిన ఆయుధాలు, దుస్తులు అమర్చి వున్నాయి.

## గుంబజ్ :–

శ్రీరంగపట్టణానికి రెండు కిలోమీటర్ల దూరములో హైదరాలీ, ఫక్రున్నిసా, టిప్పు సుల్తానుల సమాధులున్నాయి.

–వ్యాసం : శ్రీమతి వి. విజయలక్ష్మీరెడ్డి
ఫొటోలు : వి. వీరారెడ్డి

# సుశ్రుతుడు చెప్పిన ప్లాస్టిక్ సర్జరీ!

నేడు బహుళ ప్రచారంలోకి వచ్చిన "ప్లాస్టిక్ సర్జరీ"ని వేల సంవత్సరాలకు మునుపే శస్త్రచికిత్సాపితామహుడు ఆయుర్వేదాచార్య శ్రీ సుశ్రుతాచార్యుడు తమ సుశ్రుత సంహితా గ్రంథంలో సూచించాడంటే ఆశ్చర్యం వేస్తుందికదా!

తెగిపోయిన ముక్కుకు చికిత్స తెలిపే సందర్భంలో ప్లాస్టిక్ సర్జరీ విధానాన్ని సుశ్రుతుడు ఇలా తెలిపారు –

విశ్లేషితాయాస్త్వథ నాసికాయా
వక్ష్యామి సంధాన విధింయథావత్
నాసా ప్రమాణం పృథివీరుహాణాం
పత్రం గృహీత్వాత్వవలంబ్య తస్య.
తేన ప్రమాణేన హి గండపార్శ్వా–
దుత్కృత్య బద్ధం త్వథ నాసికాగ్రమ్.
విలిఖ్య చాశు ప్రతిసందధీత
తత్సాధుబంధైర్భిషగ ప్రమత్తః.
రూఢం చ సంధాన ముపాగతం స్యా–
త్తదర్ధశేషం తు పునర్నికృంతేత్.

అంటే – ముక్కు తెగిపోయినప్పుడు తెగిపోయిన భాగాన్ని ఒక ఆకుతో కొలిచి ఆ ఆకును కత్తిరించుకొని ఆ కొలతకు సరిపోవునట్లు చెక్కిలి మీద ముందు మాంసంతో కూడిన చర్మాన్ని చెక్కిలిలో ఒకవైపు అతుక్కొని యుందునట్లే కోసి తీసుకొని, తెగిన ముక్కు భాగాన్ని కత్తితో గీచి దానిమీద పెట్టి కుట్లువేసి మందు పొడి చల్లి కట్టు కట్టాలి. వ్రణం బాగా ఆరిపోయి పైన పెట్టి కుట్టిన చర్మం ఆ ప్రదేశంతో బాగా కలిసిపోగానే చెక్కిలితో కలిసియుండు చర్మాన్ని కత్తిరించి విడదీసేయాలి. చెక్కిలిలో చర్మాన్ని తీసిన తావులో వ్రణానికవసరమైన చికిత్సజేసి వ్రణాన్ని మాన్పాలి.

నేడు బహుముఖంగా వృద్ధి చెందిన ప్లాస్టిక్ సర్జరీకి ఇదే మూల సూత్రమంటే సాహసం కాదేమో?

– ఆయుర్వేద శిరోమణి రాజరాజేశ్వరశర్మ






శ్రీ టి. జగన్మోహనరావు (బ్యాంక్ ఆఫ్ బరోడా, విజయవాడ) కు చి. సౌ. లక్ష్మికి విజయనాద మధు కల్యాణ మండపంలో జూన్ 17న వైభవంగా వివాహం జరిగింది.

# ప్రేమసాగరమథనం

## డాక్టర్ కొత్త రవీంద్రబాబు



(గతసంచిక తరువాయి)

కొంతి ఎంపోరియం ప్రొప్రయిటర్ సోనేమల్ షాపుకు రాగానే ముందుగ విలాసినికి కబురు చేసాడు.

"రామ్మా! కూర్చో!" అంటూ కుర్చీ చూపాడు సోనేమల్ బంగారు కవరింగ్ పళ్ళు కనపడేలా ఇకిలిస్తూ

మాట్లాడకుండా నిలబడ్డ విలాసినితో "మీకు లాటరీలో ఎనిమిది లక్షలు వచ్చినయ్యని విన్నాను" అన్నాడు.

మాట్లాడకుండా తల వొంచుకుని నిలబడ్డ విలాసిని సమాధానం చెప్పే లోపల రామం

"నిజంసార్! నిన్న ఆంధ్రా బాంక్‌లో ఎనిమిది లక్షలు డిపాజిట్ చేసి వెళ్ళాడట లాటరీ ఏజంట్!"

"ఆ! అలాగయితే మాకు పార్టీ యివ్వాలి!" అంది రమ

"అవునమ్మా! ఎనిమిది లక్షలు బాంక్ బాలెన్స్ వున్నాక ఇంకా మా షాపులో గుమాస్తా పని ఏం చేస్తావు? వుండు అందరికీ చల్లగా కూల్ డ్రింక్‌లు తెప్పిస్తా!"

అనుకోకుండా జరుగు తున్న సంఘటనలు చూస్తుంటే విలాసినికి కళ్ళు గిర్రున తిరిగి పోసాగాయి.

రామం వెళ్ళి కూల్ డ్రింక్ ఆర్డరిచ్చి వస్తూ వస్తూ ఆంధ్రా బ్యాంక్ క్లర్కును పిలుచుకు వచ్చాడు.

అతను షాపులో అడుగెడుతూనే "కంగ్రాట్యులేషన్స్ విలాసిని గారూ! నిన్న మీ పేర లాటరీ కంపెనీ ఏజంట్ వచ్చి ఎనిమిది లక్షలు డిపాజిట్ చేసి వెళ్ళాడు!" అని చెప్పాడు.

"లాటరీ కంపెనీ ఏజంటా?" అంది ఆశ్చర్యంగా విలాసిని. ఆమెకు లాటరీ టికెట్ కొన్న గుర్తు రాలేదు.

"అవును! మా మేనేజరు గారు స్వయంగా చెప్పారు! నిన్న మీ పేరుతో డిపాజిట్ చేసిన తను లాటరీ కంపెనీ ఏజంట్ అని!"

"అలాగా! నేను లాటరీ టికెట్ ఎప్పుడూ కొనలేదే!"

"నువ్వు కొనక పోతే నేమమ్మా! ఎవరయినా మీ బంధువులో స్నేహితులో నీ పేర టికెట్ కొని వుంటారు! అదృష్టం అందలం ఎక్కించటం అంటే యిదే!"

షాపులో వున్న వాళ్ళందరి చేతుల్లోనూ కూల్ డ్రింక్స్ పెట్టాడు ఐస్ పార్లర్ బోయ్.

చుట్టు పక్కల షాపులలో పని చేసే వాళ్ళు అంతా వచ్చి విలాసిని ముందు గుమిగూడారు

"ఇంకా గుమాస్తా వుద్యోగం ఎందుకమ్మా హాయిగా యింట్లో వుండక!"

"శుభ్రంగా నాలుగు ప్రదేశాలూ చూసి రావచ్చు! పదివేలు ఖర్చు పెడితే విదేశాలకే వెళ్ళి రావచ్చు!"

"ఎంచక్కా ఓ బంగళా కొనుక్కో! ఎర్రటి మారుతి కారు కొనుక్కొన్నావంటే ఎక్కడికి బడితే అక్కడికి చిటికెలో వెళ్ళి రావచ్చు!"

"కావలసి నన్ని నగలు చేయించుకుని పెట్టుకోమ్మా! బంగారం ధర పెరుగు తుందంటున్నారు" అన్నాడు బంగారం షాపు గుమాస్తా

"గొల్లపూడి దగ్గర పొలం కొన్నావంటే ఆర్నెల్లల్లో ధరలు రెట్టింపవుతాయి" అన్నాడు బ్రోకర్ గుమాస్తా

"మా జయా ఫైనాన్స్ కంపెనీలో బాండ్లు కొన్నావంటే 30% వడ్డీ వస్తుంది" అన్నాడు జయాఫైనాన్స్ కంపెనీ గుమాస్తా.

తలోక మాట చెబుతుంటే తల తిరిగి పోయిన విలాసిని సోనేమల్‌తో

"సార్! వంట్లో బాగా లేదు యింటికి వెళతాను" అని అడిగింది

"అయ్యో! అలాగే వెళ్ళమ్మాయ్!" అన్నాడు సోనేమల్

రామం టాక్సీ పిలుస్తా నంటే వినకుండా నెమ్మదిగా నడిచి వెళ్ళ సాగింది విలాసిని.

ఇంటికి వెళ్ళి చాప పరచుకుని పడుకోవాలను కుందామె!

గేటు లోనే ఎదురయి పండ్లికిలిస్తూ రాత్రిలో ఎనిమిది లక్షలొచ్చా యంటగా!" అంటూ ఎదురయ్యాడు చలమయ్య

"తల నొప్పిగా వుంది" అంటూ బెడ్ రూం తలుపు తెరుచుకుని చాప పరుచుకుని పడుకుంది విలాసిని

ఆమెతో మాట్లాడి లాటరీ విశేషాలడుగు దామని వుబలాట పడ్డ చలమయ్య నిరుత్సాహ పడి వెళ్ళి వరండాలో కుర్చీలో కూలబడ్డాడు

అతనవతలకు వెళ్ళగానే తలుపు లోపల గడి వేసుకు పడుకుంది విలాసిని.

అయితే ఇరుగు పొరుగు యిళ్ళల్లో వాళ్ళు, విలాసిని స్నేహితులు వచ్చి ఆమెను పలకరించి వెళుతుండటంతో విశ్రాంతి తీసుకో వీలు కలిగింది గాదామెకు!

వచ్చే పోయే వాళ్ళందర్ని చూస్తూ వాళ్ళ మాటలు వింటూ ఉత్సవ విగ్రహంలా కూర్చుండి పోయాడు చలమయ్య! మేడ వరండాలో!

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

నాగరాజుకు వంగి సలామ్ చేసి నిటారుగా నిలబడ్డాడు కోటి

జరిగిన కథ – 6: నారాయణరావు చివరి కోరికపై సందీప్ విజయవాడ వస్తాడు. విలాసిని గురించి, ఆమెను వేధిస్తున్న నాగరాజు గురించి తెలుసుకుంటాడు. తాను తెచ్చిన ఎనిమిది లక్షల రూపాయలు విలాసిని ఖాతాలో జమ చేస్తాడు. నాగరాజు ముఠా స్థావరం మీద పోలీసులు దాడి చేస్తారు తన మీద దాడితో విలాసిని తన ప్రత్యర్థి సన్నీతో కలిసి పోయిందని నాగరాజు అనుమానిస్తాడు. సన్నీ కుడి భుజమైన సాంబును చంపేయిస్తాడు. నాగరాజు మీద పగ తీర్చుకోవాలని ఆలోచిస్తున్న సన్నీకి విలాసిని గురించి తెలుస్తుంది.

"శబాష్ కోటీ! సన్నీగాడి షాపు నామ రూపాలు లేకుండా చేసావ్! వాడి నమ్మిన బంటు సాంబును మాడ్చి మసి చేసావ్!" అన్నాడు నాగరాజు మీసం మెలేస్తూ.

"ఏదో బాబుగారి దయుండాలి గాని సన్నిగాడొక లెక్కా!" అన్నాడు కోటి వినయంగా.

"నీలా నమ్మకంగా చెప్పిన పని చేసుకొచ్చే వాడొక పైసా తింటేనేం?" అంటూ వందరూపాయల కట్ట అతని చేతిలో పెట్టాడు నాగరాజు.

మళ్ళీ వంగి సలాం చేసాడు కోటి.

"కోటీ! మాట!"

"చెప్పండి బాబు గారూ!"

"మెరికల్లాంటి మనుష్యుల్ని పది మందిని తీసుకుని సాయంత్రం ఆరింటికి నాదగ్గరకు రా!"

"అలాగే బాబు గారూ!" అంటూ సలాం చేసి వెళ్ళి పోయాడు కోటి.

* * * * * * * * * *

డిస్కో డాన్సర్ రసిక యింట్లో వుండే టైగర్ రాంసింగ్‌కు కబురంపాడు సన్నీ.

"బాబుగారు కబురంపారట!" అంటూ వినయంగా చేతులు కట్టుకుని నిలబడ్డాడు టైగర్.

"టైగర్! ఈ సిటీలో నువ్వు చేయలేని పనిలేదు!" అన్నాడు సన్నీ నర్మ గర్భంగా.

"ఏదో బాబుగారి దయ మా మీదవున్నంత కాలం మాకు దిగుల్లేదు!" అన్నాడు వినయంగా.

డాబీ లో పలగదిలో కూర్చుని తమ సంభాషణ వింటుందనో ఏమో టైగర్‌ను దగ్గరకు పిలిచి అతని చెవిలో ఏదో చెప్పాడు సన్నీ.

అలాగే నన్నట్టు తలూపిన టైగర్ చేతిలో తన వేలినున్న రవ్వల వుంగరం తీసి వుంచాడు సన్నీ.

ప్రసాదం కళ్ళకద్దు కున్నట్టు వుంగరాన్ని కళ్ళ కద్దుకుని బయల్దేరాడు టైగర్.

* * * * * * * * * *

జ్యోతి హోటల్‌కు వెళ్ళి భోంచేసి నిద్ర పోయాడు దీప్.

"సార్? సార్?" అని శివ వాకిలిదగ్గర వుండి పిలవడంతో మెలకువ వచ్చింది దీప్‌కు.

"కాఫీ తెమ్మంటారా?"

"తీసుకురా శివా!" అని ఫోన్‌లో కాంతి ఎంపోరియంకు డయల్ చేసాడు దీప్.

"విలాసిని గారున్నారా? మాట్లాడాలి!"

"లేరు! వంట్లో బాగుండక పోతే యింటి కెళ్ళారు!" అని జవాబిచ్చాడు సోనేమల్ యాసగా.

మళ్ళీ "మీరెవరు?" అని అతడడిగిన ప్రశ్నకు జవాబు చెప్పకుండా ఫోన్ పెట్టేశాడు.

విలాసిని ఎనిమిదిన్నర వరకు షాపులో వుంటుందని ఆ సమయానికి అక్కడకు వెళ్ళి ఆమె రూముకు వెళ్ళేప్పుడు వెంబడే తోడుగా వెళదామని



## రచయిత జవాబులు



...మోహన్, జంషెడ్‌పూర్

ప్ర: విలాసిని డాటర్ ఆఫ్ సి. రాఘవరావు అని రాశారు– తండ్రితో సంబంధం లేనప్పుడు అలా రాయడంలో అర్థం ఏమిటి?

జ: పెళ్ళికాని అమ్మాయి తండ్రి పేరు వ్రాయాలి బ్యాంక్ ఎకౌంట్ ఓపెన్ చేసేప్పుడు–!

...పాల్ చింతకుంది, చిత్తూరు

ప్ర: క్షీరసాగర మథనంలో ముందు విషం తర్వాత అమృతం– ప్రేమసాగర మథనంలో.

జ:చివరకు చదవండి!

...గళ్ళ వెంకటేశ్వరరావు, అమ్మాపాలెం

ప్ర: వైద్య సాహిత్య రంగాలలో దేనికి ప్రాముఖ్యం ఇచ్చారు?? ఏమి ఆశించి సాహిత్య రంగంలోకి వచ్చారు.

జ: పోయిన వారం సమాధానాలు చదవండి.

...స్. శ్రీనివాసరావు, ఖర్గపూర్

ప్ర: పాతకుల కుటుంబాలు బాగుపడాలనా యీ సీరియల్ వ్రాసింది??

జ: అవును!! మీరు యింకో రకంగా ఎందుకను...వాలి?

... రాజ్యలక్ష్మి, గన్నవరం

ప్ర: మీరు ఏ ఉద్దేశంతో రచనలు చేస్తున్నారు?? సమాజానికి సాహిత్యరంగానికి సేవ చేద్దామనా?? పేరు కోసమా??

జ: సమాజానికి సాహిత్యానికి సేవ చేస్తూ పేరు తెచ్చుకుందామని!!

...కో డవరపు నాగేశ్వరరావు, రమాదేవి, హైదరాబాద్

ప్ర: డాక్టరుగా సాహిత్య రచన ఎలా సాగిస్తున్నారు??

జ: తీరిక వుండి బుద్ధి పుట్టినప్పుడు.

ప్ర:పురుషునికంటె స్త్రీయే గొప్పదని నా అభిప్రాయం. మీరేమంటారు?

జ: లోకానికంతకూ వర్తించే సూత్రం కాదది!

ప్ర: వృత్తిలో విజయం సాధించాలంటే ప్రోత్సాహం కావాలి.

జ:స్వశక్తితో పైకి వచ్చిన వాళ్ళూ వున్నారు.

...మీన బొకారియా, పత్తికొండ

ప్ర: 'ప్రేమసాగర మథనం ఆసక్తికరంగా, ఉత్సాహంగా వుంది. చివరకు యిలాగే వుండాలి.

జ:అలాగే మరి!! మీ అభిమానానికి కృతజ్ఞతలు.

పుత్తూరు శ్రీకాంత్, బళ్ళారి

ప్ర: డ్రగ్ ఎడిక్షన్ నిరుద్యోగ సమస్య గురించి ఎందుకు వ్రాయరు?

జ: నా మొదటి నవల జలకన్య డ్రగ్ ఎడిక్షన్ గూర్చి వ్రాసిందే! మిగిలిన నవలల్లో సందర్భానుసారం మిగిలిన సమస్యలు చర్చించడం జరిగింది.

పి. రాము, గుంటూరు

ప్ర: ఉద్యోగాలకు చదువులకు రిజర్వేషన్లు ఎందుకు?

జ: వోట్ల కొరకు.

### ఉత్తమ ప్రశ్న

బిందుమాధవి, మైలవరం

ప్ర: నవల వెరైటీగా వుంది- సాహిత్య పరమైనదనీ అంటారు– తేడా ఏమిటి.

జ: విలక్షణమైన వైవిధ్యపూరితమైన నవలలను వెరైటీ నవలలనీ– భాష శైలి, కథా కథనం, పాత్ర చిత్రణ, వర్ణనలు బాగున్నప్పుడు సాహిత్య పరంగా బాగున్నదనీ అంటారు. ప్రేమసాగర మథనం ఎటువంటిదో మీరే నిర్ణయించుకోగలరు.

వేమూరి మాధవ, సికింద్రాబాద్

ప్ర: డాక్టర్లది బిజీ లైఫ్. మీరు సీరియల్స్ ఎలా రాస్తున్నారు.

జ:ఈ శీర్షికలోనే సమాధానం వుంది.

సి. హెచ్. ఈశ్వరప్రసాద్, కోటనందూరు

ప్ర: ప్రేమసాగర మథనం చాలా బావుంది.

జ: మీ అభిమానానికి కృతజ్ఞతలు.

భారతి, రూర్కేలా

ప్ర: విలాసిని దీప్‌లకు వివాహం జరిగేట్లుంది. డాక్టర్లు మేనరికాన్ని ప్రోత్సహించరు గదా?

జ: చివరకు ఆగి యీ ప్రశ్న వేయండి.

వేల్చూరు బాలాజీ, కొర్లగుండి, తిరుపతి

ప్ర: 8 లక్షలు కాష్‌గా ఎవరూ తీసుకురారు తెచ్చినా హోటల్‌లో వుంచరు!!

జ: మరో విధంగా చేస్తే ఆ విషయం యితరులకు తెలుస్తుందని అలా చేసాడు సందీప్.

ఎమ్. బి. కళ్యాణి, బెండమూర్లంక

ప్ర: సాహిత్యం వలన వరకట్న దురాచారం పోతుందా?

జ: స్త్రీకి ఆస్తి హక్కు వచ్చిన తర్వాత క్రమంగా వరకట్న దురాచారం పోతుందేమో. హితంగా చెప్పేది సాహితి– నెమ్మదిగా నచ్చే విధంగా చెబుతూ వుంటే కొంత కాలానికైనా మనవాళ్ళు మారుతారేమో

జి రాము, నందిగామ

ప్ర: నేటి కాలంలో ప్రేమ విలువ లేకుండా పోవటానికి కారణం.

జ: ఎక్కడో ఎప్పుడో చూసిన వాట్నిలో కానికంతకూ అన్వయించకు రామూ!

చలసాని స్రవంతి, కొవ్వూరు

ప్ర: యండమూరి గారిపై మీ అభిప్రాయం?

జ: నో కామెంట్ ప్లీజ్!

పి. వి. సతీష్‌కుమార్, హనుమాన్ జంక్షన్

ప్ర: మొత్తం ఎన్ని నవలలు రాసారు.

జ: ఇప్పటి వరకు 20 రాసాను.

పి. శ్రీధర్, టింపుల్ ఆల్వాల్

ప్ర: జేబులో వున్న శాలువా తీసి విలాసిని మీదుగా కప్పాడు అని వ్రాసారు. జేబులో శాలువా ఎలా పడుతుంది?

జ: ఆడవాళ్ళ కోసం కొన్న శాలువా అంటే వల్లెవాటుగా భుజాలను కప్పుకోడానికుపయోగ పడేది పొంటు జేబులో పడుతుంది శ్రీధర్! □

## ప్రేమసాగర మథనం

...నుకున్నాడు దీప్. అందుకే హోటల్ రూమ్‌కు వచ్చి నిద్ర పోయాడు.

కాని ఆమెకు వంట్లో బాగోక యింటికి వెళ్ళిందనగానే దీప్ కలవరపడి పోసాగాడు.

కాఫీ తీసుకుని వచ్చిన శివను

"ఈ సిటీలో మంచి హాస్పటల్ వుందా?" అని అడిగాడు.

"హాస్పటల్స్‌కు ఏమిసార్! లెక్క లేనన్ని వున్నాయి. సూర్యారావు పేటలో పెద్ద నర్సింగ్ హోమ్‌లు చాలా వున్నాయి" అన్నాడు. టైమ్ చూసుకున్నాడు దీప్. అయిదున్నర అయింది.

"శివా! నీ డ్యూటీ ఎన్నింటి వరకు?" అని అడిగాడు దీప్.

"డ్యూటీ అయిపోయింది సార్! మీరు నిద్ర లేవలేదని వుండి పోయాను!"

"సరే అయితే నాతో రా! ఈ వూళ్ళో డాక్టర్లు ఆస్పత్రులు నాకు కొత్త!" అని అడిగాడు దీప్.

"అలాగే సార్!"

దీప్, శివలు టాక్సీలో సూర్యారావు పేటలో విలాసిని రూం దగ్గరకు వెళ్ళారు. టాక్సీ గేటు దగ్గరే వుంచి లోపలకు వెళ్ళాడు దీప్.

దీప్ లోపలకు వెళ్ళగానే టాక్సీ డ్రైవర్ శివతో "గురూ! ఆయిల్ అయిపోవచ్చింది! వెళ్ళి నిముషంలో డీజిల్ పోయించుకు వస్తా" నని చెప్పి వెళ్ళిపోయాడు.

★ ★ ★ ★ ★ ★ ★ ★ ★ ★

దీప్ గేట్‌లో అడుగు పెట్టగానే ఎదురుగా వున్న మేడ వరండాలో కూర్చున్న చలమయ్య పరుగెత్తుకు వచ్చాడు.

"మీ మేనత్త కూతురుకు సుస్తీ చేసింది! పొద్దుట్నుంచీ బాగా లేదు పాపం" అన్నాడతను.

రాత్రి అతన్ని వుడికించటానికి విలాసిని 'మా మేనమామ కొడుకు' అని చెప్పిన విషయం గుర్తొచ్చింది దీప్‌కు.

మాటలు విని రూము వాకిలి దగ్గర కొచ్చింది విలాసిని.

"హలో దీప్!" అందామె. దీప్‌ను చూడగానే వాడిపోయిన ఆమె ముఖం లోకి వెలుగు రావడం గమనించాడు చలమయ్య.

అతనక్కడే నిలబడి దీప్‌ను విలాసినిని మార్చి మార్చి చూస్తుండడంతో విలాసినికి కోపం వచ్చి

"చుక్కమ్మ పిన్నీ! చుక్కమ్మ పిన్నీ!" అంటూ కేకలు వేసింది.

చలమయ్యకు భార్య చుక్కమ్మ అంటే భయం.

"వయసులో వున్న ఆడపిల్ల వంక అలా చూస్తావేం" అని అతన్ని సతాయిస్తుందామె.

మేడలో చుక్కమ్మ అయితే పలుక లేదు గాని చలమయ్య మాత్రం విలాసిని గది ముందు నుండి అవతలకి వెళ్ళి పోయాడు.

"విలూ! నీకు వంట్లో బాగోలేదట! పాపతను చెప్పాడు" "దీప్. తనను విలూ అని పిలువగానే విలాసిని వళ్ళు పులకింతలతో నిండి పోయింది.

"నాకు లాటరీలో ఎనిమిది లక్షలు వచ్చాయని అంతా వెంటబడి వూదర పెడుతుంటే దిక్కుతోచక యింటికి వచ్చాను! కాసేపు పడుకుంటే తల నొప్పి తగ్గుతుందనుకుంటే చలమయ్య గోల ఎక్కువైంది! ఇరుగు పొరుగూ వచ్చి పోతూ క్షణం విశ్రాంతిగా వుండనివ్వ లేదు!"

"అదా సంగతి! వాళ్ళ గోల తప్పించుకోవాలంటే ఒకటే మార్గం. ఏదైనా వూరు వెళ్ళి నాల్రోజులు వుండి వస్తే సరి!"

"నేను అదే అనుకుంటున్నాను! మద్రాస్‌లో నా స్నేహితురాలు షీలా వుంది! వెళ్ళి కొన్నాళ్ళ పాటు ఆమె దగ్గర వుంటే బాగుండును అనిపిస్తున్నది!"

"సార్! సార్!" శివదీప్ చెవిలో నెమ్మదిగా చెప్పాడు. "కోటి గాడు బాబ్‌తో సహా సందులో తిరుగు తున్నాడు. వాడు వున్న చోట వుండడం మంచిది గాదు.

వాడు అడుగెడితే రక్తం కాలవలై పారుతుంది!" అన్నాడు శివ.

శివ మాటలు పూర్తి గాకుండానే 'క్రీక్' మని శబ్దం చేసుకుంటూ ఎంబాసిడర్ కారు వచ్చి సందులో ఆగింది. ఆ ఎంబాసిడర్ నిండుకూ వున్న టైగర్ అతని అనుచరులు క్షణాలలో కారు దిగి సందు నాలుగు మూలలూ పరికించి చూడసాగారు.

టైగర్ కళ్ళు మసక చీకట్లో కోటి ఆకారాన్ని పోల్చుకున్నాయి అదే క్షణానే కోటి టైగర్‌ను చూసాడు.

శరీరంలో అణువణువునా పేరుకు పోయిన కక్ష, కసి ద్వేషం ఒక్కసారి పెల్లుబికి విచక్షణా జ్ఞానం నశించిందిద్దరికీ!

వచ్చిన పని ఏమిటో మర్చి పోయారు కోటి టైగర్!

క్షణాలలో కోటి అనుచరులు టైగర్ కారును చుట్టు ముట్టారు.

అనుచరులను వుసి కొల్పుతూ కోటి మీదకు విరుచుకు పడ్డాడు టైగర్.

కోటి సన్నగా యినుప సువ్వలా పొడుగ్గా వుంటాడు. టైగర్ పొట్టిగా కుదమట్టంగా వుంటాడు.

కోటి టైగర్‌లు కలబడ్డప్పుడు కొండ చిలువ పెద్దపులి తలపడ్డట్టుగా కనపడింది గేటు దగ్గర నిలబడి చూస్తున్న చలమయ్యకు.

'రేయ్! నాకే అడ్డొస్తావ్‌రా! దొంగనా..... " అంటూ తలతో కోటి రొమ్ము మీద పొడిచాడు టైగర్. కొంచెం వెనక్కు పడి లేచి మెరుపులా టైగర్ వెనక జేరి రెండు చేతులూ టైగర్ చంకల కిందుగా పోనిచ్చి మెడను డెడెలాక్‌లో వంచుతూ అరవ సాగాడు కోటి "వొరేయ్! కోటి కెదురొస్తావురా" అంటూ.

ఇనుప చువ్వలలాటి కోటి చేతులు టైగర్ మెడ చుట్టూ బిగుసుకో సాగాయి. మెడ నరాలు నొక్కుకుని అతనికి శ్వాస పీల్చు కోవడం కష్ట మయిపో సాగింది. చేతులతో వెనక నున్న కోటిని బాదసాగాడు టైగర్. డెడెలాక్ వల్ల అతని చేతులు అంత ఫ్రీగా కదలక కోటికి సరైన దెబ్బ తగుల లేదు! క్షణాలలో తన పని అయి




ఏ. ఏ. యస్. – కడప

మనిషి చనిపోయిన తర్వాత మూత్ర పిండములను దానం చేయుటకు వీలు కలదా? ఈ విధానమును వివరముగా తెల్పండి

చనిపోయిన కొన్ని నిముషముల వరకూ ఈ వీలు వుంటుంది. కాని ఆ రోగి రక్తపు గ్రూపు ఇదివరకే తెలిసి వుంటే మంచిది.

సాధారణంగా మామూలు స్థితిలో ఉన్న వారి మూత్ర పిండాలనే రోగులకి అమర్చటం జరుగుతుంది. దానం చేసే వారి రక్తపు గ్రూపు మొదలైన వన్నీ రోగికి ఉన్న వాటితో సరిపోవలసి ఉంటుంది. రెండు శస్త్ర చికిత్స టీములు ఈ ఆపరేషన్ చేయటం జరుగుతుంది. ఒక టీము దానం చేసే వారి మూత్ర పిండాలను తియ్యటానికి, మరొకటి ఆ మూత్ర పిండాలను అమర్చటానికి పని చేస్తాయి.

ఎన్. ఎన్. – విజయనగరం

హృద్రోగ నిపుణులు నాకు పరీక్షచేసి కోరోనరి హార్ట్ డిసీజ్ వున్నదని చెప్పారు. అంటే ఏమిటి? మందులతో తగ్గుతుందా?

హృదయం అన్ని వేళలా రక్తంతో సంబంధపడి వున్నా, దాని కండరాలకి వేరే రక్త సరఫరా అవసరం. ఇలా హృదయ కండరాలకి రక్తాన్ని తీసుకువెళ్ళే రక్తనాళాలను కారోనరి ఆర్టరీలు అని అంటారు. వీటిలో అవరోధం ఏర్పడినప్పుడు హార్ట్ అటాక్ వస్తుంది. ఇలా అవరోధం ఏర్పడటానికి, శరీరంలో అధికంగా కొలెస్ట్రాల్ ఉండటం దోహదం చేస్తుంది. అధిక రక్తపుపోటు, మధుమేహం, పొగ పీల్చటం, మధుపానం మొదలైనవన్నీ ఈ రోగానికి దోహదకారులే.

హార్ట్ అటాక్ వచ్చిన వారు వైద్యుల పర్యవేక్షణలో చికిత్స పొందాలి. ఈ రోగం రాగల అవకాశాలు వున్నవారు అప్పుడప్పుడూ వైద్య పరీక్ష చేయించు కోవాలి. ఆహార నియమాలు పాటించటం, వ్యాయామం చాలా అవసరం.

పి. వి. జె. ఆర్. – దర్శి

ఎమిబియాసిస్ అంటే ఏమిటి? దాని లక్షణాలను, నివారణోపాయములను చెప్పగోర్తాను.

ఎంటమీబా హిస్టోలిటికా అనే అమీబాలు జీర్ణకోశంలో చేరి జిగట విరోచనాలను కలుగ చేయటమే అమీబియాసిస్ అంటే.

వీటి వల్ల జిగట విరోచనాలే కాక, కడుపునెప్పి, లివర్ వాపు, కఫం, మెదడు వాపు మొదలైన అవాంతరాలు వచ్చే అవకాశం వున్నది.

వైద్యుల సలహా ప్రకారం మందులు వాడాలి. పరిశుభ్రమైన నీటిని బాగా మరగపెట్టి వడకట్టి త్రాగటం, వ్యక్తిగత పరిశుభ్రత, కాయగూరలు బాగా కడిగి వాడటం, మరుగుదొడ్ల సక్రమ నిర్మాణం, ఆహారం సరఫరా చేసే వారిని పరీక్షించటం అదనంగా తీసుకోవలసిన జాగ్రత్తలు. □

## ప్రేమసాగర మథనం

పోతుందని భయపడి సర్వ శక్తిని కూడ దీసుకుని ముని గాళ్ళతో నేలను తన్నుతూ పైకెగిరాడు టైగర్.

కోటి గడ్డం టైగర్ తలను అదిమి వుంచి పెట్టిందంత వరకూ! అందు వలనే అతడికి టైగర్ తల బలవంతంగా పైకి నెట్టడంతో గడ్డం అదిరి చెవి ముందు నరాలు విపరీత మైన సలుపుతో బాధించాయి. డెడెలాక్‌తో బిగుసుకున్న కోటి చేతులు పట్టు వదిలాయి.

గిరుక్కున వెను దిరిగిన టైగర్ అందిన చోటల్లా పిడికిళ్ళతో పొడుస్తూ కేకలు వేయ సాగాడు క్షణాలలో జరిగిన మార్పుకు విస్తుపోయి స్ప్రాట జీ మార్చి ఎలర్టుగా టైగర్ దెబ్బలు తప్పుకుంటూ వీలయినప్పుడతన్ని ముష్టి ఘాతాలతో బాధించ సాగాడు కోటి.

బాస్ లిద్దరూ అలా తలపడుతుంటే వాళ్ళ అనుచరులు సోడాబుడ్లు పేలుస్తూ సైకిల్ చైనులు విసురు కుంటూ, ఏసిడ్ నింపిన కాళీ ఎలక్ట్రిక్ బల్బులు రువ్వుతూ పరమ భయంకరంగా బూతులు తిడుతూ ఘర్షణకు దిగి పోయారు!

* * * * * * * * * *

"సార్! కోటి ముఠా టైగర్ ముఠా సందులో యుద్ధం చేస్తున్నారు! మనం యిక్కడ వుండడం మంచిది గాదు" అన్నాడు శివ దీప్‌తో.

"విలూ! మనం యీ మేడ ఆవరణ నుండి బయట పడే మార్గం వుందా?" అని అడిగాడు దీప్.

విలాసిని సమాధానం చెప్పకుండా తటపటాయిస్తుంటే ఆమెను గుర్తుపట్టిన శివ అమ్మాయి గారూ! మీరు ఇక్కడ వుండటం మంచిది గాదు. వాళ్ళు వచ్చింది మీకోసమే! వాళ్ళ యుద్ధం చూస్తుంటే కొన్ని తలలు ఎగిరేట్టున్నాయి! కోటిగాడు నాగరాజు దగ్గర డబ్బు పుచ్చుకుని సన్నీ గాడి షాపు నాశనం చేసాడని సిటీ అంతా గుప్పు మంటుంది. కాసేపట్లో పోలీసులొచ్చి పడతారు. పెద్ద చిన్నా లేకుండా పట్టుకు బాధిస్తారు!" అన్నాడు.

"అవును విలూ!" అన్నాడు దీప్.

"మేడ వెనుకన వున్న తలుపు తీసుకుంటే వెనక సందులోకి వెళ్ళొచ్చు!" అంది విలాసిని.

"పద వెళ్దాం" అంటూ తొందర చేసాడు దీప్.

గది వెనుక నున్న తలుపు తీసుకుని బయల్దేరింది విలాసిని.

ఆమె వెనకనే బయల్దేరారు దీప్, శివ.

మేడ వెనుక నున్న తలుపు తీస్తుంటే వంటింట్లోంచి చుక్కమ్మ "ఎక్కడికమ్మాయి?" అని కేకేసింది.

సమాధానం చెప్పవద్దని చూపుడు వేలు నోటి కడ్డంగా వుంచాడు దీప్.

చప్పున ముగ్గురూ గుమ్మం దాటి వెనుక సందులో ప్రవేశించి తలుపు దగ్గరకు వేసారు.

వంటయింటి వెనక్కు వచ్చిన చుక్కమ్మకు తలుపు దగ్గరకు వేసి వుండడం కనపడి" విలాసిని వెనక సందులో సరోజ యింటికి వెళ్ళుంటుంది" అనుకుంటూ మళ్ళీ వంట యింట్లోకి వెళ్ళిపోయింది. చెముడు వల్ల వంటయిల్లు మేడ వెనుక భాగంలో వున్నందు వల్లా ఆమెకు ముందు సందులో జరుగుతున్న గలాటా వినపడలేదు.

తల వంచుకుని వస్తున్న విలాసిని చేయి దొరక పుచ్చుకొని "ఇప్పుడెక్కడికి పోతావ్" అంటూ వెకిలిగా నవ్వాడు నాగరాజు.

(ఇంకా ఉంది)




ఆమె నడుస్తుంది....

ఆమె వెనుక నేనూ నడుస్తున్నాను..

ఆమె వేగంగా నడుస్తుంది... నేనూ వేగంగానే నడుస్తూ ఆమెను అనుసరిస్తున్నాను

శ్రీరంగపురం దాటి పాండురంగపురం మొదటి వీధిలోకి ప్రవేశించిందామె.. మలుపు తిరిగి ఎటు వెళ్ళి పోతుందోనని నేను నడక వేగం మరికాస్త పెంచాను. .

ఆమెను ఇందాక ఆర్టీసీ కాంప్లెక్సులో చూసాను.. ఆమెతో ఎవరో ఒకతను ఉన్నాడు

ఆదివారం అని ఫస్ట్ షోకి బయల్దేరితే ఏ సినిమా టికెట్టూ దొరకలేదు. అందుకే తిరిగి ఇంటికి వెళ్ళిపోదామని కాంప్లెక్సుకు వెళ్తే అక్కడ ఓ స్థంభం చాటున మాట్లాడుకుంటున్న వాళ్ళిద్దరూ నా దృష్టిలో పడ్డారు

ఎందుకో వాళ్ళు మాట్లాడుకొనే విధానం నాకు కాస్త అనుమానాన్ని కలిగించింది ..

చుట్టు ప్రక్కల వారిని ఓ కంటితో గమనిస్తూ ఆమె అతనితో మాట్లాడుతుంది... అతను కాసేపు సీరియస్‌గా. మరి కాసేపు వెకిలిగా నవ్వుతూ ఆమెతో గుసగుసలాడుతున్నాడు మధ్య మధ్యలో ఆమె తల అడ్డంగా ఊపుతుంది అతను ఆమెను వారిస్తున్నట్టుగా, బ్రతిమలాడుతున్నట్టుగా మాట్లాడుతున్నాడు

అఖరుకు ఆమె అలాగే అన్నట్టుగా తలూపింది . అతను వాచీ వైపు చూసి ఏదో చెప్పి వెళ్ళిపోయాడు.

ఒక నిముషం అక్కడ నిలబడి ఆమె బయల్దేరింది....

ఇంటికి వెళ్ళినా బోరు కొట్టడమే తప్ప ఇంకే ముందని అనుకొని నేను కూడా ఆమెకు తెలియకుండా అనుసరించాను.

రెండు చోట్ల రిక్షాల్ని బేరమాడింది గానీ బేరం కుదరలేదేమో ఆమె నడిచే వెళ్తుంది .

ఆ మలుపు తిరిగిన నాకు మరో వీధిలోకి మళ్ళుతూ ఆమె కన్పించింది...

ఎక్కడ ఆమె కన్పించకుండా పోతుందోనని నేను ఆమెనే గమనిస్తూ నడుస్తున్నాను .

అంతలో నన్నేదో గుద్దింది .. నేను ప్రక్కకు పడిపోబోయి నిలదొక్కుకున్నాను . నన్ను గుద్దేసి ఓ సైకిలతను క్రింద పడిపోయాడు. నన్నేదో అంటు (తిడుతు)న్నాడు గానీ నేనేదో చెప్పేసి ఆమె వెళ్ళిన వీధిలోకే నేనూ వెళ్ళేను .

సరిగ్గా అప్పుడే లైట్లు వెలిగాయి ఆ వీదిలో ఆ వెలుతుర్లో ఆమె కోసం నా కళ్ళు ఆత్రంగా వెదుకుతున్నాయి గానీ ఆమె నాకు కన్పించలేదు...

ఒక నిముషం అక్కడే నిలబడి పరిసరాల్ని గమనిస్తున్న నాకు "..... వస్తారా?. ." అన్న ప్రశ్న వినబడి ప్రక్కకు తిరిగి చూసాను. .

ఎదురుగా ఓ యువకుడు...

సన్నగా, పీలగా ఉన్నాడతను... గళ్ళ బనీనును మాసిపోయిన తెల్ల ఫాంటులోకి ఇన్ చేసాడు... నములుతున్న కారా కిళ్ళీని బుగ్గ మార్చుతూ నా వైపు చూసి అదోలా నవ్వుతున్నాడు.

. ఎక్కడికి?. ." అని అడిగాను.

ఒక కన్నును అదోలా కొడుతూ తల ఎగరేసాడు... అతను తల నెగరేసిన వైపుకి చూసాను. ఆ వీధిలోనే మరో చిన్న సందు ఉంది...

అటు వైపుకి చేయి చూపిస్తూ . ."రండి, కొబ్బరి ముక్కలాంటోళ్ళున్నారు... ఇప్పుడే ఓ కొత్త పిట్ట కూడా వచ్చింది .." అన్నాడు..

నేను కాస్త సంశయించాను...

'రేటు గురించి ఆలోచించకండి, నేను బేరమాడి పెడ్తాను రీజనబుల్‌గానే ఉంటుంది."

ఇప్పుడే క్రొత్త పిట్ట వచ్చింది. .' అన్న వాడి మాట విన్నాక నాకు 'ఆమె' గుర్తొచ్చింది . ఒకవేళ

'ఆ క్రొత్త పిట్ట ఆమేనేమో!? అన్పించింది...

నా ముఖ కవళికల్ని బాగా గమనిస్తున్నట్టున్నాడు "... ఆలోచించకండి సార్, రండి సార్!" అన్నాడు వాడు

ఇలాంటి సంఘటనలు ఇంతకు ముందు కొన్ని సార్లు ఎదురయ్యాయి గానీ నేనెప్పుడూ అడుగు ముందు కేయలేదు .. కానీ ఇప్పుడు ఆ అమ్మాయి అక్కడ ఉంటుందేమో అని అన్పించి మాత్రమే ఇంత వరకూ అక్కడ నిలబడటం జరిగింది...

వాడలా అడిగిన తర్వాత .. "ఆ అమ్మాయి అక్కడ ఉంటే ఏమిటట? ఉంటే మాత్రం నేనెందుకెళ్ళాలిట?" అని అన్పించింది...

అందుకే " అక్కర్లేదు!" అని చెప్పేసి అక్కడ నుండి చకచకా నడచుకుంటూ వెళ్ళి పోతుంటే వెనుక నుండి... "ఎర్రి బాగులాడులా ఉన్నాడీడు" అని వాడన్న మాట విన్పించింది గానీ నేను వాడినేమీ అనలేదు, అసలు వెనక్కి తిరిగి చూడలేదు...

ఆ ఏరియా నుండి బయట పడ్డాక అప్పుడు నా కన్పించింది. కాంప్లెక్సులో వాళ్ళను చూసి అసలు నేనెందుకు ఆ అమ్మాయి వెంట వెళ్ళాను? ఆ అమ్మాయి ఎవరో, ఎందుకు వెళ్తుందో తెలుసు కోవాలన్న ఉబలాటం నాకెందుకు కలిగింది?

అయినా ఆ అమ్మాయి ఎలాంటిదైతే నాకెందుకు?

వాచీ చూసుకున్నాను... ఏడు గంటలయ్యింది .. ఈ గంట సేపూ నేను చేసిన నిర్వాకం తలచుకుంటే నా మీద నాకే చిరాకేసింది'

ఆ రాత్రంతా నాకు 'పాణి' మాటలే గుర్తొచ్చేయి'

* * * *

ఆ రోజు ఆఫీసులో నా కొలీగ్ పాణి వచ్చి "ఇంటి దగ్గర ఖాళీయే కదా, సాయంత్రం అలా రూమ్‌కు రావోయ్!" అన్నాడు.

"విశేషం ఏమైనా ఉందా?" అని అడిగాను...

"విశేషాన్దేముంది, ఏదైనా ప్రోగ్రాం వేసుకుందాం!" అన్నాడు...

"అలాగే, ఇంటికి వెళ్ళి వస్తాను ...' అన్నాను

# ఆత్మహత్య

నేను...

ఆ రోజు సాయంత్రం ఇంటికి వెళ్ళి ఆరు గంటలకి పాణి రూమ్‌కి వెళ్ళాను... పాణి రూమ్‌లో రిలాక్స్‌డ్‌గా కూర్చున్నాడు..

"నీ కోసమే ఎదురు చూస్తున్నాను... రా!" అన్నాడు...

నేను వెళ్ళి అక్కడున్న పేము కుర్చీలో కూర్చున్నాను...

"సినిమాకు వెళ్దామా?" అని అడిగాను పాణిని...

" సెకండ్ షోకి వెళ్దాంలే!" అన్నాడు పాణి....

"హాల్సన్నీ ఈ ప్రక్కనే కదా, ఫస్ట్ షోకే వెళ్దాం..." అన్నాను..

"సినిమా కంటే మంచి ప్రోగ్రామ్ ఉందొచ్చు ఇప్పుడు...."

"ఏమిటి?"

". .. నాలుగు రోజుల క్రితం అనుకోకుండా అటు వైపుకి వెళ్తే ఓ మంచి 'ఫామిలీ ట్రిపు' దొరికింది. ఆ రోజు అక్కడ ఓ గంట ఉండి వచ్చేసాను గానీ పెద్దగా సాటిస్‌ఫాక్షన్ కలగలేదు... వచ్చేసేటప్పుడు అదే అంది, ఎప్పుడైనా ఉండాలంటే కబురు పెట్టండి అని! అనుకోకుండా ఇందాక ఆఫీసు నుండి రూమ్‌కి వస్తుంటే ఆ బ్రోకరు గాడు కన్పించాడు, నా రూమ్‌లో నే ఏర్పాటు చెయ్యమని చెప్పేను... వాడు అదే పని మీద వెళ్ళాడు, ఇంకా సేపట్లో పిట్ట వచ్చేయొచ్చు .." అన్నాడు పాణి....

"అయితే ఇంక నేనెందుకు? వస్తాను.. ' అని లేవబోయాను....

"ఉండు గురూ, నువ్వూ ఓ చూపు చూద్దువు గాని....!"

'నా కలాంటివి...."

"ఇష్టం లేదని అంటావ్, అంతే కదా? పోనీ అది వచ్చే వరకూ ఉండు... తర్వాత వెళ్దువులే! రాకపోతే ఫోంచేసి పిక్చర్‌కి పోదాం!" అన్నాడు....

పాణికి ఇలాంటివి ఉన్నాయని నాకు తెలుసు... కానీ ఆఫీసులో నాతో చాలా ఫ్రెండ్లీగా ఉంటాడు... అప్పుడప్పుడూ సినిమాలకు వెళ్తుంటాం... ఇలాంటి వాటిల్లో తనకు చాలా అనుభవం ఉందని, నన్ను కూడా రమ్మని చాలా సార్లు అన్నాడు గానీ నేనెప్పుడూ ఇలాంటి వాటిలో అతనికి కంపెనీ ఇవ్వలేదు....

'జీవితం అన్నది అనుభవించడానికే గానీ, ఇలా మడి కట్టుకొని కూర్చోడానికి కాదు' అని చాలా సార్లు ఎన్నో రకాలుగా చెప్పాడు పాణి... నేను నవ్వి తప్పుకున్నానే గానీ అతనితో వాదించలేదు...

'మీలాంటి వాళ్ళు కోరికల్ని ఎందుకో అణచు కుంటారు... నీతి, నియమం, శీలం ఇలాంటి పదాల్ని వాడి తప్పుకుంటారు గానీ మీ మనసు పొరల్లో ఎక్కడో ఓ మూల ఇలాంటి కోరికలు దాగి ఉంటాయి... కాదంటే నేనేం చెప్పలేను గానీ పిరికితనానికి, సంఘం పట్ల ఉన్న భయానికి నీతుల్ని పులిమి ఆత్మవంచన చేసుకుంటారు!'... అనేవాడు...

ఆ మధ్య నేను ఆర్టీసీ కాంప్లెక్సు నుండి ఆమెను అనుసరించి వెళ్ళిన ఆ రాత్రంతా నాకు పదే పదే గుర్తొచ్చిన మాటలు అవే!

నిజంగా నాలోనూ అలాంటి కోరికలు ఉన్నాయా? నాది పాణి అన్నట్టు ఆత్మవంచనా? పాణి తన ధోరణిలో తను మాట్లాడుతున్నాడు... అలా ఓ అరగంట గడిచింది... అంతలో... "గురూ గారూ!" అన్న పిలుపు వినబడి గుమ్మం వైపు చూసాను...

అతను....

ఆ రోజు ఆర్టీసీ కాంప్లెక్సులో స్థంభం చాటున 'ఆమె' తో మాట్లాడినతను...

"ఏమైంది రామస్వామీ?" అని అడిగాడు పాణి...

"ఏమవ్వద్దండి, పండే! అరగంటలో వస్తాది, అడ్వాన్సు కొట్టించండి..." అని చేయి చాచాడు... పాణి ఏభై రూపాయల నోటు అందించాడు వాడికి...

"వస్తానండి..." అని నా వైపు చూస్తూ 'ఇంకో పిట్టని కూడా తెమ్మంటారేంటి?' అన్నాడు...

పాణి నవ్వుతూ "వద్దులే!" అన్నాడు....

వాడు వెళ్ళిపోయాడు....

"సెకండ్ షోకి దాన్ని కూడా తీసుకెళ్దాం, నీకేమైనా అభ్యంతరమా?" అని అడిగాడు ఫాణి...

నిజానికి నేనలాంటి సమయాల్లో నిష్క్రమిస్తాను.... కానీ 'వాడిని' చూసాక ఆ వచ్చేదెవరో చూసి అప్పుడు వెళ్దామని అన్పించింది...

అందుకే పాణి అడిగిన దానికి అవునని, కాదని ఏమీ చెప్పలేదు... పాణి కూడా ఇంకేమీ అడగకుండా కబుర్లలో పడ్డాడు...

పది నిముషాలు గడిచాక... "రాజా, ఒక్క పావు గంట మ్యాగజైన్స్ తిరగేస్తూ కూర్చుంటావా, బయటికి వెళ్ళొస్తాను?" అన్నాడు పాణి. .

"ఎక్కడికి....? నేనూ వస్తాను పద...." అన్నాను...

"నేను వెళ్తుంది 'సరంజామా' తీసుకు రావడానికి ... నువ్వవన్నీ తిరగలేవు గానీ కూర్చో, మళ్ళీ తలుపులూ అవీ క్లోజ్ చేసుకోవాలి!" అన్నాడు పాణి....



ఆపరేషన్ థియేటర్ ప్రారంభోత్సవానికొచ్చినంత మాత్రాన ఆపరేషన్ కూడా నువ్వే చేసేస్తానంటే ఎలాగయ్యా బాబూ!

## తొలకరి

తొలకరి గర్జించింది
పుడమి తల్లి ఒడలు
పులకరించింది
వర్షాలు, వర్షాలు
వరదలు వచ్చి
భూములు తడిసి
నదులు నిండి
ఏరులు పొంగి
రైతుకు ఊపిరి వచ్చింది.
చింతకు చిగురు వేసింది
కడిమి చెట్టు పూలతో ఎరుపెక్కింది
గంగరావి పూలతో
తెల్లటి మల్లిలు
అక్కడక్కడా
స్వచ్ఛంగా ముత్యాలు
కనిపించాయి
భూమిలోని వజ్రాలు
తొంగిచూశాయి
తొలకరి వచ్చింది
ఆకాశంలో మేఘాల
పరుగులు రోడ్డు ప్రక్క
కాల్వలలో కాగితాల
పడవల పరుగులు
ఆనందం – ఆనందం అంతా
అంతా ఆనందం.

–ఎం. ఎస్. ఎం.

"సరే, వెళ్ళి వేగంగా రా!" అన్నాను...

పెద్ద కేరేజీ, ఓ బ్యాగూ పట్టుకొని బయల్దేరాడు పాణి. . నేను అక్కడే ఉన్న టీపాయ్ మీద ఉన్న పత్రికల్ని తీసుకొని తిరగెయ్యడం మొదలు పెట్టాను...

మరో పది నిముషాలు గడిచిం తర్వాత... "ఏవండీ!" అన్న పిలుపు విన్పించింది... అది స్త్రీ కంఠం కావడంతో చటుక్కున తలెత్తి గుమ్మం వైపు చూసాను....

గుమ్మం దగ్గర నిలబడి ... 'ఆమె'...

ఆమే!

ఆ రోజు ఆర్టీసీ కాంప్లెక్సులో రామస్వామితో మాట్లాడుతూ కన్పించిన ఆమే!

నాకు ఏం మాట్లాడాలో, ఏం అనాలో తోచలేదు... ఆమే రూంలోకి వచ్చి అక్కడ నాకెదురుగా ఉన్న కుర్చీలో కూర్చుంది చొరవగా....

"ఆయన లేరా?" అని అడిగింది ఆమె...

"బయట కెళ్ళేడు ... వస్తాడు" అన్నాను...

ఒక నిముషం వరకూ ఆమె ఏమీ మాట్లాడ లేదు... నేను కూడా పత్రికలో తల దూర్చేసి కూర్చున్నాను... నాకక్కడ కూర్చోవడం చాలా ఇబ్బందిగా ఉంది....

రామస్వామిని చూసి ఇంత వరకూ ఇక్కడ ఉన్నది ఎవరొస్తారో చూద్దామనే! నేననుకుంటూనే ఉన్నాను.... నేననుకున్నట్టుగానే....

"మీరూ ఉంటారా?"

ఆమె వేసిన ఆ ప్రశ్నకు చటుక్కున పుస్తకం లోంచి తలెత్తి ఆమె వైపు చూసాను...

ఆమె ముఖంలో ఎలాంటి భావమూ లేదు... కానీ నాలోనే చాలా అలజడిగా ఉంది...

" ..అహఁ..." గొంతు పెగలడం కష్టమయ్యింది...

తర్వాత ఏమీ అనలేదు ఆమె...

మరో అయిదు నిమూషాలు గడిచింది... పాణి ఇంకా రాలేదు... 'వస్తే బాగుణ్ను' అని, 'మరి కాస్సేపు పోయాక వస్తే బాగుణ్ను' అని రెండు విధాలా అన్పిస్తుంది నాకు...

అప్పటికి నేను కాస్త ఫ్రీనెస్ ఫీలయ్యాను...

ఆమెతో నాకేదో మాట్లాడాలని అన్పిస్తుంది...

"ఎప్పట్నించి చేస్తున్నావీ పని?" నెమ్మదిగా అడగడం మొదలుపెట్టాను....

"సరిగ్గా గుర్తు లేదు గానీ, రెండేళ్ళు అయ్యుండొచ్చు...."

"ఇలాంటి పని ఎందుకు చేయడం?"

"మీరు ఉద్యోగం ఎందుకు చేస్తున్నారు?"

నా ప్రశ్నకు ఎదురు ప్రశ్న ... నేనూహించలేదు ఆమె అలా అడుగుతుందని...

"ఉద్యోగం చేయకపోతే ఎలా? బ్రతకాలిగా?"

"మీరు ఉద్యోగం చేస్తుంది మీరు బ్రతకడానికి ... కానీ నేనీ పని చేస్తుంది బ్రతికించుకోడానికి..."

"... ఎవర్ని?" అప్రయత్నంగా నా నోటి నుండి ఆ ప్రశ్న వచ్చింది...

".... నా బిడ్డను...."

"పిల్లలున్నారా నీకు?"

"ఒక ... బాబున్నాడు...."

"అంటే ... పెళ్ళయ్యిందా?"

"అఁ...."

"అతను లేడా?"

"ఉన్నాడు...."

"అతనుండగా... "

"మీ అనుమానం నాకు అర్థమయ్యింది. మీరిక్కడికి ఎన్ని గంటలకు వచ్చారు?"

"ఆరింటికి..."

"అయితే మీరతన్ని చూసే ఉంటారు...."

"ఎవరు?"

"రామస్వామి... కంపెనీ దగ్గరకు నేనివాళ రాన చెప్పడానికి వెళ్ళి దార్లో ఇటొచ్చి అడ్వాన్సు తీసుకున్నాడట... మళ్ళీ నాతో వచ్చి ఇక్కడే దింపే వెళ్ళిపోయాడు...

"అతనా ..?"

"అవును... నా భర్త అతనే!"

ఆ మాట విని నేను మ్రాన్పడిపోయాను...

"ఎందుకంత ఆశ్చర్యపోతారు?"

"................ "

"మిమ్మల్ని చూస్తుంటే ఈ సమాజంలో కుళ్ళుకు దూరంగా పుట్టి పెరిగారన్పిస్తుంది.... ఈ విషయం తెలిసిన చాలా మంది ఎప్పుడూ దీన్ని పెద్దగా పట్టించుకోలేదు ..."

కాసేపయ్యాక నేనే అడిగాను... "అలాంటి వాడిని ఎందుకు పెళ్ళి చేసుకున్నావు?" అని...

"అలాంటి వాడని తెలియక ... పెళ్ళి చేసుకోడానికి ఎవరూ దొరకక, దొరికిన వాడు చేజారి పోతాడేమోనన్న తొందరలో ముసలి మా అమ్మ వీడికిచ్చి చేసేసి, వెంటనే ఆవిడ పైకి వెళ్ళిపోయింది. పిల్లాడు పుట్టిన తర్వాత తెలిసింది వీడి అసలు స్వరూపం!"

"నిన్ను రామస్వామితో క్రిందటి ఆదివారం చూసాను ఆర్టీసీ కాంప్లెక్సులో ..."

"అప్పుడు నేను విజయనగరం వెళ్ళేను పిల్లాడికి ఒంట్లో బాగుండనప్పుడు చేసిన మొక్కుబడి తీర్చడానికి... బస్సు దిగీ దిగంగానే బాబుని చూడకుండా ఏదో బేరం ఉందని కంపెనీ దగ్గరున్న తాయారమ్మ దగ్గరికి ఎల్లమన్నాడు... అప్పుడు మీ ఫ్రెండు ఉన్నాడక్కడ... విషయం చెప్పి తొందరగా వెళ్ళాలని, కావాలంటే మరోసారి కలుద్దామని,

రామస్వామికి చెప్తే ఎక్కడికైనా తీసుకొస్తాడని చెప్పి మొత్తానికి ఆ రోజు ఏడున్నరకి బాబు దగ్గరికి వెళ్ళాను....

"విజయనగరం బాబుని కూడా తీసుకెళ్ళొచ్చుగా?"

"అక్కడ సంబరాల్లో చాలా రద్దీగా ఉంటుందని, బాబు నలిగిపోతాడని తీసుకెళ్ళలేదు.రామస్వామి దగ్గరుండి చూసుకుంటానని చెప్తే నమ్మి వెళ్ళేను... తీరా కాంప్లెక్సులో దిగేసరికి బస్సు గుమ్మం దగ్గిరే నిలబడి ఉన్నాడు రామస్వామి...."

అలా అన్నీ చెప్పుకొచ్చింది ఆమె...

మధ్యలో నేనడిగాను.... 'నీ పేరేమిటి?'... అని...

జవాబుగా నవ్వింది ఆమె... ఆ తర్వాత చెప్పింది ... 'సీత' అని!

రామస్వామి అలా చేస్తే ఊరుకోవడం ఎందుకని, వాణ్ని ఎదిరించలేకపోయావా అని చాలా ప్రశ్నలు వేసాను ఆ తర్వాత. .

అన్నింటికీ సమాధానంగా ... "నిజానికి నాకీ బ్రతుకు మీద మోజు లేదు.. ఎప్పుడూ చచ్చిపోవాలనే అన్పిస్తుంది . కానీ నా బాబుని చూస్తుంటే చావ బుద్ధి కావడం లేదు... అందుకే ఇలా శవంలా బ్రతుకుతున్నాను... బ్రతకలేక ఎందరో ఈ దారికి వచ్చేసిన వాళ్ళను చూసాను. వాళ్ళు సంపాదించింది అంతా వాళ్ళకు చేరదు కూడా! రామస్వామి చిన్న సైజు రౌడీ, అతని జోలికి ఎవ్వరూ రారు... ఆడదాని కష్టం మీద బ్రతికే బ్రోకరుగాళ్ళ మధ్య ఎందరో అన్నానికి కూడా మిగుల్చుకో

# ఆత్మహత్య

లేకపోతున్నారు. రామస్వామి మొగుడు లాంటి బ్రోకరు, బ్రోకరు లాంటి మొగుడు కావడం వల్ల చాలా మందికి లేని రక్షణ నాకు ఉంది... వాడి ప్రయత్నం అంతా డబ్బు సంపాదించడమే! అందుకు వాడు ఎందరినో తార్చి డబ్బు సంపాదిస్తాడు... పెళ్ళాన్నైన నన్ను కూడా తార్చుతున్నాడు గానీ, నన్ను పెళ్ళాం లాగే ఓ వేరే ఇంట్లో పెట్టి చూస్తున్నాడు .. ఆ కాస్త రక్షణ లేని వాళ్ళ కంటే నేను చాలా నయం అనుకొని ఇలాగే కాలాన్ని ఈడ్చుతున్నాను.... నా బాబు కోసం, వాడి భవిష్యత్తు కోసం నేనేమైపోయినా ఫర్వాలేదని అలాంటి వాడి నీడలోనే ఇష్టం లేకున్నా ఉంటున్నాను....

.. అలా చాలా చెప్పుకొని వచ్చింది సీత... గజిబిజిగా చెప్పినా ఆమె చెప్పిన ముఖ్యమైన విషయం ఏమిటంటే తన కొడుకు కోసమే తనిలాంటి బ్రతుకుని రామస్వామి లాంటి వాడితో గడుపుతున్నానని!

అయితే ఆమెను చాలా ప్రశ్నలు వెయ్యాలన్పించింది గానీ ఆమె వాటికి సమాధానం చెప్పలేకపోవచ్చుని, ఆ పరిస్థితుల్లో ఆమెకు అంతకంటే వేరే దారి లేక అలా రాజీ పడిపోయి ఇంక ఏ ఆలోచనా లేకుండా కళ్ళలో కొడుకుని పెట్టుకొని కాలాన్ని గడిపేస్తుందని... అనుకొని ఇంక నేనేమీ ప్రశ్నలు వెయ్యలేదు ...

కానీ.. మళ్ళీ నాలో ఓ ప్రశ్న పుట్టి సీతను అడుగుదామనుకున్నాను గానీ అంతలో ఆమె అడిగింది 'మీ ఫ్రెండు ఇంకా రాలేదేమిటి?' అని...

"వస్తాడు.. బయటకు వెళ్ళాడు.... ఇంతకూ మా ఫ్రెండు ఎలా గుర్తున్నాడు నీకు?" అని అడిగాను...

నా ప్రశ్నకు ఆమె చిన్నగా నవ్వింది...

"ఎందరో... అందరూ గుర్తుండరు. కానీ కొందరు మాత్రం గుర్తుండి పోతారు.... ఆ రోజు ఇంటికి వెళ్ళాలన్న తొందరలో ఉన్నాను కదా, మీ ఫ్రెండు నా తొందరకు పెద్దగా విసుక్కోలేదు .. అలా విసుక్కోని వాళ్ళు చాలా కొద్దిమంది ఉంటారు... పైగా తీసుకొచ్చేటప్పుడు రామస్వామి గుర్తు చేసాడు కూడా క్రిందటి ఆదివారం, నేను విజయనగరం నుండి వచ్చేసరికి బుక్కై ఉన్న పాసింజరే ఈ రోజు రూమ్‌కు తీసుకు రమ్మన్నాడని.....

ఆమె ఇంకా ఏదో చెప్పబోతుంది గానీ అంతలో పాణి వచ్చాడు 'సరం జామా' పట్టుకొని....

పాణితో వెళ్ళొస్తానని చెప్పి లేచాను...

"ఇదేమిటి, సినిమాకు వెళ్దామనుకున్నాంగా?"

"సారీ, వస్తాను... యూ కేరీ ఆన్" అని చెప్పేం అక్కడి నుండి బయల్దేరి పోయాను. .

* * * *

చాలా రోజుల తర్వాత పాణి, నేను మేట్నీకి వెళ్ళాం... సినిమా అయిపోయిం తర్వాత "పాణీ,

## ధర్మపథం

# ఆహారాన్ని గురించి

"అదభక్షణే" అనే ధాతువును బట్టి వచ్చిన పదం అన్నం. ఆహారపదార్థాలు అనేకం ఉన్నా, అవి తృప్తిని కలిగించవు. అన్నం తింటేనే కడుపునిండుతుంది. "అన్నం పరబ్రహ్మ స్వరూప" మని అంటారు. ముక్తి పొందుటకు బ్రహ్మ జ్ఞానానికి ఎట్టి ప్రాధాన్యమో, శరీరధారణకు అన్నం అంతముఖ్యమైనది. ఆకలిచే నకనకలాడు తున్న వానికి కూటి మీదనే ధ్యానం. వానికి తత్త్వోపదేశం చెవి కెక్కదు. కడుపునిండా తిని ఉన్న వానికి ఏమి బోధించినా తలకెక్కుతుందీ. అందువల్లనే మనవారు అన్ని ధర్మాలకన్నా అతిథికి అన్నం పెట్టడమే ముఖ్యమని చెప్పారు.




ఆకలితో బాధ పడుతూ 'అన్నమో రామచంద్రా!" అని ప్రాధేయపడుతూ గుమ్మంలో మనిషి ఉండగా, అతనికి పెట్టకుండా తినేవానికి మహాపాపం! అంతేకాదు, అతని కుటుంబానికే హాని కలుగుతుంది. ఈ సంగతి మన ఉపనిషత్తుల్లోనే విశదంగా చెప్పబడింది. తండ్రి కోపానికి గురియై, మరణ శిక్షకు గురి యైన నచికేతుడు యముని యింటికి వెళ్ళాడనీ, ఆ సమయంలో యముడు గృహంలో లేడనీ, ఆయన వచ్చేవరకూ నచికేతుడు మూడు రోజులు ఆహారం లేకుండానే ఇంటి బయట నిరీక్షిస్తూ ఉన్నాడనీ, యముడు వచ్చి 'అన్నం లేకుండా అతిథి గృహ బహిర్భాగంలో ఉండడం మహాపాప" మని గ్రహించి, అతనికి ఆతిథ్యం ఇవ్వడమే కాకుండా, మూడు రోజులు నిరీక్షించి ఉన్నందుకు మూడు వరాలిచ్చినట్లు కఠోపనిషత్తు వల్ల తెలుస్తున్నది. యముని వంటి వాడే ఇలా భయపడి నప్పుడు, అతిథికి అన్నం పెట్టని వారి సంగతిని వేరే చెప్పవలసిన పని లేదు.

ఆకలితో బాధ పడుతున్నప్పుడు, అట్టివానికి ఏవిషయమూ తలకెక్కదంటే – ఆధ్యాత్మిక విషయాలు' ఎలా తల కెక్కుతాయి? ఈ విషయాన్ని గ్రహించే స్వామీ వివేకానందుడు విశ్వవ్యాప్తంగా దీన జనోద్ధరణకు గట్టి కృషి చేసి కృతార్థుడైనాడు! ఆ మహనీయుడు గత శతాబ్ది చివర అమెరికాలో జరిగిన విశ్వ మత మహాసభలో మహోపన్యాసా లిచ్చి యావత్ప్రపంచాన్నీ ఆకట్టుకొన్నప్పుడు సభ్యులను చూచి "మీరు జనాన్ని ఉద్ధరించ దలచితే, మత ప్రచారానికయి తత్త్వ వేత్తలను భారత దేశానికి పంపనక్కర్లేదు. మాకు తత్త్వ విజ్ఞానానికీ, తత్త్వ వేత్తలకూ కొరత ఏమీ లేదు. కొరత అహారంలో మాత్రమే ఉన్నది. అందువల్ల ధన సహాయం చేస్తే ఆ దీనులను ఉద్ధరించినట్లే" అని అన్నాడు. ఉదారు లిచ్చిన ధనంతో క్షుధార్తు లైన దీనులకు ఎన్నో సంస్థలు ఏర్పరచాడు ఆ మహనీయుడు! తిండిలేక ఏపనీ చెయ్యడం సాధ్యంకాదు. ఈ నాగరక కాలంలో కూడా ఆకలి చావులు ఉన్నట్లు పత్రికల వల్ల తెలుస్తూ ఉన్నది. ఎన్నో తగవులు, కలహాలు ఈ సమస్య వల్లనే ఏర్పడు తున్నవి.

–బులుసు వేంకటరమణయ్య

---

వేనొస్తాను మరి..." అని చెప్పి ఇంటికి బయల్దేరబోయాను...

"కాస్త రిఫ్రెష్ అయి వెళ్ళువు గాన్లే గానీ రూమ్‌కి వెళ్దాం పద ముందు..." అన్నాడు పాణి...

"ఏం, మళ్ళీ అలాంటి ప్రోగ్రాం గానీ పెడతావా ఏమిటి?" నవ్వుతూనే అన్నాను...

నా మాటకు పాణి నవ్వుతూ ...."ఛ...ఛ... అలాంటిదేమీ లేదు" అని ... మళ్ళీ ఏదో గుర్తు వచ్చిన వాడిలా సడన్‌గా అగిపోయి నన్ను రోడ్డు ప్రక్కకు తీసుకు వెళ్ళి...

"రాజా! నువ్వు ప్రోగ్రాం అంటే గుర్తొచ్చింది, నీకో విషయం చెప్పడం మరిచేపోయాను... ఆ రోజు నువ్వుండగా ఒకర్తి వచ్చింది గుర్తుందా?" అని అడిగాడు....

"అఁ...."

"మొన్న ఆ రామస్వామి గాడు కన్పించినప్పుడు దాని గురించి అడిగాను... పిచ్చిది, కొడుకు మెదడు వాపు వ్యాధి వచ్చి చచ్చిపోయాడని అది కూడా ఆత్మహత్య చేసేసుకుందట!" అన్నాడు...

పాణి అన్న మాటలు విని నేను త్రుళ్ళి పడ్డాను..

ఆ తర్వాత నేనింకేమీ మాట్లాడలేకపోయాను...

ఓ పది నిముషాలు పాణితో ఎలా నడిచానో తెలీదు, పనుందని చెప్పి అక్కడి నుండి వెళ్ళిపోయాను....

ఆ రోజు ఆర్టీసీ కాంప్లెక్సు నుండి సీతను చాలా సేపు అనుసరించడం, ఆ తర్వాత రామస్వామి కన్పించడం, ఆ రోజు సీతతో మాట్లాడ్డం, ఇప్పుడు పాణి చెప్పిన విషయం...

అంతా ఒక కలలా....

నా మనసు మనసులో లేదు....

సీతలాంటి వాళ్ళ జీవితాలకు పరిష్కారం బలవంతంగా ప్రాణాలు తీసుకోవడం కాదన్నది నా స్వంత అభిప్రాయం! అయినా సీత అలా చేసిందని తెలిసినా ఎందుకో ఆమెను అభినందించకుండా ఉండలేకపోయాను...

కేవలం కొడుకు కోసమే బ్రతుకుతున్నానని చెప్పిందప్పుడు... ఇంక ఆ కొడుకు లేకపోవడం వల్ల బ్రతకడం అనవసరం అనుకుందేమో, అందుకే ఆత్మహత్య చేసుకుంది సీత!

కానీ...

నేను....

అలాంటి ఆడవాళ్ళ జీవిత పరిష్కారం ఆత్మహత్య కాదన్నది నా అభిప్రాయం అయినా... సీత చేసిన పనికి నాకు తెలియకుండానే మనసులో ఆమెను అభినందించాను...

ఒక రకంగా నేను నా ఆత్మను హత్య చేసేసానేమో!? కదూ....!? ☐

## అరుదైన పుష్పం!

జావా ద్వీపంలో "రాఫ్లెసియా" అనే వింత జాతి పువ్వుందట. ఈ పువ్వు బరువు పది కిలోలట. 50 నుంచి 70 సెంటి మీటర్ల వ్యాసం కలిగివుంటుందట ఈ పువ్వు మొగ్గ స్థితి నుంచి విచ్చుకుని పూవుగా మారడానికి ఏణ్ణర్ధం అవుతుందట. పూవు విడి సంపూర్ణ పూవుగా మారిన రెండు మూడు రోజుల్లో వాడిపోతుందట. వాడి పోయిన కొద్ది సేపట్లో కుళ్ళిన మాంసం కంపు కొడుతుందట.

## జంటగా మంటలకి ఆహుతి

తెనాలి చెంచుపేటకు చెందిన పుల్లమ్మ అనే నిండు గర్భిణిని ఆమె భర్త ఆంథోనిరాజు జూన్ 12 వ తేదీ రాత్రి బయట వర్షం పడుతూండడం వల్ల తన మంచం లోపల వెయ్యమన్నాడట. దానికామె వినక, నా వల్లకాదని మొండికేసేసరికి కోపంతో వో సీసాను పగులగొట్టి, దాంతో పొడిచి చంపేస్తానని బెదిరించాడట. ఈ బెదిరింపుకు భయపడిన పుల్లమ్మ అర్ధరాత్రి ఇంటికి నిప్పంటించిందట. భార్య మంటల్లో వుండడం చూసి, ఆంథోనీ లోపలకు వెళ్ళి ఆమెను తేవడంలో అతని వొళ్ళూ కాలిందట. ఫలితంగా ఇద్దరూ వో రోజు తేడాలో ఆసుపత్రిలో చనిపోయారట.

## చక్రవర్తికి మరణశిక్ష!

రిపబ్లిక్ ఆఫ్రికా చక్రవర్తి తన పదవీ కాలంలో అక్రమాలు, అన్యాయాలూ, ఘాతుకాలూ చేసి మహా క్రూరాతిక్రూరుడని పేరు వహించాడని, ఆయన నర మాంసం కూడా తినేవాడనీ, ఆయనకు చట్టం మరణ శిక్ష విధించిందట.

## రెండు రూపాయలకి ఆశ పడితే...!

నెల్లూరు బ్యాంక్ ఆఫ్ బరోడాలో 29 వేల




రూపాయలు తన ఖాతాలోంచి తీసి, 28 ఏళ్ల కొత్త హనుమంతరావు అనే వ్యక్తి వో జిప్ బ్యాగులో పెట్టుకుని, బయటకు వచ్చి, స్కూటరెక్కి స్టార్ట్ చేసేంతలో వో ఆగంతకుడు వచ్చి నేల మీద పున్న




వో రెండ్రూపాయల నోటుని చూపి, డబ్బు పడిపోయింది. చూస్కోండి అన్నాడట.. ఆ నోటు తీయడానికి హనుమంతరావు వొంగేసరికల్లా ఆ వ్యక్తి హనుమంతరావు చంకలో వున్న జిప్ బ్యాగు లాక్కుని అదృశ్యుడైపోయాట్ట.

## నేల కూలిన స్కూలు భవనం!

తూర్పుగోదావరి జిల్లా మల్లవరంలోని వో స్కూలు భవనం కూలిపోయిందట. ఈ భవనం 50 లక్షల ఖర్చుతో యిటీవలే నిర్మించినదట. ఈ సందర్భంగా సూపరింటిండింగ్ ఇంజనీరును, ఎగ్జిక్యూటివ్, డిప్యూటీ ఎగ్జిక్యూటివ్ ఇంజనీర్లు వో యిద్దరినీ, ఒక జూనియర్ ఇంజనీరును – వెరసి నలుగుర్ని ప్రభుత్వం సస్పెండు చేసిందట. ఈ భవనం కక్కుర్తితో సరిగా సిమెంట్, తదితరాలు పాళ్ళల్లో కలపకపోడం వల్లనే కూలినట్లు అక్కడి ప్రజలు అంటున్నారట – నాచురల్లీ.

## దారుణ హత్యకి దారి తీసిన దౌర్జన్యం

ఉయ్యూరుకు చెందిన పాకూర్తి వెంకటేశ్వర్రావుపై మందపాక జంఘం అనే వ్యక్తి దౌర్జన్యం జరిపాడట. దాంతో వెంకటేశ్వర్రావుకు కోపం వచ్చి, వో ముగ్గురు అనుయాయులతో వెళ్ళి, తాడిచెట్టు ఎక్కి కల్లు గీస్తున్న జంఘాన్ని క్రిందికి లాగి, కత్తులతో ముక్కలు ముక్కలుగా నరికి చంపేశాడట. ఈ దారుణం జూన్ 12 వ తేదీన జరిగిందట.

## అమెరికాలో తేలిన లెక్కలు!

యునైటెడ్ స్టేట్స్ ఆఫ్ అమెరికాలో 1985 లెక్కల ప్రకారం ఒకకోటి 20 లక్షల మంది విద్యావంతులైన నిరుద్యోగులున్నారట. 65 లక్షల మంది ఉదర పోషణార్థం ఏవేవో పార్ట్‌టైము వుద్యోగాలు చేస్తూ అఘోరిస్తున్నారట. 8 కోట్ల మంది తమ జీతాలలో 75 శాతం పన్నులు కడుతూ మేం ఉద్యోగులం గనుక మా జీతాలలో ఇంతింత మొత్తాలను పన్నుగా పళ్ళూడగొట్టి లాక్కుంటున్నారు. వ్యాపారస్థుల ముందు మేమెంత అని బిక్క మొగాలేసుకున్నారట. గత 12 సంవత్సరాలలో నేరస్తులుగా చంపబడ్డ వారిసంఖ్య 58 వేలట. మత్తు పదార్థాలు సేవించే వారిసంఖ్య ఒక కోటి దాటి పోయిందని లెక్కలు తేలినా, లెక్కలకు తేలని సంఖ్య మరంతుంటుందని జ్ఞానులు వక్కాణిస్తున్నారట. ఎంత లేదన్నా వివిధ నేరాలతో వారానికి 300 మందైనా జైళ్ళ పాలవుతూ వుంటారటక్కడ – పురోగమించిన దేశాలు కదండి అవి మాస్టారూ!

## జైలు పాలయిన పెళ్ళికొడుకు!

మద్రాసుకు చెందిన హరికిషన్ అనే అతడు 1981 లో చంద్రిక అనే వో అమ్మాయిని పెళ్ళాడి, ఆనక చక్కని కట్నంతో వో ఆఫర్ వచ్చిందని ఆ పెళ్ళికి సిద్ధపడ్డాడట. ఈ విషయం గ్రహించిన చంద్రిక పోలీసుల సహాయం తీసుకుని, పెళ్ళిపందిరికి వెళ్ళి మగణ్ణి అరెస్టు చేయించిందట.

## బెర్లిన్ నగర జన్మదినోత్సవం!

బెర్లిన్ నగరం పుట్టి 750 సంవత్సరాలయిందట. బెర్లిన్ తూర్పు, పడమరలుగా చీలిపోయి, మధ్య గోడ, గోడ మీద ముళ్ళతీగ మొలిచినా, బెర్లిన్‌కు 750 వ జన్మదినోత్సవ వేడుకలు చేయడానికి గోడ అవతల వాళ్ళూ, ఇవతల వాళ్ళూ కూడా ఒకే రకం వుత్సాహం చూపుతున్నారట. నగరానికి పుట్టిన రోజు చైతం యిదే మొదలని కూడా వాళ్ళు వక్కాణిస్తున్నారట.

## ఎలుక మాంసానికి గిరాకీ!

ఘనా, పెరూ దేశ ప్రజలు ఎలుకలను ఎంచక్కా వొండుకుని, లొట్టలు వేసుకుంటూ తింటున్నారట. ఎలుక మాంసం చాలా రుచి అనీ, తినడానికి మరిన్ని ఎలుకలు కావాలని అక్కడి జనులు విలవిల్లాడి




పోతున్నారట. దీంతో ఎలుకలను ఎంచక్కా పెంచి పెద్ద చేసి భోజ్య పదార్థాలుగా మార్చి యిచ్చే సంస్థలకు ర్యాట్ ఫైనాన్స్ కంపెనీలనే కంపెనీలు పుట్టి ఆర్థిక సహాయం చేస్తున్నాయట. □

# సాటిలేని విలువ, మేటి గుణం...
# వాడండి ఈ టూత్‌పేస్టు ప్రతిదినం—క్లోస్-అప్.




చాక్ గల చిక్కని టూత్‌పేస్టుల కన్న వేరైనది క్లోస్-అప్. దీనిలోని అద్వితీయ ఆధునిక జెల్‌లో శుభ్రపరిచే నురుగు పుష్కలంగా వుంది. కాని ఇది అంత బరువైనది కాదు. అంచేత, ట్యూబుకు ట్యూబు పోలిస్తే, క్లోస్-అప్‌తో మరిన్నిసార్లు బ్రష్ చేసుకోవచ్చు. ఇప్పుడు మీరు వాడుతున్న టూత్‌పేస్టు* కన్న ఇది మరింత ఎక్కువకాలం వస్తుంది.

క్లోస్-అప్‌తో ఇంకా ఎన్నో ప్రయోజనాలు. దీనిలోని ఆధునిక క్లీనర్‌లు మీ పళ్లను తెల్లగా చేస్తాయి. మీ శ్వాసని ఎంతో శుభ్రంగా, ఎంతో తాజాగా ఉంచటానికి ఇందులో వుంది అసలైన మౌత్‌వాష్. అవును, క్లోస్-అప్‌తో మీకు అన్నీ కైవసం అవుతాయి—ముఖ్యంగా ప్రపంచాన్నే జయించే ఆ ఆత్మవిశ్వాసం ఇస్తుంది క్లోస్-అప్!

*ఒకే విధమైన నాజిల్ సైజు, 2 సెం.మీ. పేస్టు పొడవు ఉంటే.

- అసలైన మౌత్‌వాష్ గలది.
- ఆధునికమైన శుభ్రపరిచే జెల్ గలది
- ఎక్కువ సార్లు బ్రష్ చేసుకోవచ్చు

## క్లోస్-అప్

విలవిలలాడే తెల్లటి పళ్లు,
మరింత తాజాగా
ఉండే శ్వాస కోసం!




హిందుస్థాన్ లీవర్ వారి విశిష్ట ఉత్పత్తి.

# "పాపం! పట్నాయక్!"

బెహరా వెంకట సుబ్బారావు

రైల్వే గేటు దాటి పట్నంలో ప్రవేశించబోతోంది ఆర్టీసీ బస్. జేబులో పదిలంగా దాచి వుంచిన బస్ టికెట్‌ని బయటకు తీసాడు పట్నాయిక్. వెనక్కి తిప్పి చూసాడు. అర్ధ రూపాయి బాకీ వున్నట్టు కండక్టరు దానిపై పెన్సిల్‌తో రాసాడు. రైల్వే గేటు దాటిన వెంటనే గాంధీనగరం జంక్షన్ వస్తుంది. అక్కడ అతను దిగాలి, దిగేటప్పుడు మర్చిపోకుండా ఆ 'బాకీ'ని వసూలు చేసుకోవాలి. ఇది వరలో రెండు మూడు సార్లు మర్చి పోవడం జరిగింది. మరలా మర్చిపోయి దిగి పోతానేమోనని జ్ఞాపకంగా టికెట్టుని తీసి చేత్తో పట్టుకొన్నాడు.

గాంధీనగర్ జంక్షన్‌లో ఆగింది బస్. చివాల్న లేచి స్టాండింగ్ పాసింజర్లను తప్పించుకొంటూ గేటు దగ్గరకి నడిచాడు పట్నాయిక్. అప్పటికే డోరు తెరచి వుంచాడు కండక్టరు. ముగ్గురు పాసింజర్లు దిగారు. పట్నాయిక్ బస్ దిగలేదు. గేటులో పై మెట్టు మీద కండక్టరు కెదురుగా నిలబడ్డాడు. చేతిలో వున్న టికెట్ చూపిస్తూ.

"అర్ధ రూపాయి యివ్వాలి!" అన్నాడు. అతని మాటలు వినిపించుకోలేదు కండక్టరు. వెనక్కి తిరిగి చూస్తున్నాడు. ఇంకా దిగే పాసింజర్లు వున్నారేమోనని. చిల్లర డబ్బులు ఎగవేయడానికే అతనలా ప్రవర్తిస్తున్నాడనుకొన్నాడు పట్నాయిక్. అతని మీద కోపం వచ్చింది.

"త్వరగా దిగండి మాష్టారూ!" తొందర చేస్తూ విసుక్కొన్నాడు కండక్టర్, పట్నాయిక్ ఒక్క మెట్టు కూడా దిగలేదు.

"ఏభై పైసలు వాపసు యివ్వాలి!" అన్నాడు మరోసారి టికెట్ చూపిస్తూ.

"నాక్కూడా అర్ధ్రూపా యివ్వాలి కండక్టరు బాబూ!" వెనుక నుండి మరో పాసింజరు అర్థించడంతో వెనక్కి తిరిగి చూసాడు పట్నాయిక్. ఆ పాసింజరు పల్లెటూరి వాడు. మాసిన పంచని మోకాళ్ల వరకూ ఎగకట్టాడు. అంత కన్నా మాసిన బనీను ధరించాడు. వీపు మీద చిన్న గోనె మూట! అతను కూడా అక్కడే దిగబోతున్నాడు. తనకు మరొకడు తోడు దొరకడంతో ధైర్యం వచ్చింది పట్నాయిక్కి.

వాళ్ల అభ్యర్థనలని ఏవీ పట్టించుకోకుండా గద్దించాడు కండక్టరు.

"దిగండి మాష్టారూ! టైమయిపోయింది!"

"అర్ధ రూపాయి బేలన్సు వస్తుంది!" పట్నాయిక్.

"నాక్కూడా అర్ధ్రూపాయివ్వాలి బాబూ!"

"చిల్లర లేదు! స్టాండుకి రండి!" అన్నాడు కండక్టరు నిర్లక్ష్యంగా విసుగ్గా. పట్నాయిక్కి అతని మీద అమితమైన ఆగ్రహం వచ్చింది. అర్ధ రూపాయి కోసం రెండు మైళ్ళ దూరంలో వున్న బస్ స్టాండుకి వెళ్తే అట్నుంచి రిక్షా వానికి మూడు రూపాయలు యిచ్చుకోవాలి! లేదా ఎండలో నడచి రావాలి. చిల్లర డబ్బుల మీద ఆశ వదలుకొన్నాడా పల్లెవాడు.

"దిగండి బాబూ!" పట్నాయిక్‌ని తొందర చేసాడు. అతను అడుగు కదపలేదు. ద్వారానికి అడ్డంగా నిలబడ్డాడు.

పట్నాయిక్ వైఖరి డ్రైవర్‌కీ కోపం తెప్పించింది. బస్ ఓ కుదుపుతో బాటు వార్నింగ్ కూడా యిచ్చింది.

"త్వరగా దిగుతావా? స్టాండుకి తీసుకు పోనా?" అని అడిగింది.

"తప్పుకోండి బాబూ! నే దిగిపోతా!" తొందరపడ్డాడు వెనుకనున్న పాసింజరు.. పట్నాయిక్కి బ్రహ్మాండమైన ఆలోచన వచ్చింది.

"మా యిద్దరికీ కలిపి రూపాయి నోటు యివ్వండి! మార్చుకొని పంచుకొంటాం!" సుళువు చెప్పాడు.

కండక్టరు తన బేగ్‌లో వున్న నోట్లని బయటికి తీసి చూసాడు. వాటిలోంచి అయిదు రూపాయల కాగితం చేత్తో పట్టుకొన్నాడు. "నాలుగివ్వండి! అయిదిస్తా!" అన్నాడు. తన దగ్గరున్నవీ ఐదు రూపాయల నోట్లే! నిస్సహాయ స్థితిలో పడ్డాడు పట్నాయిక్. బేలన్సు వదలుకోక తప్పదనుకొన్నాడు. అయితే అతని అదృష్టం కొద్దీ వెనుకనున్న ఆ పాసింజరు ముందు కొచ్చాడు "నా దగ్గరున్నాయి బాబూ!" అంటూ.

బనీను లోపల జేబులోంచి నోట్లని బయటకి తీసాడు. రెండ్రూపాయిల నోట్లు చాలా వున్నాయ్. రెండు నోట్లు అందించి అయిదు రూపాయిల నోటుని కండక్టరు దగ్గర తీసుకొన్నాడు. విజయగర్వంతో బస్ దిగాడు పట్నాయిక్, వెనుకనే వీపు మీద మూటతో ఆ పల్లె వాడూ దిగాడు. దబాల్న డోరు వేసుకొన్నాడు కండక్టర్. బస్ కదిలింది. ఆ జంక్షన్‌లో మూడు టీ కొట్లూ రెండు కిళ్లీ బడ్డీలు వున్నాయ్. చిల్లర మార్చుకో వచ్చుననుకొన్నాడు పట్నాయిక్.

"నీ పేరేవిఁటోయ్? కాస్త ఆగు! ఇక్కడ చిల్లర దొరుకుతుందేమో ప్రయత్నిస్తా!" కదలబోతూన్న ఆ ఆ సామితో అన్నాడు.

"నా పేరు రావుఁలండి! ఈ బడ్డీవోళ్లు సిల్లరివ్వరండి! పోనీ అడిగి సూడండి!" అన్నాడు రావులు బుజం మీది గోనె మూటని సర్దుకొంటూ.

తన దగ్గరున్న అయిదు రూపాయిల కాగితాన్ని బయటకి తీసి రెండు బడ్డీల దగ్గర ప్రయత్నించాడు. చిల్లర దొరకలేదు.

"నాతో రండి బాబూ! తవఁ రద్రూపాయి ఒక్కచ్చణంలో యిచ్చేత్తా!" అంటూ ముందుకు కదిలాడు రావుఁలు. చేసేది లేక అతణ్ని అనుసరించాడు. రావుఁలు ఎక్కడ ఎలా చిల్లర సంపాదిస్తాడో అర్థంకాలేదతనికి. వెనుకనే నడుస్తూన్న పట్నాయిక్ దృష్టి రావులు గోనె మూట మీద పడింది."

"ఆ మూటలో ఏమున్నాయ్?" అడిగాడు.

"అటు కులండి! రోజూ పట్నం వచ్చి అమ్ముకుంటానండి!" చెప్పాడు రావులు గబగబా అడుగులు వేస్తూ, మొదటి వీధిలో పడ్డాడు.

పట్నాయిక్ పూర్తి పేరు కంచుర్తి పరమేశ్వర పట్నాయిక్! కానీ ఆఫీసులో అంతా కక్కూర్తి పట్నాయిక్ అంటారు. అందు క్కారణం లేకపోలేదు. ఆఫీసు లంచవరులో నైనా కనీసం టీ కూడా తాగడు. అతనికి కాఫీ టీలు పడవనీ అలవాటు లేదనీ కాదు! డబ్బులిచ్చి తాగడు. ఎవరైనా ఆఫర్ చేస్తే ఆనందంగా సేవిస్తాడు. లంచ్ బ్రేక్‌లో అంతా కాఫీ టీలు తాగుతూంటే ఓ గ్లాసుడు నీళ్లు మాత్రం తీసుకొంటాడు.

కూరల బజారులో అందరిలా మేలి రకం కూరలుండే దుఖాణాల జోలికి పోడు. బజారు పక్క సందులో వుండే దుకాణాల దగ్గరకి వెళ్తాడు. ఆ సందులో కొంచెం వాడినవీ, మాగినవీ తక్కువ ధరకి అమ్ముతారు. వాటిలో మంచివి ఎంచి మరి కాస్త బేరం చేసి అతి తక్కువ ధరకి కొంటాడు.

పట్నాయిక్ కక్కూర్తి తనానికి అతని ధర్మపత్ని కూడా అప్పుడప్పుడు అతని మొహం మీదనే విసుక్కొంటుంది. మల్లెపూలు మాంచి చౌకగా అంటే పావు సేరు పావులాకి అమ్మిన రోజుల్లో కూడా ఓ పావు సేరు కొనడు. "ఆ పావలాకి పాతిక దొండకాయలు వస్తాయ్! ఒకరోజు కూర' అంటాడు. భార్య పోరు పడలేక ఏ రెండు నెలలకో ఒకసారి సినీమాకి బయలుదేర్తాడు. అదయినా రానూ పోనూ నడిచి వెళ్లే షరతు మీద.

ఆ యిద్దరూ మొదటి వీధి తిరగడం అయింది. రావుఁలుకి బేరం తగల్లేదు. తిరిగి వెనక్కి వచ్చి రెండో వీధిలో చొరబడ్డాడు రావుఁలు. అతనితో నడవలేక ఆ వీధి మొదట్లోనే ఆగిపోయాడు పట్నాయిక్. వేసవి కాలం కావడం వల్ల ఉదయం పది గంటలకే ఎండ భరింప రానిదిగా వుంది. వడగాల్పులు వీస్తున్నాయ్. వాడె లాగూ తిరిగి వస్తాడన్న ధీమాతో ఆ వీధి మొదటనే ఆగాడు.

"ఈ వీధిలో కూడా రావులికి బేరం తగలక పోతే? తన అర్ధ రూపాయి ఎలా వస్తుంది?" ఆలోచనలో పడ్డాడు. దాహం ఎక్కువైంది. అటూ యిటూ చూసాడు. ఎక్కడా వీధి కొళాయి కనబడలేదు.

ఎదురుగా కిళ్ళీ కొట్లో సోడా కొట్టిన చప్పుడు వినపడింది. సోడా తాగడానికి చిల్లర లేదు. సోడా యిరవై పైసలు! ఇరవై పైసలకి అయిదు రూపాయల కాయితం యిస్తే తిడతాడు. ఆ కిళ్ళీ షాపు దగ్గరకి నడిచాడు.

"అయిదు రూపాయల నోటుంది! సోడా కావాలి!" అన్నాడు.

పట్నాయిక్ దీన వదనం చూసి జాలి పడ్డాడా కిళ్ళీ బడ్డీ వాడు. కొంత మంది సోడా తాగాక నోటుని అందిస్తారు స్టయిల్‌గా. చిల్లర లేదని ముందుగానే చెప్పిన పట్నాయిక్ పెద్ద మనిషిగా తో చాడతనికి.

అయిస్ బాక్సులోంచి సోడా తీసి 'కంయ్'మనిపించి అందించాడు. అయిస్ సోడా అవడం వల్ల మరో పది పైసలు ఎక్కువ తీసుకొంటాడు. మామూలు సోడా యిస్తాడనుకొన్నాడు పట్నాయిక్. పది పైసలెక్కువయినా ఎండలో చల్లగా వుంటుందనుకొన్నాడు. రావులు వైపు చూస్తూ సోడా బుడ్డి కాళీ చేసాడు. పళ్ళు జివ్వుమంటున్నాయ్. రావులు వైపే చూస్తూ చేతిని వెనక్కి జాపి కాళీ సోడాని బడ్డివానికి అందివ్వబోయాడు. ముందు బల్ల మీద పేర్చిన బ్రెడ్ పేకట్లకి సోడా బుడ్డి తగలడంతో రెండు పేకట్లు కింద బడ్డాయి. తకీమని వెనక్కి తిరిగి చూసాడు. అక్కడే కాచుకుని కూర్చున్న కుక్క ఓ బ్రెడ్ పేకట్టుని నోట కరచుకొని పారిపోయింది. అది చూసి బావురుమన్నాడు పట్నాయిక్. జేబులోంచి అయిదు రూపాయల నోటు తీసి అందించాడు.

'బ్రెడ్ ఖరీదు రూపాయి పావలా సోడా ముప్పై పైసలు" అంటూ మిగతా డబ్బు అందించాడు కిళ్ళీ బడ్డివాడు. ఏడుపు మొహంతో అందుకొని వీధిలోకి చూసాడు పట్నాయిక్. రావులు ఒక యింటి ముందు గుమ్మంలో కూర్చొని అటుకులు కొలుస్తున్నాడు. తన దగ్గరున్న రూపాయిన్నరయిచ్చి వాడి నుంచి రెండ్రూపాయల కాగితాన్ని తీసుకోవాలనుకొన్నాడు. గబగబా రావులున్న యింటి దగ్గర కెళ్ళాడు. ఆ యిల్లు ఎత్తుగా వుంది. ఏడెనిమిది మెట్లున్నాయ్.

"రండి బాబూ! తవ(రి డబ్బులు తీసుకోండి!" అరుగు మీద నుంచి ఆహ్వానించాడు రావు(లు. చరచరా ఆ యింటి మెట్లెక్కి రావులు దగ్గర అర్ధ రూపాయి బిళ్ళ తీసుకొని విస విసలాడుతూ మెట్లు దిగాడు. చీకాగ్గా వున్న పట్నాయిక్ అడుగులు సరిగా పడలేదు. ఆ యింటి ఆఖరి మెట్టు దిగుతూంటే కాలి జోడు పట్టీ తపీమని తెగింది. మంత్రం వేసినట్టు అడుగు వేయలేక అలాగే ఆగిపోయాడు. మూడు వారాల క్రితం అతి తక్కువ ధరలో కొన్న ఆ కొత్త హవాయి చెప్పుని విసిరి పారేయలేదు. ఆ క్షణంలో అతని అవస్థ ఆ పరమాత్మునికే తెలియాలి!

ఆ జోళ్ళ జతని తీసి చేతిలో వున్న సంచీలో వేసుకొన్నాడు. కాళ్ళు కాలుతూంటే మైలున్నర దూరంలో వున్న బజారులోకి నడిచాడు. రెండు రూపాయిలు పెట్టి కొత్త పట్టీలు కొనడానికి పాపం పట్నాయిక్. □



# సినిమా

"చిన్నరాజా"లో భాగ్యరాజా, రాధ

## కోదండరామిరెడ్డి – నాగార్జునలతో వి. ఎం. సి. ప్రొడక్షన్స్ చిత్రం

"రెగ్యులర్ షూటింగ్ మే 26 నుంచి జరుగుతోంది. ఊటీలో పది రోజుల పాటు షూటింగ్‌తోజూన్ 24కు పూర్తయిపోతుంది. ఓ కీలకమైన భూమికను జయసుధ అభినయిస్తోంది. ఆమె పక్కన ఒక ప్రముఖ హీరో ఉంటారు," అన్నారు ఎ. కోదండరామిరెడ్డి. ఈయన దర్శకత్వంలో వి. దొరస్వామిరాజు నిర్మిస్తున్న చిత్రంలో నాగార్జున, అమల, మురళీమోహన్, సత్యనాయణ, రంగనాథ్, గొల్లపూడి మారుతీరావు, సుధాకర్, శుభలేఖ సుధాకర్, అన్నపూర్ణ, శ్రీలక్ష్మి నటిస్తున్నారు. సత్యానంద్, వేటూరి, చక్రవర్తి, సుధాకరరెడ్డి, డి. వెంకటరత్నం, తార, శ్రీనివాసరాజు, సూపర్ సుబ్బరాయన్, బి. వి. సుబ్బారావు, రామారావు తెరవెనుక కృషి చేస్తున్నారు.

"సిరిపురం చిన్నోడు"లో జీవిత



## "అల్లరి పాండవులు" జూన్‌లో

"అల్లరి చిల్లరగా తిరుగుతూ, సరదాగా జీవితాల్ని గడిపేసే అయిదుగురు విద్యార్థుల వల్ల వారి గ్రామానికి మేలే జరుగుతున్నా – అపార్థం పాలవుతూంటారు. ముఖ్యంగా కథానాయకుడ్ని అతని తండ్రితో పాటు ప్రియురాలు కూడా అపార్థం చేసుకుంటుంది. చివరికి అతనెంత నిజాయితీ పరుడో, సహృదయుడో గుర్తింపబడేలోగా చేయని నేరానికి జైలు పాలవుతాడు. నిజం నిలకడ మీద తేలుతుంది. కుటుంబ సభ్యుల చేత, ఆ గ్రామ ప్రజలచేత విశేషంగా కొనియాడబడతాడు.... తమిళంలో సూపర్ హిట్ అయిన 'నంబ ఊరు – నల్ల ఊరు' అనే వినోదాత్మక చిత్రం మాతృక. మా అబ్బాయి హీరో తులసీరాం తండ్రి పాత్రను నేనే ధరించాను," అన్నారు ఎం. బాలయ్య. బి. ఇ. ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో శ్రీ రవిశంకర్ ప్రొడక్షన్స్ అధినేతలు మల్లూరిపల్లి శ్రీరామమూర్తి, పి. శంకర్ నిర్మించిన పై చిత్రంలో అశ్విని, నారాయణరావు, బ్రహ్మాజీ, నాగేశ్వరరావు, శ్యాంబాబు, సజ్జన్, మల్లికార్జునరావు, ప్రసాద్‌బాబు, మిక్కిలినేని, వంకాయల, సుమిత్ర

"అల్లరి పాండవులు"



# ...సేషాలు

_జి.వి.జి.

...అశ్వని, తులసీరాం





"తో బుట్టవులు"లో రఘువరన్, రాధిక, అర్జున్

ఇతర పాత్రధారులు. అప్పలాచార్య మాటలు, రాజ్–కోటి స్వరకల్పనలో సీతారామశాస్త్రి, జాలాది గీతాలు రాశారు. ఎం. జి. ఆర్. మణి ఛాయ, కె. ఎల్. ధర్ శిల్పం, శివ శంకర్ – తార నృత్యాలు, అప్పారావు సాహసాలు, ఎ. నాగేశ్వరరావు సహకార దర్శకత్వం, కె. రవికుమార్ ప్రొడక్షన్ నిర్వహించారు.

## కోదండరామిరెడ్డి, బాలకృష్ణలతో డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ చిత్రం

"రాజమండ్రి వద్ద జూన్ 26న షూటింగ్ ప్రారంభం. ఆగస్టులో షూటింగ్ పూర్తవుతుంది", అన్నారు డి. వి. ఎస్. రాజు. ఈయన నిర్మించే డి. వి. ఎస్. ప్రొడక్షన్స్ తాజా చిత్రంలో బాలకృష్ణ, విజయశాంతి, అశ్వని, రాజేష్, వేలు, వీరభద్రరావు, బాలాజీ, అరుణ, అన్నపూర్ణ నిర్మల పాత్ర ధారులు. కలైమణి కథ, పరుచూరి సోదరుల రచన, నందమూరి మోహన కృష్ణ ఛాయ, శ్రీనివాసరాజు శిల్పం, చలసాని రామారావు సంయుక్త దర్శకత్వం, రఘు నృత్యాలు, గోపాలకృష్ణ ప్రొడక్షన్, బాబూరావు కూర్పుతో ఎ. కోదండరామిరెడ్డి స్క్రీన్‌ప్లే, దర్శకత్వం బాధ్యతలు వహిస్తున్నారు.

## "చందమామ రావే" రామోజీరావు చిత్రానికి మౌళి దర్శకత్వం

"ఇదొక తమాషా తరహా కథ" జూన్ 21 నుంచి జూలై 4, జూలై 20 నుంచి ఆగస్టు 5 వరకు హైదరాబాద్‌లో మొత్తం షూటింగ్ పూర్తవుతుంది", అన్నారు అట్లూరి రామారావు. ఈయన నిర్మాణ సారధ్యం వహించే ఉషాకిరణ్ మూవీస్ వారి పై చిత్రంలో చంద్రమోహన్, కల్పన, నూతన్ ప్రసాద్, మల్లికార్జునరావు, విద్యాసాగర్, చిట్టిబాబు, ఎం. ఎస్. ప్రకాష్, రాజ్యలక్ష్మి, కుట్టి పద్మిని, తాతినేని రాజేశ్వరి, కృష్ణవేణి, చిలకరాధ, బేబీ సుజిత పాత్రధారులు. కాశీ విశ్వనాధ్ కథ, మాటలు రాశారు. వేటూరి గీతాలను సత్యం స్వరకల్పన చేశారు. నవకాంత్ ఛాయ, భాస్కరరాజు శిల్పం, శివసుబ్రహ్మణ్యం నృత్యాలు, గౌతంరాజు కూర్పుతో సి. హెచ్. రామోజీరావు నిర్మించే ఈ చిత్రానికి మౌళి దర్శకుడు. "ఇద్దరు సరదా దొంగలు చేసే చిత్ర విచిత్రాలకు చైల్డ్ సెంటిమెంట్‌ను మిళితం చేసిన కథ," అని మౌళి తెలిపారు.



# ఆంధ్రసచిత్రవారపత్రిక



పాఠకులకు

## శతచిత్ర నటి సుమలత

సమాధానాలు!

### త్వరలో ప్రారంభం!

తెలుగు సినిమా ప్రేక్షకుల ఆదరాభిమానాలని విశేషంగా చూరగొన్న శత చిత్ర నటి సుమలత ఆంధ్ర సచిత్ర వారపత్రిక పాఠకుల ప్రశ్నలకు సమాధానాలు ఇస్తారని తెలియచేయటానికి సంతోషిస్తున్నాము. త్వరలో ప్రారంభం కాబోయే ఈ శీర్షికకి పాఠకులు అర్థవంతమైన ప్రశ్నలని మాత్రమే పంప గోరుతున్నాము. వారం వారం ప్రచురింపబడే ఈ శీర్షికలో ప్రతివారం సుమలత ఎన్నిక చేసిన ఉత్తమ ప్రశ్నని పంపిన వారికి ఆటోగ్రాఫ్‌తో ఉన్న ఆమె అందమైన ఫోటో బహుమతిగా లభిస్తుంది. ప్రశ్నలు పంపేవారు తమ ప్రశ్నని ఈ కింది కూపన్‌లో స్పష్టంగా సిరాతో లేదా బాల్ పాయింట్ పెన్‌తో రాసి తమపేరు, పూర్తి చిరునామాతో - సహా " సుమలత సమాధానాలు " శీర్షిక పేర సంపాదకుడు, ఆంధ్ర సచిత్ర వారపత్రిక, గాంధీనగరం, విజయవాడ –520003 అన్న చిరునామాకి పంపాలి. ఒక కూపన్‌లో ఒక ప్రశ్నని మాత్రమే రాయాలి. విడిగా రాసి పంపినవి పరిశీలింప బడవు.

**పాఠకులు ఈ అవకాశాన్ని ఉత్సాహంతో వినియోగించుకోగలరని ఆశిస్తున్నాము.**

-------------------- కూపన్ --------------------

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

## సుమలత సమాధానాలు

ప్రశ్న........................................................................

..............................................................................

..............................................................................

పంపినవారి పేరు..............................................................

పూర్తి చిరునామా.............................................................

# సినిమా

## పి. ఎల్. నారాయణ దర్శకత్వంలో "ఊరేగింపు"

"వ్యాపార దృక్పథాన్ని విడనాడకుండా అందరినీ ఆలోచింప జేసే సామాజిక స్పృహ గల చిత్రాలను తయారు చేయాలని మా తపన. ఆలక్ష్యంతోనే 'కృషి నికేతన్' సంస్థను స్థాపించాం. అక్టోబర్ మొదటి వారంలో పాటలు రికార్డ్ చేసి, నవంబర్ 12న షూటింగ్ ప్రారంభిస్తున్నాం", అన్నారు ఖమ్మం జిల్లాకు చెందిన అభ్యుదయ భావాలు గల కొందరు యువకులు. వీరి తొలి చిత్రం "ఊరేగింపు"లో ఈ చిత్ర దర్శకుడు పి. ఎల్. నారాయణరావుతో పాటు రాళ్ళపల్లి, శుభలేఖ సుధాకర్, త్యాగరాజు, జీవా, నగేష్‌బాబు, శ్రీహరి, నిర్మల, అన్నపూర్ణ, శ్రీలక్ష్మి, మరో ముగ్గురు యువతులు పరిచయంగావింప బడుతున్నారు. ఇసుకపల్లి మోహనరావు, జాలాది, వంగపండు, సత్యం, ఆర్. రామారావు, రాజు, హాజీ ప్రభృత సాంకేతిక వర్గంతో ఎస్. కె. సోందు, కమతం లక్ష్మి నిర్వహణ బాధ్యతలు వహిస్తున్నారు. నాళ్ళ సత్యనారాయణ ఎగ్జిక్యూటివ్ ప్రొడ్యూసర్. దొండపాటి శ్రీనివాస్ ప్రొడక్షన్ డిజైనర్. "ఖమ్మం జిల్లా వైరా ప్రాంతాలలో షూటింగ్", అన్నారు ఎన్. రవి సమర్పణలో ఈ చిత్రాన్ని నిర్మించే డి. వి. ఎస్. నారాయణ.

## కోడి రామకృష్ణ దర్శకత్వంలో "స్టేషన్ మాస్టర్"

"జూన్ 25 నుంచి షూటింగ్. జూలై, ఆగస్టులలో జరిగే తదుపరి షెడ్యూల్స్‌తో షూటింగ్ ముగుస్తుంది," అన్నారు ఎస్. జయరామారావు. ఈయన నిర్మాణ సారధ్యంలో రావుగోపాలరావు సమర్పించే ఆర్. జె. ఆర్. ప్రొడక్షన్స్ వారి ఫైచిత్రంలో రాజేంద్రప్రసాద్, రాజశేఖర్, రావు గోపాలరావు, వేలు. ఇద్దరు కథానాయికలు ఉంటారు. గణేష్‌పాత్రో సంభాషణలు, చక్రవర్తి సంగీతం, విజయ్ ఛాయతో ఎస్. అంబరీష్ నిర్మాత. "వినోదంతో పాటు చక్కని సందేశమిచ్చే చిత్రం," అన్నారు డైరెక్టర్ కోడి రామకృష్ణ.

"స్వతంత్రానికి ఊపిరి పోయండి"లో అహల్య





"కృష్ణలీల"లో మోహన్‌బాబు

## పరుచూరి సోదరుల దర్శకత్వంలో పోకూరి సోదరుల "ప్రజాస్వామ్యం"

ప్రజాస్వామ్యాన్ని భక్షం చేసుకోవాలన్నది అన్నగారి అధికారమైతే, ప్రజాస్వామ్యాన్ని కాపాడాలనే తపనతో తన జీవితాన్ని అర్పించే పాత్ర చెల్లెలిది ప్రభుత్వం అంటే ప్రజలమే అన్న విషయాన్ని మర్చిపోయి ఏదో యాంత్రికంగా జీవితాన్ని కొనసాగిస్తున్న ప్రజానీకం కళ్ళు తెరిపించే కథ ఇది ప్రఖ్యాత దర్శకుడు, మహామనీషి స్వర్గీయ టి కృష్ణ సూచించిన కథ ఆయన ఆశయాలకు దర్పణంగా రూపొందిస్తున్నామీ చిత్రాన్ని నేను అభ్యుదయ ఎవ్వవకవి పాత్ర ధరిస్తున్నాను మా బ్రదర్ వెంకటేశ్వరరావుకూడా ఒక కీలకమైన పాత్రను నిర్వహిస్తున్నారు," అన్నారు పరుచూరి గోపాలకృష్ణ ఈ సోదరుల కథ, మాటలు, స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో పోకూరి బాబూరావు సమర్పించే ఈ తరం ఫిలిమ్స్ వారి "ప్రజాస్వామ్యం" చిత్రంలో 'ఊర్వశి' శారద, డాక్టర్ రాజశేఖర్ శివకృష్ణ, నూతన్ ప్రసాద్, రాజ్‌వర్మ, నర్రా, పి ఎల్ నారాయణ, నల్లూరి వెంకటేశ్వర్లు, రమణారెడ్డి, కిరణ్, ఏచూరి, మహారథి, సంజీవి, జీవిత, వై విజయ, రాగిణి, తాతినేని రాజేశ్వరి, హీరా నటిస్తున్నారు అదృష్టదీపక్, అడబాల గీతాలు, చక్రవర్తి సంగీతం, విజయ్ ఛాయ, సోమనాథ్ శిల్పం, అప్పాజీ సాహసాలు, సి హెచ్ కోటేశ్వరరావు ప్రొడక్షన్, యం శివప్రసాద్ సహకార దర్శకత్వం, గౌతం రాజు కూర్పుతో బెజవాడ కోటేశ్వరరావు ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్. "జూన్ 15 నుంచి జూలై 14 వరకు మద్రాసులో, జూలై 16 నుంచి 21 వరకు ఒంగోలులో షూటింగ్," అన్నారు నిర్మాత పోకూరి వెంకటేశ్వరరావు.





"ఖైదీ నాగమ్మ"లో శరత్‌బాబు, అనూరాధ



"గుండమ్మగారి కృష్ణులు"లో రాజేంద్రప్రసాద్, రజని

# సినిమా

## బాలకృష్ణ, విజయశాంతితో వై. హరికృష్ణ చిత్రం

"ఆగస్టు నుంచి అక్టోబర్ వరకు షూటింగ్, అన్నారు హరికృష్ణ ఈయన నేతృత్వంలో వై అనిల్‌బాబు నిర్మించే కృష్ణ చిత్ర వారి కొత్త చిత్రంలో బాలకృష్ణ, విజయశాంతి నాయకా నాయికలు. చక్రవర్తి సంగీతం గౌతం రాజు కూర్పుతో ముత్యాల సుబ్బయ్య దర్శకుడు

## అర్జున్‌తో శ్రీ పద్మజా విజయలక్ష్మీ ఫిలిమ్స్ చిత్రం

"జూన్ 24న పాటలరికార్డింగ్ జూలై 1 నుంచి నెలాఖరు వరకు ఒకే షెడ్యూల్లో షూటింగ్ 'సీతా' అనే పదహారేళ్ళ అందమైన భామను పరిచయం చేస్తున్నాం,' అన్నారు ఆర్. రామకృష్ణంరాజు ఈయన సమర్పణలో పి వి రామరాజు నిర్మించే శ్రీ పద్మజా విజయలక్ష్మి ఫిలిమ్స్ చిత్రంలో అర్జున్, సీతా, శివకృష్ణ, అరుణ, రాజ్యలక్ష్మి, గొల్లపూడి మారుతీరావు, కోట శ్రీనివాసరావు, కోట శంకరరావు, మల్లికార్జునరావు, గోకిన రామారావు, మాస్టర్ రాజేష్ వగైరా నటవర్గం గిరిజశ్రీ భగవాన్ కథకు సుదర్శన్ భట్టాచార్య సంభాషణలు రాశారు రాజ్ కోటి సంగీతం, ఎస్ ఎస్ రాజా ఛాయతో పి ఎన్ రామచంద్రరావు స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు

## కల్యాణ హరీన్ చక్రవర్తులతో కె. వి. వి. సత్యనారాయణ మరో చిత్రం

'మనరాష్ట్రంలోని గ్రామీణ వాతావరణంలో పదీ రోజుల షెడ్యూల్ పూర్తయింది జూన్ మూడు నుంచి తదుపరి షెడ్యూల్ 15 రోజుల పాటు జరుగుతుంది,' అన్నారు 'అక్షింతలు" చిత్రాన్ని నిర్మిస్తున్న సత్యా మూవీ క్రియేషన్స్ అధినేత కె వి వి సత్యనారాయణ. ఈయన కొత్త చిత్రంతో కల్యాణ చక్రవర్తి, హరీన్ చక్రవర్తి, నూతన్‌ప్రసాద్, రాళ్ళపల్లి, వై. విజయ, చిట్టిబాబు, ఏలేశ్వరం రంగా ప్రభృత నటవర్గం కొంపెల్ల విశ్వం మాటలు, శ్యామ్ సంగీతం, సురేష్ ఛాయ, కె. రామ్మోహనరావు నిర్మాణ సారథ్యంతో మౌళి కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వ బాధ్యతలు వహిస్తున్నారు

## కాశ్మీర్‌లో గీతా ఆర్ట్స్ 12 వ చిత్రం

"మే 3 నుంచి 15 వరకు కాశ్మీర్‌లో షూటింగ్ పూర్తి చేశాం " అన్నారు అల్లు అరవింద్ ఈయన నిర్మించే గీతా ఆర్ట్స్ 12 వ చిత్రంలో చిరంజీవి, సుమలత, విజయశాంతి, రాజ్యలక్ష్మి, జగ్గయ్య, అల్లు రామలింగయ్య, గుమ్మడి, గిరిబాబు, ప్రసాద్‌బాబు, కన్నడ ప్రభాకర్, మమత, బేబీ సుజిత పాత్రధారులు. జంధ్యాల మాటలు, వేటూరి పాటలు, చక్రవర్తి సంగీతం, లోకసింగ్ ఛాయ, చలసాని రామారావు సంయుక్త దర్శకత్వం, బి చలం శిల్పం, తార నృత్యాలు, కనకేష్ సహకార దర్శకత్వం, వెళ్ళస్వామి కూర్పుతో అల్లు రామలింగయ్య సమర్పించే ఈ చిత్రానికి మోహన్ ప్రొడక్షన్ ఎగ్జిక్యూటివ్



"జయభేరి"లో విజయలలిత, ప్రసాద్‌బాబు, ప్రభ

## "భామా కలాపం

అమ్మలక్కల మాటలు విని, తన భర్త తనకు దూరమై మరెవరికైనా చిక్కిపోతాడేమో అన్న అనుమానంతో ఓ భామ సతమతమై పోవడం ప్రధానాంశం హాస్యం పుష్కలంగా ఉంటుంది, అన్నారు రేలంగి నరసింహారావు. ఈయన స్క్రీన్‌ప్లే,

## సినిమా

దర్శకత్వంలో గందం జగన్మోహన్ నిర్మించే రాగ హిమజ ఫిలిమ్స్ వారిపై చిత్రంలో రాజేంద్ర ప్రసాద్, నూతన్ ప్రసాద్, వేలు, వీరభద్రరావు, శ్రీలక్ష్మి, అన్నపూర్ణ, విజయవాణితో పాటు ఓ నవతార రెండవ నాయికగా నటిస్తోంది కథ, మాటలను ఆదివిష్ణు రాశారు వాసూరావు స్వరకల్పనలో సి నారాయణరెడ్డి, సీతారామశాస్త్రి గీతాలు రాశారు బి కోటేశ్వరరావు ఛాయ, సోమనాథ్ శిల్పం, సి వి ఆర్ బాబు సంయుక్త దర్శకత్వం, జై ప్రకాష్ ప్రొడక్షన్, డి రాజగోపాల్ కూర్పు, పి రవిప్రసాద్ నిర్వహణతో లక్ష్మణమూర్తి సహనిర్మాత జూన్ 6 నుంచి 13 వరకు మొదటి షెడ్యూల్ జరిగింది. తదుపరి షెడ్యూల్స్ జులై 8–20, ఆగస్ట్ 15–31,' అని నిర్మాత తెలిపారు.

## "ముద్దు బిడ్డ" కృష్ణ

"తానే నిస్సహాయస్థితిలో ఉన్నా – పద్మవ్యూహంలో విధివశాత్తు చిక్కుకున్న తన ఆరేళ్ళ కొడుకును రక్షించుకోడానికి తనను వెన్నాడే వ్యవస్థను, విధిని ఎదురించిన ఒక ధీశాలి కథ జూలై 11 నుంచి 20 వరకు మొదటి షెడ్యూల్ ఆగస్ట్ 14 నుంచి 27, సెప్టెంబర్ 11 నుంచి 20 వరకు తదుపరి షెడ్యూల్స్', అన్నారు పి చంద్రశేఖర రెడ్డి ఈయన స్క్రీన్‌ప్లే, దర్శకత్వంలో నవ సంస్థ బాలాజీ ఫిలిమ్స్ అధినేతలు జి సత్యనారాయణ, సి హెచ్ పాపారావు నిర్మించే ముద్దు బిడ్డ చిత్రానికి జూన్ 1న తొలి గీతం ధ్వనిముద్రితమైంది కొమ్మనాపల్లి గణపతిరావు కథ, మాటలు రాశారు ఆత్రేయ గీతాలకు కె వి మహాదేవన్ స్వరకర్త □

# అభిమాన తారలపై అభిప్రాయం

నటన అను పదానికి అర్థం చెప్పగల నా అభిమాన నటుడు అఖిలాంధ్ర ప్రజానీకంచే సుప్రీం హీరో అని పిలిపించుకొంటున్న శ్రీ 'చిరంజీవి' ఆయన నటనాచాతుర్యం చూచిన ఎవరైనా అతని అభిమానులుగా మారతారని ఘంటాపథంగా



చెప్పవచ్చును ఎటువంటి పాత్రలనైనా అవలీలగా పోషించి ప్రజల మన్ననలు అందుకోగల ఏకైక వ్యక్తి మన చిరంజీవి.

నాకు సినీ పరిజ్ఞానం ఉన్నప్పటి నుంచి నా అభిమాన హీరో చిరంజీవి దొంగ మొగుడు, ఆరాధన 1987లో ఘన విజయం సాధించినందులకు సంతోషం అలాగే 'చక్రవర్తి' కూడా ఘనవిజయం సాధించింది నిండుదనమైన పాత్రల్లో చిరంజీవిని చూడాలని నా అభిలాష

– కాకుమాను జోసెఫ్‌రాజ్, విస్సన్నపేట

★ ★ ★

'విశాల నేత్రి' భాను నా ప్రియ తార అనతికాలంలో తెలుగు చలనచిత్ర పరిశ్రమలో తన స్థానాన్ని సుస్థిరపరచుకున్న ఈ 'విశాలాక్షి' తన నేత్రాభినయంతో తెలుగు ప్రేక్షక లోకాన్ని ఉర్రూతలూగిస్తున్నది. సితారతో ప్రవేశించి ఆలాపన, అన్వేషణ, మంచి మనసులు వంటి చిత్రాలతో, ఈ 'సుందరాంగి' ప్రేక్షకలోకానికి తన ప్రతిభను చాటి చెప్పింది అలనాటి 'సితార' నుండి నేటి 'చక్రవర్తి' వరకు తన నాట్య ప్రతిభతో ప్రేక్షకుల



'హృదయరంజని'గా నిలిచిపోయింది. ఇంతటి ప్రతిభకల ఈ 'అభినేత్రి' హిందీ చిత్ర పరిశ్రమ యొక్క మన్ననలు కూడా పొందటం నిజంగా హర్షదాయకము. అభిమానిగా నేను నా ప్రియ తారను నృత్య ప్రధాన పాత్రలలో ఎక్కువగా చూడాలని ఆకాంక్షిస్తున్నాను.

-కె. సురేష్, హైదరాబాద్

ఒక మనిషిని యేడ్పించటం అందరికి సాధ్యమేమో, కాని ఒక మనిషిని నవ్వించగలగటం కొందరికే సాధ్యం నవ్వు కొరకు మన సినిమాలలో హాస్యనటులున్నారు కానీ హీరోగా చెలామణి అవుతు ప్రేక్షకులను నవ్వించగల నేర్పు, ప్రజ్ఞ ఉన్న నటులను వ్రేళ్ళతో లెక్కించవచ్చు. అటువంటి వారిలో చంద్రమోహన్ గారొకరు. వారు ప్రేక్షకులను కడుపుబ్బ నవ్వించగలరు. అలాగే యేడ్పించ గలరు కూడా. ఎటువంటి పాత్ర నైనా ఒక యాక్టరుగ పోషించేందుకు సిద్ధంగా ఉంది, ఆ పాత్రకు ప్రాణం పోసే చంద్రమోహన్ గారంటే నాకు అమితమైన



అభిమానం

–యం. ఏ. రమణమూర్తి, డోర్నకల్

★ ★ ★

నాటి "క్రొత్త జీవితాలు చిత్రం నుండి నేటి ప్రెసిడెంటు గారి అబ్బాయి" చిత్రం వరకు మా హృదయాలను దోచుకుని వినీలాకాశంలో వెలుగొందే ఏకైక తారామణి మా సుమధుర సుందర



హాసిని సుహాసిని గలగల పారే సెలయేరులా నవ్వుతూ, తుళ్ళుతూ, వుండే సుహాసిని 'సిరివెన్నెల చిత్రంలోని మూగ పాత్రకు జీవం పోశారు. ఆమె నటించే చిత్రాలు ఎక్కువగా చూస్తుంటాను నటనలో ఆమెకు ఆమే సాటి సుహాసిని కట్టు, బొట్టు తీరులో తెలుగు సంస్కృతిని ఇనుమడింప చేసి అచ్చమైన తెలుగు ఆడపడుచు అందాలను సంతరించుకున్న ఆమె ఇక ముందు కూడ మోడరన్ దుస్తులు కాక తెలుగుదనం వుట్టిపడే వస్త్ర ధారణే చేయాలని నా అభిలాష. సుహాసిని గారు డబ్బింగ్ సంభాషణలు చెప్పకుండా రాబోవు చిత్రాలలో స్వయముగా మాట్లాడాలని నా ఆకాంక్ష

–ఇమ్మానేని వెంకటేశ్వరరావు, ఆకులఅల్లూరు,(ప్రకాశం)

యువకిశోరం నందమూరి బాలకృష్ణ నా అభిమాన హీరో నేను 'డిస్కోకింగ్' బాలకృష్ణ నటించిన "పట్టాభిషేకం" సినిమా చూసి నప్పుడు ప్రేయసి కోసం నందమూరి అందగాడు పడిన కష్టాలు నేను పడినట్టు అయ్యింది ఆ సినిమాలో



అతని నటన నాకు చాలా బాగా నచ్చింది అప్పటి నుండి నేను అతని అభిమాని నయ్యాను బాలకృష్ణ లాయర్, పోలీస్ ఆఫీసర్, పాత్రలలో, చూడాలని వుంది ముందు మంచి పాత్రలలో నటించి, తన తండ్రికి తగ్గ తనయుడై, మంచి పేరు తెచ్చుకోవాలని అందరి మనసులలో "సాహస సామ్రాట్ గా నిలిచి పోవాలని నాకోరిక

–పి రామ్‌ప్రసాద్, అనకాపల్లి

★ ★ ★

అమెరికా నుండి ఆంధ్రా తెరకెక్కిన అమెరికన్ అందాల యువనటుడు 'టామ్' నా అభిమాన నటుడు ఆయన నటించిన మొదటి చిత్రం 'పడమటి సంధ్యారాగం' ఆయనకు పర భాషా పరదేశ చిత్రమైనా అనుభవమున్న నటుడిగా నటించగలిగాడు ముఖ్యంగా ఆ చిత్రంలో 'పిబరే రామరసం' పాటలో సంధ్యకు' 'టాటా' చెప్పే సన్నివేశంలోనూ, ఆమె తెల్ల చీర కట్టుకు రావటం ద్వారా, ఆమె తన ప్రేమ నంగీకరించిందన్న సంతోషాన్ని వ్యక్తపరచే సన్నివేశంలోనూ అతడి నటన, అందం, యువతను విశేషంగా ఆకర్షించాయి అందుకే మొదటి చిత్రం ద్వారానే



అనేకమంది అభిమానుల్ని పొందగలిగారాయన ఆ చిత్రం తర్వాత ఆయన మరలా తెలుగు చిత్రాలలో నటించడానికి యిష్టపడటం సంతోషదాయకమైన విషయం ఆయన తెలుగు చక్కగా మాట్లాడటం నేర్చుకుని, కథాబలం వున్న అనేక తెలుగు చిత్రాలలో నటించాలని ఆయన అభిమానిగా ఆశిస్తున్నాను

-బి. సావిత్రి, తిరుపతి □

సీరియల్

# తీపి గరళం

## తమిరి వెంకటసీతామహాలక్ష్మి

(గత సంచిక తరువాయి)

చీకట్లు అప్పుడే ముసురు కుంటున్నాయి- పంచాయితీ ఆఫీసు అరుగుమీదికి ఒకరూ ఒకరూ చేరుకుంటున్న వేళ-

"చూశావా సత్తెం ఆడెంత అన్యాయాని కొడిగట్టేడో" అంటూ వచ్చాడు రంగన్న- రంగన్నకి ఏభై ఏళ్ళుంటాయి- జీవితంలో ఢక్కా మొక్కీలు తిన్నవాడే. కానీ సత్తెకాలపు వాడు. అన్యాయం జరుగుతూన్నా నోరు మెదపలేనంత అమాయకుడూ, భయస్తుడూను.

"ఏం జరిగింది రంగన్నా" అన్నాడు సత్యం.

జరిగిందేదో విడమర్చి చెప్పాడు రంగన్న-

ఫేక్టరీలో షేర్లున్న రైతులకి మూడు కేజీల పంచదార వూరికినే యివ్వడానికి నిశ్చయించి అటువంటి రైతులకు గుర్తింపుగా పంచదార కార్డుల నిచ్చింది ఫేక్టరీ యాజమాన్యం. యాజమాన్యానికీ రైతుకీ మధ్య నుండే ఫీల్డ్మేన్ అనబడే వుద్యోగస్తుడే వీటి వ్యవహారాల్ని చూసుకుంటాడు-

ఏ వ్యవహారమైనా లాభసాటిగా వుండాలనేది ఉద్యోగస్తుల నిర్ణయం అంచేత రైతులకు ఉచితంగా యిచ్చే పంచదారలో వాళ్ళూ 'భాగస్వాములౌతారు- తద్వారా రైతుకంటె ఎక్కువ లాభాన్ని పొందుతారు.

రంగన్న సన్నకారు రైతే- రెండు సంవత్సరాల క్రితం వరకూ అతడూ శెట్టిగారి దగ్గర అప్పు తీసుకుంటూ అతగాడికే బెల్లాన్ని తోలేవాడు- ఈ రెండేళ్ళ బట్టే ఫేక్టరీలో షేర్లు తీసుకుని ఫేక్టరీకి చెరుకు తోలడం మొదలు పెట్టేడు-

"ఓరె- మీ రైతాంగం కాఫీలూ టీలూ తాగరు గదర్రా- యీ పంచదార కార్డులు నా దగ్గిరే వుంచుతాను- మీక్కావల్సి వచ్చినపుడు అడగండి. యిచ్చేస్తా" అన్నాడు ఫీల్డుమేను కార్డులు పంచే సమయంలో -

రంగన్న లాంటి అమాయకులు అలాగేనని తలూపేసేరు- కాదు కూడదంటె రేప్పొద్దున్న తమకే ఆపదొచ్చినా అడ్డుకునే వాళ్ళెవరూ? ఆ ఫేక్టరీ గొడవలతో నూ వ్యవహారాలతోనూ తమలాంటి వాళ్ళు పడలేరు- అదీకాక తమకా పంచదార అవుసరమూ ఏం వుండదు- పొలం గట్టుమీద కూచుని బంగారు తీగలాంటి ఓ చెరుకు గడొకటి విరుచుకు తిండంలో వున్న ఆ ఆనందం, ఆ రుచీ, యీ పంచదారను తినడంలో వుండదు-

ఈ రెండేళ్ళూ ఆ కార్డు సంగతే మర్చిపోయాడు రంగన్న. అయితే కూతురు పెళ్ళి నిశ్చయమయ్యాక అతనికీ కొంత పంచదార అవసరమైంది-

అప్పుడడిగితే లేదు పొమ్మన్నాడు ఫీల్డుమేను

"పంతులూ యిది నీకు న్యాయం కాదు- తీసుకున్నన్నాళ్ళూ తీసుకున్నావ్. ఇయాళ నా కవుసర మొచ్చింది. పిల్ల పెళ్ళి- అంచేత అడుగుతున్నా' అన్నాడు రంగన్న నోరు పెగుల్చుకుని-

ఆ కార్డు సంగతే నాకు తెలీదన్నాడు ఫీల్డుమేను మనిషి లోని మంచితనాన్ని ఆసరా చేసుకుని మోసగించడం సహించలేక పోయాడు రంగన్న. ఆ సంగతంతా సత్యంతో పూసగుచ్చినట్టు చెప్పేడు-

"నీ కొచ్చిన భయం లేదు. నేను చూసుకుంటానుగా.' అని సత్యం చెప్పడంతో కాస్త తెప్పరిల్లేడు-

ఆ మర్నాడే నలుగురు రైతుల్ని వెంట వేసుకుని వెళ్ళి ఫీల్డుమేన్ని కలిసేడు సత్యం- ఆ ఫీల్డ్మేన్ పేరు రమణయ్య పంతులు. బీద బ్రాహ్మడే అయినా కుర్రాడు బుద్ధిమంతుడే అని పేరు తెచ్చుకున్నాడు మొదట్లో- తనకు కలిసొచ్చేదైతే చాలు అన్ని మంచి గుణాలూ నట్టేట్లో కల్సిపోతాయి గాబోలు'

పంతులూ- నిన్ను యిన్నాళ్ళూ మంచోడివీ, మర్యాదస్తుల కుర్రోడివీ అనుకున్నాను- రేపు వాటేక తెప్ప తగలేసే బుద్ధి ఎవరికీ మంచిది కాదు. కాఫీలూ టీలూ తాగని సన్నకారు రైతోళ్ళు గాబట్టి యిన్నాళ్ళూ ఫేక్టరీ యిస్తున్న పంచదార ఆళ్ళు తీసుకోకుండా నీ కొగ్గేసేరు- అనుభవించినన్నాళ్ళూ అనుబవించేవు- ఆ కార్డులన్నీ వాడుకున్నావు. మరియ్యాళ అవుసరమొచ్చి అడిగితే లేదు పొమ్మన్నావుట- అది మర్యాద కాదు- మనం మనిషి జన్మెత్తేం గాబట్టి ఎదుటి మనిషిని ఆదుకోవాలి- రంగన్న కూతురి పెళ్ళి- ఐదో పదో కేజీలియ్యి ఆ తర్వాత నువ్వే తిను- ఎవరూ ఒద్దన రు-" అన్నాడు సత్యం- ఆ

జరిగిన కథ -5 : దేవుడి సలహాతో సంగమయ్య స్వయంగా చెరుకు తోట వెయ్యడంతో పాటు భాగానికి కూడ వేస్తుంటాడు సంగమయ్యకు కొడుకు పుడతాడు. రుణంతో సంగమయ్య కొనుక్కున్న పాడి గేదె, ఎడ్లు, ఆస్తీ, పంటా సమస్తం వరదల్లో కొట్టుకుపోతాయి మళ్ళీ రుణం కోసం కరణాన్ని ప్రాధేయపడతాడు దేవుడు కరణం మోసాన్ని అధికారులకు తెలియజేసి పట్టించుతాడు. దేవుడు హత్య చేయబడతాడు తరం మారి దేవుడి కొడుకు దేవుడిలానే ప్రజల తలలో నాలుకవుతాడు

మాటకే పంతులు గయ్యిమని లేచాడు–

"ఒకరిద్దరి కార్డులు నా దగ్గరున్న మాట నిజమే..... అయితే రంగన్న కార్డు సంగతి మాత్రంనాకు తెలీదు– నోరుంది కదా అని దమాయించి మనుషుల్ని తీసుకొస్తే నేనూ దానికి తగిందానినే చేయగలను." అనేసి వెళ్ళిపోయేడు–

సత్యం; అతని వెనక వచ్చిన వాళ్ళూ ముఖముఖాలు చూసుకున్నారు–

"బక్కపీనుగ గట్టివాడే" అన్నారొకరు–

"పొన్లే.... అన్నీ తెనసీ– న్యాయం, ధర్మం లేవా" అన్నారింకొకరు.

కానీ సత్యానికి మాత్రం ఆ విషయాన్ని అంతటితో వదల బుద్ధి కాలేదు– ఇవాళ్టికిది చిన్న విషయమే కావొచ్చు– రేప్పొద్దున్న యేం జరిగినా యింతేగా! ఈ సన్నకారోళ్ళు ఏం జేస్తార్లే అన్న ధీమాయే ఆ బక్కగాణ్ణి అంతలా చేసింది.– అనుకున్నాడు– ఆ సంగతే అందరితోనూ అన్నాడు–

"మనమిలా వూరుకోకూడదంతే– మరోమారు గట్టిగా ఎచ్చరించి చూదాం. అంతకీ లొంగకపోతే ఫేక్టరీ మేనేజరుకే నోటీసంపుదాం– ఆడిమీద రిపోర్టు చేదాం." అన్నాడు-

కొందరికది తొందరపాటు చర్యగా కన్పించింది– మరికొందరు వుడుకురక్తంగాళ్ళు "అలా చెయ్యాల్సిందే" అన్నారు.

ఆ మర్నాడే మరోమారు పంతుల్ని కల్సి చెప్పాల్సింది చెప్పి వూరుకున్నాడు– ఈమారు పంతులు మునపటిలా మెత్తగా లేడు–

"ఎవడికి చెప్పుకుంటారో చెప్పుకోండి– నా దగ్గర ఎవరి కార్డులూ లేవు– ఆ పంచదార సంగతీ నాకు తెలీదు" అన్నాడు గట్టిగానే–

సత్యానికది నిజంగానే కోపం తెప్పించింది– "మావేం అంత చేతగాని వాళ్ళమా. ఈ దెబ్బతో అటో యిటో తేలిపోవల్సిందే" అన్నాడు– ఆ రోజే నలుగుర్నీ పోగేసి ఫేక్టరీ మేనేజర్ని కలిసేడు– విషయం చెప్పేడు–

అంతా విన్న మేనేజరు అతి మామూలుగా అన్నాడు–

"సరే– మీకిచ్చిన కార్డులన్నీ అతని దగ్గిరే వున్నాయంటారు– దీనికి సాక్ష్యాధారాలు లేవు– అయినా మీ కంప్లయింటు రాయించి తెండి– అదే నిజమైతే అతనిమీద తగిన చర్య తీసుకుంటా. మీకు యికమీదైనా అన్యాయం జరక్కుండా చూస్తాను– అయితే ఒక్కమాట– ఆ కంప్లయింట్ మీద వేలి ముద్ర వేసిన వాళ్ళంతా కొసకల్లా అదే మాట మీద నిలబడాలి. మధ్యలో ఎవరికీ లొంగిపోయి జారి పోకూడదు."

అక్కడ కొచ్చిన వారందరి వంకా చూశాడు సత్యం. ఒకరి మొఖా లొకరు చూసుకోడమే గాని ఎవరూ మాట్లాడ లేదు–

"ఏం? ఇందులో లొసుగేటుంది జారిపోడానికి. అలాగే నిలబడదాం కడదాకా ఏవంటార్రా" అన్నాడు.

సరేనంటే సరేనన్నారంతా.

ఆ మర్నాడే ఎవరిచేతో కంప్లయింట్ రాయించి దాని మీద సాధ్యమైనంత ఎక్కువ మంది చేత వేలి ముద్ర వేయించి తీసుకొచ్చి మేనేజర్ గారి కంద జేసేడు సత్యం.

వారం రోజులు తిరగకుండా ఎంక్వయిరీ చేసి, నిజాలు సేకరించేక పంతుల్ని సస్పెండ్ చేస్తున్నట్టు ఆర్డరు వేసేడు మేనేజరు– అంతేగాకుండా రైతుల దగ్గర వాడుకున్న పంచదారను రైతులకి యిచ్చేయవలసిందిగా కూడఆర్డరు వేసేడు–

విషయం తెల్సి విజయగర్వంతో వూగిపోయేడు సత్యం– ఈ కాస్త ధైర్యం



# కార్టూనిస్టులకు సూచనలు !

- ★ కార్టూన్‌లను మంచి డ్రాయింగు కాగితంమీద ఇండియన్ యింకుతో గీసి పంపాలి.
- ★ ప్రతీ కార్టూన్ వెనుక కార్టూనిస్టు పేరు, చిరునామా ఉండాలి.
- ★ వ్యంగ్య చిత్రాలు ప్రస్ఫుటంగా సాధ్యమైనంతవరకూ వాటిపై 'వ్యాఖ్య' చదవటానికి ముందే నవ్వించేవిగా అర్థవంతంగా వుండాలి !
- ★ వ్యాఖ్య **చిన్నదిగా, క్లుప్తంగా** వుండాలి. అక్షరాలు కుదురుగా మొదటిసారి చదివినప్పుడే అర్థం అవ్వాలి ! కార్టూన్ **మీదే** పేరూ, వూరూ అన్నీ రాస్తే అవి తిరస్కరింపబడే అవకాశాలుంటాయి.
- ★ సొంత చిరునామాగల తపాలా బిళ్లలు అంటించిన కవరుగల కార్టూన్‌లను త్రిప్పి పంపడం జరుగుతుంది. దారిలో పోయేవాటికి మా బాధ్యత లేదు.
- ★ ఎన్నుకొన్న కార్టూన్‌లలో అన్నీగాక కొన్ని మాత్రమే ఒక్కోసారి వేసుకోడం జరుగుతుంది. పరిశీలనకు ఐదారు వారాలు పట్టవచ్చు.
- ★ పండుగల కార్టూన్‌లు — బాగా ముందుగా వాటి కవరుమీద ఆ "ప్రత్యేక" సందర్భాన్ని పేర్కొంటూ పంపడం అవసరం.
- ★ రంగుల కార్టూన్‌లు, పెన్సిలు బొమ్మలు, తెల్లకాగితంమీద వేసిన బొమ్మలు పంపవద్దని మనవి.
- ★ మా కార్యాలయానికి స్వయంగా వచ్చి కార్టూన్‌లు అందజేసేవారు కూడా స్వంత చిరునామాగల స్టాంపులతికించిన కవరు జతచేయాలి. కాపీ కార్టూన్‌లు పంపరాదు.

## తిరుగుబాటు

చేయకపోతే యీ గాడికింద పంది కొక్కుల్ని పట్టడం మన వల్లకాదు. అన్యాయాన్నీ అవినీతినీ ఎప్పటికప్పుడు ఎదిరించి అంతం చేయాల్సిందే అన్నాడు రచ్చబండ దగ్గర రైతు లందరితో నూ–

ఆ రాత్రి... వూరు సద్దు మణిగేవేళ... తనింటి కొచ్చిన మనుషుల్ని చూసి ఆశ్చర్య పోయేడు సత్యం.

ఒకరు... పంతులు. మరొకరు... పంతులు తండ్రి–

"సత్యం... జరిగిందేదో జరిగి పోయింది. నా కొడుకును నువ్వే రక్షించాలి– వాడి తరపున నేను క్షమించమని అడుగు తున్నాను– ఏదో తెలియక తప్పు చేశాడు–. ఆ చిన్న తప్పుకి యింత పెద్ద శిక్ష విధించడం తగునా చెప్పు– ఆ ఉద్యోగం వాడి జీవితం– మా అందరికీ అదే ఆధారం– అది లేకపోతే మేం మరో విధంగా బతకలేం– వాడి ఉద్యోగం నిలబెట్టే భారం నీ చేతుల్లో వుంది. నువ్వే కాపాడాలి." అంటూ అక్కడే చతికిల బడిపోయాడు ఆ ముసలాయన.

సత్యంకి అదంతా కలలోలా తోచింది క్షణం సేపు– ఆ తర్వాత ఆలోచించాడు– మనిషిగా కరిగి పోయాడు. "ఛా. మీలాంటి పెద్దోళ్ళు అంతంత మాట లనగూడదు– పంతులుమీద మాకేం శతృత్వం లేదు–.రంగన్నగోడికి అన్యాయం జరిగితే చూడలేక పోయాం. మేనేజర్‌గారితో మాట్లాడతా లెండి" అన్నాడు–

అంత జరుగుతున్నా పంతులు ఒక్క మాట మాట్లాడలేదు– అయినా సరే సత్యం ఏం అనలేదు–

మాటిస్తేనేగాని కదల్లేదా ముసలాయన. ఆ మర్నాడు నలుగురికీ పరిస్థితి వివరించాడు సత్యం–

"చూశావా. ఆళ్ళే గెలుస్తారు చివరికి. మనం ఎర్రోళ్ళంరా– మన కోపం తాటాకు మంటే–" అన్నారు కొందరు. కొందరు విషయాన్ని సానుభూతితో అర్థం చేసుకున్నారు–

మొత్తానికి అందర్నీ ఒప్పించ గలిగేడు సత్యం– ఒకడి నోటి దగ్గర కూడు మన మెందుకు పడగొట్టాలీ అన్నాడు– అదే ఆయుధంలా పని జేసింది–

ఐతే– ఒక చిక్కొచ్చి పడింది– చివరికంటా అదే మాట మీద నిలవా లన్నాడు మేనేజరు– ఇప్పుడెళ్ళి "అది అబద్ధం" అని చెబితే తమ పరువే పోతుంది– తమ మాటా నిలవాలి– పంతుల్నీ ఆదుకోవాలి.

ఆ మర్నాడంతా ఆలోచించి ఒక నిర్ణయాని కొచ్చాడు సత్యం– రచ్చ బండ దగ్గర నలుగుర్నీ కలిసి చెప్పి అందర్నీ ఒప్పించాడు–

అయిందేదో అయిపోయింది గాబట్టి పంతులు తమకు యివ్వవలసిన పంచదారంతా యిచ్చేశాడనీ అతనిని సానుభూతితో క్షమించమనీ మళ్ళీ కాగితం రాసిద్దా మనుకొన్నారు–

దానికంతా ఒప్పుకున్నారు–

"పాపం బతకనీ" అన్నారు కొందరు మార్పుకోరని ముసలాళ్ళు–

ఆ కాగితం తయారు చేసి మేనేజరుకి స్వయంగా తీసుకెళ్ళి యిచ్చేడు సత్యం.

దాన్ని చూసి ఓ నవ్వు నవ్వేడు మేనేజరు–

"మీ వింత జాలి గుండెలు కాబట్టే మీకీ అన్యాయాలు"– అన్నాడతను–

"పోన్లెండి బాబూ– జరిగిందేదో జరిగింది– మాకు సంతృప్తి కలిగింది– పంతుల్నేం చెయ్యకండి. అదే మా అందరి కోరికా– ఈసారి తప్పుకాసి ఒదిలెయ్యండి" అన్నాడు.

"సరే. చూదాం" అన్నాడు మేనేజరు–

"చూదామంటే కాదు బాబూ– కుటుంబం కలవాడు– పాపం." అన్నాడు–

మేనేజరు నవ్వేడు–

సత్యం ఆయన దగ్గర సెలవు తీసుకుని వెనుదిరిగి వచ్చేశాడు.

★ ★ ★ ★ ★

ఊరంతా సద్దుమణిగిన వేళ–

గుడ్డి వెన్నెల లో కాస్సంతా ఆవరించి వుంది.

ఎక్కడో వూరవతల నక్క అరుస్తోంది.

గుడిసె బయటి కొచ్చి గుమ్మడిపాదు ప్రక్కనున్న బండరాయి మీద కూర్చున్నాడు సత్యం– లోపల భార్య నిద్ర పోతోంది– ఆమె యిప్పుడు ఏడో నెల గర్భిణీ– పూర్వంలా ఆకలికీ నిద్రకీ ఆగలేక పోతోంది. తన కోసం చూడొద్దని ఎప్పుడో చెప్పేశాడు. తను యిల్లు జేరడమే ఆలస్యం. వచ్చాక కూడ రైతు లెవరో వస్తూనే వుంటారు– కష్టం, సుఖం, సమస్యలూ– ఎన్నెన్నో చర్చకు వస్తాయి. అలా పొద్దు బోతుంది–

పావు గంట క్రితమే వచ్చి రైతులందరూ యిళ్ళ కెళ్ళి పోయారు–

లోపలి కెళ్ళి పడుకున్నా తన కెంతకీ నిద్ర రాలేదు. ఏవేవో ఆలోచనలు బుర్ర నిండా– మంచితనానికి రోజులు పోయాయని పిస్తుంది కొందరికి జరిగిన అన్యాయాల్ని చూస్తుంటే–

చెరువుగట్టు మీద ఊరకుక్క కుయ్యోమని అరిచింది.

సత్యం లేచి నిల్చున్నాడు– చూపు దూరంగా సారించాడు– తాటి పెండి అవతల మసగమసగ్గా ఓ మానవాకారం వెళ్తోంది. పరీక్షగా చూస్తే అది ఓ స్త్రీలా కన్పించిందతనికి.

ఇంత రాత్రపుడు అతనికి అటువైపు స్త్రీలు నడిచే అవసరం కన్పించ లేదు–

అనుకోకుండా అతని అడుగులు ముందుకు పడ్డాయి– ఆ ఆకారం వూరి వెలుపల బావి వైపు వెళ్తోంది– అప్పుడర్థమైం దతనికి– అంతే! "ఎవరదీ" అని కేక వేశాడు– అది కేక కాదు– చుట్టుపక్కల గుడిసెల్లోని రైతులు బయటకు తొంగి చూసే అరుపది.

ఆ ఆకారం మాత్రం ఆగలేదు. పైగా నడకలో వేగం హెచ్చించింది.

సత్యానికి తన అనుమానం ధృవపడింది. తన అడుగులూ ముంధుకు పడ్డాయి. ఆమెను వెంబడించాయి–

కొద్ది క్షణాలలో ఆమెను బావి దగ్గర ఒడుపుగా పట్టుకున్నాడు– ఆమె ఆత్మ హత్యా ప్రయత్నంలో వుందని అతనికి అర్థ మైంది–

"ఎవరమ్మాయివి? ఏం పనిది?" అడిగాడామెను– వెక్కి వెక్కి ఏడ్వడం తప్ప ఏం చెప్పలేదామె–

ఈలోగా పది మందీ కూడేరక్కడ–

ఆమెను అనసూయమ్మ కూతురుగా గుర్తించారు. అనసూయమ్మ బుచ్చిశెట్టి గారింట్లో వంట పని చేస్తుంది– ఆమెకు రెండుపూటలా భోజనం, కాఫీ, టిఫిన్లూ వారింటే– ప్రతి సంవత్సరం చీర పెడతారు–

అనసూయమ్మకు ఒక్కగా నొక్క కూతురు పద్మ– చిన్నతనంలోనే తండ్రి పోతే తల్లీదండ్రీ తానే అయి ఆ పిల్లను పెంచు కొస్తోంది. ఆ అమ్మాయికి ఎనిమిదో తరగతి వరకూ చదువు చెప్పించింది. ఆ తర్వాత చదవనంటే వూరుకుని యింట్లో కూర్చో బెట్టింది.

పద్మకి సినిమాలన్నా, సీరియల్ నవలలన్నా విపరీతమైన పిచ్చి– వారానికో సినీమా అయినా చూడకపోతే ఆమె కేదోలా వుండేది. కొత్త సినిమా వచ్చిందంటే చాలు మొదటి రోజున ఏదో ఒక ఆటకి వెళ్ళిపోవలసిందే. దానికోసం ఎంతటి రాద్ధాంతమైనా చేసేది. ఒకవేళ తల్లి కాదంటే ఏడ్చి రాగాలు పెట్టయినాసరే సాధించేది– తోడుకోసం ఎప్పుడూ ఎవరో ఒకర్ని గాలమేసి వుంచేది. ఆమె కందరూ స్నేహితులే– పదో తరగతి పాసైన పంతులు గారమ్మాయి మొదలు పాచి పని చేసుకు బతికే అప్పాయమ్మ కూతురు వరకూ ఆమె అందరితోనూ ఒకే విధంగా వుండేది– ఆ స్నేహాన్ని తన అవసరానికి వాడుకునేది.

ఎలాపడిందో గాని, చదువు మానేసిన దగ్గర్నించీ ఆమె దృష్టి నవలల మీద బాగానే పడింది. తీరిక దొరికితే చాలు ఎప్పుడూ ఏదో ఒక పుస్తకం చదువుతూనే వుండేది. అక్కడ పంతులు గారింట్లో వారపత్రికలు తెప్పించేవారు. ఏ పత్రిక ఎప్పుడొస్తుందో పద్మకి బాగా తెల్సు– ఆ నాటికి వాళ్ళింటి కెళ్ళి ఆ కబురూ యీ కబురూ చెప్పి కొత్త పుస్తకంలోని సీరియల్స్ చదివేసేది. అయితే సినీమాల్లో నయినా పుస్తకాల్లో నయినా ఆమె నాకర్షించేవి ప్రేమ కథలే. అందులోని నాయికా నాయకులను అందంగా వూహించుకునేది– వారితో తనను పోల్చుకునేది– ఒక్కోప్పుడు వాటిల్లోని నాయికలా వుండాలని షోగ్గా అలంకరించు కునేది– కానీ ఆ అలంకరణ సామగ్రి అంతా యింట్లో వుండేది కాదు. వాటికోసం మళ్ళీ తల్లి దగ్గర పేచీ పెట్టేది. కొన్ని కాకపోతే కొన్నయినా కొనిపించు కునేది.

ఏదేమైనా పద్మకు "అమాయకురాల"నే మంచి పేరుంది. అటువంటి అమాయకురాలు యిలా ఆత్మహత్యా ప్రయత్నానికి పాలుబడ్డం చాలా మందిని ఆశ్చర్య పరచింది.

సత్యం ఆ అమ్మాయిని తన యింటికి తీసుకొచ్చాక, కూర్చోబెట్టి అసలు సంగతేమిటని అడిగాడు– కొంతసేపటి వరకూ ఏడుపే తప్ప మరో సమాధానం చెప్పలేదామె.

తర్వాత అక్కడ చేరిన నలుగురూ నాలుగు విధాలా నచ్చ జెప్పి ఓదార్చిన మీదట అసలు సంగతిని బయట పెట్టింది–

అది విని అంతా ఆశ్చర్యంతో ముక్కులమీద వేళ్ళేసు కున్నారు– అదెలా సంభవించి వుంటుందో ఎవరిమట్టుకు వారు వూహాగానాలు చేయడం మొదలు పెట్టారు– ఏవిధంగా సంభవించినా జరక్కూడనిదే జరిగి పోయింది. బుచ్చిశెట్టి బావమరిది అయిన ప్రతాప్ తన ప్రతాపాన్ని చూపించి పద్మను గర్భిణీ స్త్రీగా మార్చేశాడు– ఆ తర్వాత తనకేం పట్టనట్టు పలాయనం చిత్తగించేడు.

తల్లికోసం అప్పుడప్పుడు బుచ్చిశెట్టి యింటికి వెళ్తూండేది పద్మ– ఫేస్ పౌడరు కోసమో, కొత్తరకం బొట్టు కోసమో, పుస్తకం కోసమో చిన్నా చితకా పన్లు చేసి పెట్టేది–

బుచ్చిశెట్టిగారి బావమరిది ప్రతాప్ సంవత్సరంలో సగం అక్కడనే వుండేవాడు– అతను ఎన్నో రకాల సినీమా పత్రికలను కొనేవాడు– సాంఘిక, పౌరాణిక, జానపద సినీమాల్తో పాటు బ్లూ (బూతు) సినీమాల్ని కూడ స్నేహితులతో పాటు చూసేవాడు– పట్నవాసపు పతి(త)వ్రతుల పేర్లన్నీ కూడ అతనికి కంఠస్థమే– అతనికి పద్మ తను చూసిన సినీమాల్లోని హీరోయిన్‌లా కాకపోయినా సైడ్ హీరోయిన్ చెల్లిల్లా కన్పించింది– అంచేత సినీమా పుస్తకాలు యిచ్చి; బొమ్మలు చూపించీ; గాలం వేశాడు– మచ్చిక చేసుకున్నాడు– ఆ తర్వాత పద్మకున్న సినిమా పిచ్చిని గమనించి కుర్ర వయసువాళ్ళని రెచ్చగొట్టే తెలుగు కమర్షియల్ పిక్చర్స్‌ని చాటు మాటుగా చూపించేవాడు– పద్మకి ప్రతాప్‌తో కల్సి సినీమా చూస్తుంటే స్వర్గ లోకంలో విహరిస్తున్న ట్టుండేది– ఒక ప్రక్క ఎవరైనా తమని చూస్తారన్న భయమున్నప్పటికీ– మెత్తని కుషన్ చైర్లో కూర్చో పెట్టేవాడు– మెత్త మెత్తని కబుర్లు చెప్పేవాడు– విరామ సమయంలో డ్రింకు లిప్పించేవాడు– తనకు అంతవరకూ తెలీని సుఖాల్ని రుచి చూపించేవాడు–




అలా మచ్చిక చేసుకున్నాడు.

అనువు చూసి ఆమెను వశపరచు కొన్నాడు– అయితే.... అన్ని జాగ్రత్తలూ పడ్డా పరిస్థితి ఒకానొక సమయంలో చెయ్యి జారి పోయింది. విషయం తెల్సి, "నీకూ నాకూ ఏం సంబంధం లేదు. నువ్వె వరితో తిరిగావో నాకేం తెల్సు" అని తప్పించుకున్నాడు. ఆ రోజే మకాం మార్చేశాడు. (ఇంకాఉంది)




### ఎన్. ఆర్. నాసిక్

★ పాఠకుల ప్రశ్నలకు సమాధానాలిచ్చే ఓపికా, కుతూహలం తన స్వంత బిడ్డలు అడిగిన ప్రశ్నలకు ఉండదెందుకు?

● ఎవరన్నారలా? పిల్లలు వేసే తప్పటడుగులు, మాట్లాడే వింత భాషా, చేసే అల్లరి పనులూ చూస్తూ గడపడం కోసం నేను నాలుగైదేళ్ళు రచనకి ఫుల్‌స్టాప్ పెట్టా! తరువాత కూడా రాస్తూ రాస్తూ ఎక్కడంటే అక్కడ ఆపి పిల్లల్ని ముద్దు చేసి చంపేదాన్ని! (అని ఇప్పటికీ చెప్పుకుంటున్నారు నా పిల్లలు- పెళ్ళిళ్ళయి అత్తవారిళ్ళకెళ్ళినా కూడా) ప్రస్తుతానికి రాస్తూ రాస్తూ ఆగి- నా మనవల్ని ప్రశ్న వేసి నేనే వేధిస్తున్నానేమో యిప్పుడు విసుగెత్తి 'నువ్వు రాయి' అంటూ కోప్పడతాడు మా శీను. మిగతా వాళ్ళు సరేసరి...! మా ఆటలు మమ్మల్ని ఆడుకోనీ అమ్మమ్మా' అంటూ కోప్పడుతారు. మీకింకా అనుమానమేనా?

### ఎన్. ఎస్. బాపట్ల

★ మీరు యింత ఈజీగా తడుముకోకుండా చక్కటి సమాధానాలు ఎలా యిస్తున్నారు?

● స్వతహాగా కాస్త వాగుడెక్కువ. మా వారు ఊ అనేటప్పటికే నేను ఓ డజను మాటలు వాగేస్తాను. పైగా మనసులో మాట చెప్పకపోతే- తోచి చావదు!

★ ఒక స్త్రీ ప్రధానమంత్రిగా వుండి శాశ్వతంగా గుర్తు వుండేటట్లు స్త్రీలకు చేసిందేం లేదు. అంతకంటే, సినిమా నటుడన్న క్రేజ్ పక్కకు పెడితే మన ముఖ్యమంత్రే మేలనిపిస్తూంది. మీరేమంటారు?

● ఏమిటీ! ఆడబడుచుల ఆ క్రందనలకు కరిగి అన్న కరుణించేసి యిచ్చేసిన వాగ్దానాలన్నీ జ్ఞాపకం వచ్చి రాశారా ఏం పై మాటలు? రాజకీయం ఒక చదరంగం. ఎత్తుకు పై ఎత్తులు వేస్తూ జిత్తులని స్ట్రేటజీగా మారుస్తూ- ప్రజల దృష్టిలో నిలబడి వుండి- ఎన్నికల నుండి ఎన్నికల వరకు బ్రతికి బట్ట కట్టడానికే రాజకీయవేత్తలు- వేసే వేషాలు. చేసే బాసలు, చూపే కరుణా కటాక్షాలు. నాకేమనిపిస్తోందో తెలుసా? ప్రజలకి- ఏ రాయి యిస్తేనేం పళ్ళూడకొట్టుకుందుకు? అని!

### ఎం. ఎ. కె. సికింద్రాబాదు

★ అనుమానపుటూహలకి అంతం ఉండదా?

● ఎందుకుండదు కుమార్‌గారూ, ఊహల్లో అనుమానాలు గబ్బిలాల మధ్య పక్షుల్లాంటివే. చిరు వెల్గు రాగానే ఎగిరిపోతూ వుంటాయి. అంచేత వాటిని గురించి బెంగపడడం దండగ.

### ఎం. ఎస్. ఎన్. అన్నవరం.

★ వరకట్నం చావులకి కారణం అత్తలేనంటాను. మీరేమంటారు?

● పిల్ల తల్లి దండ్రులది అంటాను. కట్నం యిచ్చేనా తమ ఆడ కూతుళ్ళకి పెళ్ళి చేసి తీరాలా? వారినీ కొడుకుల్లాగానే ఎందుకు పెంచలేరు?! చేవ చచ్చిన యువతరం కూడా పెళ్ళిని డబ్బుతో ముడి పెట్టడానికి కారణం అంటాను ఆర్థికంగా తల్లి దండ్రులపై ఆధారపడే యువతీ యువకుల పెళ్ళికి తొందరపడడంతో వస్తున్నాయి చిక్కులు.

★ కులాంతర వివాహంపై మీ అభిప్రాయం?

● నాకేం అభ్యంతరం? వాళ్ళు యిష్టపడి చేసుకుంటూంటే? కాని నా అభ్యంతరం ఒక్కటే- పిల్లలు కల్గి వాళ్ళు పెద్ద వాళ్ళయ్యాక వీళ్ళది నా కులం అంటే నా కులం అని తల్లిదండ్రులు పోట్లాడుకోవడం. కులాంతర వివాహం చేసుకోడంతోనే- కులానికి స్వస్తి చెప్పాలి. మళ్ళీ పిల్లల దాకా వచ్చేసరికి వీరిలో నే కులం తలెత్తితే ఎలా?

★ మనిషికీ మనీషికీ కల తేడా?

● మనిషి మానవత్వానికి మనీషి మేధస్సంపదకి ప్రతీకలు.

### డి. జె. ఆర్. హైదరాబాదు

★ మీరు పక్కా కన్సర్వేటివ్ అని విన్నాను. నిజమేనా?

● బాధ్యతలూ, అనుభవాలూ మనలో చాలా మందిని కన్సర్వేటివ్స్‌గా మారుస్తాయి. · నా లిమిటేషన్స్ నాకున్నాయి!!

### సిహెచ్. ఎన్. ఆర్. సత్తెనపల్లి

★ నేడిద్దరు నాయకులు ఇద్దరాడు వారు తిట్టుకొన్న రీతిలో ఆరోపణలు చేసుకొన్నారు. ఇది ఎంతటి హీనం?

● ఏది? ఆడవాళ్ళలా మగాళ్ళు తిట్టుకోడమా? ఆడాళ్ళలా నాయకులు తిట్టుకోడమా? ఆడాళ్ళే తిట్టుకుంటారని నమ్మేంత అమాయకులా మీరు?

★ రేడియో, టి.వి. చదువుకునే విద్యార్థులకెంత లాభ నష్టాలు కల్గిస్తున్నాయి?

● పిల్లలు చూడదగ్గవి విన తగ్గవి వింటే, బాధ లేదు. కాని ప్రకటనలో చూపుతున్న చెడు అలవాట్లు చాక్లెట్లు నాకడం, కన్ను కొట్టడం- ఏమైతే తప్పని తల్లులు పోరుతారో అవన్నీ చూడడం వల్ల వస్తూంది యిబ్బంది... అయినా ఆపడం మన చేతిలో వున్నప్పుడు టి.వి, రేడియోల గురించి బెంగ పడడం అనవసరం.

### ఎ. వి. వి. కె. ఆర్. ఖమ్మం

★ 'మైట్ ఈజ్ రైట్' అని చరిత్ర మనకి నేర్పుతూ వస్తున్న పాఠం కాదనకలరా?

● నిజమే. కాని దాన్నే నమ్మి తీరాలని కూడా చెప్పలేదు. 'రైట్ యీజ్ మైట్' అని తిప్పి చెప్పవలసిన బాధ్యత వర్తమానపు చరిత్ర కావాలనే కదా మేధావులు కోరేది?

### ఎన్. కె. ఆర్. – పర్లాకిమిడి

★ విమర్శ సహృదయంతో అర్థం చేసుకుని స్వీకరించే రచయిత లున్నారా?

● ఎందుకు లేరు. చాలా మంది వున్నారు. కాని తమ తమ వూహలకు తగినట్టు రచనలు చదివి- అవి అలా లేవంటూ ఆడిపోసుకునే విమర్శకులూ ఎక్కువ మందే వున్నారు. విమర్శకుడు –రచనను అంచనా కట్టాలి గాని రచయితను కాదని కొందరంటారు. అదెలా? రచయిత వ్యక్తిగతం గాని రచన వుండడం అసాధ్యం కనుక – అతగాని గుణగణాలు కుళ్ళు కుచ్చితాలు కూడా విమర్శకు చాలా అవసరం అని– కొందరంటారు..... నా దృష్టిలో రచయిత నడుం విరక్కొట్టడం విమర్శకాదు. హెచ్చరించడం విమర్శ. □



రకరకాల పూలను చేర్చి గుచ్చితే
అందాల గుచ్ఛమయింది!
అంద, చందాల సినీ వన్నెలను ఏర్చి,
కూర్చితే "సినిమారంజని" అయింది!!
వారం, వారం ఆ అందాలను మీరు
ఆస్వాదిస్తున్నారా?

నవ చలనచిత్ర వారపత్రిక

# సినిమా రంజని



ఆంధ్రపత్రిక సంస్థ నుంచి
మరో ఆణిముత్యం!!

Silpa

# ఆ గుండెల తపన

## "హిమసాగరి"

జోరున కురుస్తుంది వర్షం. దాన్ని ఎడాపెడా చెదరగొట్టేస్తోంది 'ఝూం'మని వీస్తున్న గాలి. తుఫాను మొదలై ఆ రోజుకు అది రెండవ రోజు. అందంగా అలంకరించుకొన్న కన్నెపిల్ల నిరంకుశత్వంగా రేప్ చేయబడినట్లుంది ప్రస్తుతం ఆ ఊరి పరిస్థితి. ఇళ్ళు కూలిపోయాయి. చెట్లు మొదళ్ళు పైకి లేచాయి. పల్లపు ప్రదేశాల్లోని ఇళ్ళు నీటిలో మునిగి కప్పులు మాత్రం కనిపిస్తున్నాయి. ఇళ్ళలోని వస్తువులు నీళ్ళ పైకి తేలి నీటిలో కొట్టుకుపోతున్నాయి. ముందు రోజే అందిన మేరకు సామాను పట్టుకొని మిద్దె ఇళ్ల పంచలలో చేరి భయంగా వొదిగి కూర్చుని ఉన్నారు పూరిళ్లలోని బీదా బిక్కీ.

అది ఊరికి దగ్గరలో ఉన్న మిట్ట ప్రదేశం. పక్క పక్కనే అక్కడ మూడిళ్ళున్నాయి. ఒక ఇంట్లో రంగయ్య, అతని భార్య. రెండవ ఇంట్లో నరసయ్య, అతని భార్య. చివరి ఇంట్లో వీళ్ల తల్లి సాయమ్మ మూడవ కొడుకు సాంబయ్యతో ఉంది. తుఫాను మొదలైనప్పటి నుండి ఎవరి ఇంట్లోనూ పొయ్యి రాజెయ్యలేదు. భయం వాళ్లకి ఆకలి లేకుండా చేసింది.

"నాయనా! సాంబా" మంచం మీద ఒళ్లంతా దుప్పటి కప్పుకొని చలికి వణుకుతున్న సాయమ్మ నెమ్మదిగా పిలిచింది.

పక్కనే గోనె పట్టామీద కూర్చుని ఉన్న పదేళ్ల సాంబయ్య "ఏందే అమ్మా ఈడనే ఉండా" అన్నాడు వణుకుతూ

"కూడు"

"కూడు గావాల్నా అమ్మా"

"నాక్కాదురా. నీకేరా నాయనా అడ అటకమీన గంజి నూకలున్నాయి. కాసుకొని తాగరా".

"ఎట్టా కాసుకొనేది కింద కట్టె పుల్లలు తడిసిపోయినయి. కిరసనాయిలు లేదు. గంజెట్టా కాసేది".

"ఒరే సాంబా! ఇంక నేను బతకన్రా. సలి నోట్లో నుంచి కడుపులోకి దూరింది. ఈ తుఫాను అయ్యే టప్పటికి నాను సచ్చేరుకొంటా. నీ గతే" అంది కళ్ల నీళ్లు పెట్టుకొంటూ.

"అమ్మా అట్టాగనకే" పెద్దగా ఏడ్చాడు సాంబయ్య.

"అనకేం సేసేదిరా. పోయిన తుఫానుకే పోవాల్సింది. ఎట్టో బతికినా ఈసారికి నేనుండను. లోకం తెలియనోడివి ఎట్టా బతకతవో" కుళ్లి కుళ్లి ఏడ్చింది అరవై ఏళ్ల సాయమ్మ.

"నువ్వు సచ్చిపోతే, నానూ సచ్చిపోతానే" పెద్దగా ఏడ్చాడు సాంబయ్య తల్లిని పట్టుకొని.

"నాయనా అట్లాంటి మాటన కురా" ఎండిపోయిన పుల్లలాంటి చేతిని పైకెత్తి కొడుకు కళ్ళు తుడిచింది.

'బొయ్'మంటూ ఓ పెద్ద గాలి ఆ ఇంటిని ఊపేసింది.

"అమ్మా బయంగా ఉందే"

"బఘపడకు నాయినా. నీ అన్నలుండరు గదా"

"అన్నలెవ్వరూ రాలేదే" అన్నాడు సాంబయ్య నీరసంగా.

"అట్టాగా" మూలిగింది సాయమ్మ

అంతసేపు సాయమ్మ మాట్లాడడమే గొప్ప విషయం.

"నాయినా అట్టా సూరు కిందనే బోయి నీ అన్నల్ని ఏలస్తావా"

"ఎట్టా బొయ్యేదే"

"ఎట్టాగయినా బోయిరా. నాలుగు సంగతులు సెప్పి నే కన్ను మూస్తా".

సాంబయ్య కడుపు బిగపట్టి మెల్లగా బయటి కొచ్చేందుకు పైకి లేచాడు. చెక్క తలుపుకు అదిమిపెట్టి వున్న పీట లాగాడు.

'బొయ్'మని ఈదురు గాలి సాంబయ్యను ఇంట్లోకి విసరికొట్టింది. ఇంటి మధ్యకు వచ్చి పడింది వర్షపు జల్లు. 'అమ్మో' అంటూ దుప్పటి పూర్తిగా కప్పుకొంది సాయమ్మ వణకిపోతూ.

సాంబయ్య అతి కష్టంమీద చెక్క తలుపును అదిమి పెట్టి పీట దాని కానించాడు. తరువాత కొద్దిసేపు తమాయించుకొని నెత్తిన గోనె కప్పుకొన్నాడు. చూరులోంచి బయటకు చూసాడు. వర్షం, గాలి భయంకరంగా ఉంది వాతావరణం. కొద్దిసేపు ఓపిక పట్టాడు. గాలి వేగం తగ్గినట్లు అనిపించగానే చప్పున తలుపులు తీసి బయటకు వచ్చి బయట గొళ్లెం పెట్టాడు.

తలుపు దబదబమని శబ్దమయ్యేసరికి "ఎవరదీ" అన్నాడు సాయమ్మ పెద్దకొడుకు తలుపును ఈదురుగాలి అదే పనిగా నెట్టేస్తుంటే తలుపుకు దగ్గరలో మంచం వేసుకొని కూర్చుని దానికి వీపు ఆనించి ఉన్నాడు

"నేను సాంబడ్ని" పెద్దగా అరిచాడు బయట నుంచి సాంబయ్య.

"ఏందిరా ఇట్లా వచ్చినవు" తలుపు తీయకుండానే అరిచాడు రంగయ్య.

"నూకలు కావాలేమో. ఏడుండయి లేవని చెప్పు అంది అతని భార్య.

"అన్నా! శానా సంగతులు చెప్పాల నీతో తలుపు తియ్యి" మళ్లీ అరిచాడు.

ఇక రంగయ్యకు తలుపు తీయక తప్పలేదు. సాంబయ్య లోపలికి రాగానే మళ్లీ తలుపు దగ్గరకేసి మంచం దానికి ఆనించాడు.

సాంబయ్య చొక్కా, నిక్కరు తడిసి గజగజ వణుకుతున్నాడు. నెత్తిమీద జుట్టులోంచి నీళ్లు బొట్లు బొట్లుగా కారుతున్నాయి.

"అన్నా ... అమ్మ .. సచ్చిపోయేట్టుంది. మితో ఒకమాట సెప్పాలంట రమ్మంది."

"ఆ .. " అన్నాడు రంగయ్య భయంగా

"అవునన్నా! నోట మాట సరిగ్గా రావడం లేదు. తొందరగా నువ్వు అమ్మ దగ్గరకి ఎల్లన్నా. నేను చిన్నన్నని పిలుస్తాను." అంటూ బయటకు వచ్చాడు

రంగయ్య భార్య నిలువునా నీలుక్కుపోయింది. సాయమ్మత్త రెండేళ్ల క్రిందట తుఫాన్లో సచ్చిపోవాల్సింది. సచ్చిపోలా. ఈ తుపాన్లో కచ్చితంగా సచ్చిపోద్ది. అంటే ... 'అమ్మో ఎంతన్యాయం' అనుకొంది ఇదే ఆలోచన వచ్చింది రంగయ్యకు కూడా. వాళ్లకు గతం కళ్ల ముందు కదలాడింది.

* * * * * * *

రెండేళ్ల క్రిందట కూడా సాయమ్మ ఇలాంటి విషమ పరిస్థితినే ఎదుర్కొంది. అపుడు సాయమ్మ తన ముగ్గురు కొడుకులు, ఇద్దరు కోడళ్లతో ఉమ్మడి కుటుంబంగా జీవిస్తోంది. ఏటా తుఫాన్లు రావడం, చెరువులు తెగడం మామూలై కూర్చొంది. ఆ రోజు కురుస్తున్న భారీ వర్షానికి అందరూ ఒక చోట కూర్చుని మాట్లాడుకొంటున్నారు.

ఆ రాత్రి సాయమ్మ ఆయాసం ఎక్కువై మూలుగుతూ చావు బతుకుల్లో ఉంది అప్పుడు అందరూ తలా ఒక మంచం మిద కూర్చుని సాయమ్మ పరిస్థితికి విచారిస్తున్నారు.

సాయమ్మ మూలుగుతూ "అమ్మో సచ్చి పోతున్నాను నేనింక బతకను. హ్హ ... హు ..." అంటోంది మాట్లాడుతుంటే ఆయాసం ఎగదన్ను కొని వస్తోంది

రాత్రి పదయింది. సాయమ్మ పరిస్థితి మరీ క్షీణించింది ఆమె గొంతులోంచి గురగుర తప్ప మరేమి మాటలు రావటం లేదు. ఆకలిక ఉండలేక ఇంట్లో ఉన్న బియ్యం వండుకొని తలా కొద్దిగా తిన్నామనిపించారు. ఆ తుఫానులో రోజుకు ఒక్క పూటే భోజనం ... అదీ పచ్చడి మెతుకులు.

సాయమ్మ చిన్న కొడుకు సాంబయ్య మాత్రం అన్నం ముట్టుకోలేదు. అన్నలు, వదినలు బ్రతిమాలినా వినకుండా ఏడుస్తూ తల్లి దగ్గరే కూర్చుని ఉన్నాడు

రాత్రి సరిగ్గాపన్నెండు గంటల సమయంలో ఎవరో పెద్దగా తలుపు తట్టగా సాయమ్మ పెద్ద కొడుకు వెళ్లి తలుపు తీశాడు ఎదురుగా నరసరాజు తడిసిన పంచె అంచుల్ని వాకట్లో పెండి లోపలికి వచ్చాడు వణుకుతూ

"ఏంది నరసరాజుగోరో ఇట్టా వచ్చిను".

"మీ యమ్మకు ఎట్టుందో కనుక్కుపోదామని".

"ఏం చెప్పేది రాజుగోరో మా సంగతి. మా అమ్మ బతికేట్టులేదు". ముగ్గురు కొడుకులూ ఏడ్చారు. దాంతో పాటు ఇద్దరు కోడళ్ళూ.

"ముందే ఉబ్బసం జబ్బు మనిషి. ఎట్ల బతకతది".

"అదే మాకు భయంగా ఉంది. ఇప్పుడేటి సెయ్యాల 'ఈ'వానల్లో ఎవుడు వైద్దెం సేత్తాడు మా అమ్మకు" బెంగపడ్డారు అన్నదమ్ములిద్దరూ. సాంబయ్య తల్లి కాళ్ల దగ్గర కూర్చుని తూగుతున్నాడు.

"ఏమి సేయిత్తరు వైద్దిగం. ఎంత కాలమని సేయిత్తరు. ఎన్ని పైసలు కర్చు పెట్టిన్రో. నానెరుగనా"

"నిజం సెప్పినవు మావా. ఏం సేత్తాం కన్నతల్లి గద మరి"

"కన్నతల్లయినా మరెవురయినా నూకలు సెల్లిపోతే పానం ఎల్లిపోతదిరా"

"అంతే"

"అదే నే జెప్పేది. ఇంక నీయమ్మ ఎక్కువసేపు బతకదు. మహా బతికితే ఇంకో గెంటో. రెండు గెంటలో"

"ఒరి నాయనో"

"ఏం బయపడమాక. ఈ సంగతిన్నా' తుపాన్లో ఎవురన్నా సచ్చిపోతే ఆళ్ల రక్త సంబంధీకులకి రెండు వేలు డబ్బులిస్తరు"

"అంతా ఇసిత్రం" అన్నాడు సాయమ్మ చిన్న కొడుకు

"ఇసిత్రం గాదు. సింతకాయగాదు. మా సరసరాజన్న ఎప్పుడన్నా అబద్ధాలు సెప్పి ఎరుగునా" అంది అప్పటివరకు మాగన్నుగా వింటున్న పెద్ద కోడలు.

"సెబాస్ మంచి మాటన్నావు సెల్లమ్మా" మెచ్చుకొన్నాడు నరసరాజు.

"అయితే ఇప్పుడేం సెయ్యమంటవ్"

"సేసే దేం లేదు. రేప్పొద్దున్నే నా దగ్గరకి రా. మీయమ్మ సచ్చిపోయిందని సర్పంచికి సెప్తా. ఆయన గవర్నమెంటోళ్లకి సెప్తడు. ఆళ్లొచ్చి డబ్బులిస్తరు."

"అదేం అన్నాయం మావా! మనిషి సావకుండానే! బాధపడ్డాడు రంగయ్య

"సస్తదిలే బావా. సావక ఏడకిపోతది. నరసరాజన్న ఇంత ధైర్యంగా సెబుతా ఉంటే." సాయమ్మ చిన్న కోడలు అందుకొంది.

"ఒరే అబ్బాయిలూ పెద్దవాన్ని నేను సెప్పేది పూర్తిగా ఇనండి. మీ యమ్మ ఈ రాత్రికి తప్పక సచ్చిపోద్ది. సావకపోతే ..." నాలుగు పక్కలా చూసిన నరసరాజు అసలు విషయం చిన్నగా అనేసాడు.

'ఓ యమ్మో ...' సాయమ్మ ఇద్దరు కొడుకులూ గుండెలు బాదుకొన్నారు.

"సూడండమ్మా. నేను డబ్బొచ్చే ఉపాయం సెప్పినా. డబ్బు తీసికొంటరో, కాలదన్నుకొంటరో. నే వస్తా" అంటూ లేచాడు నరసరాజు.

"నువ్వుండన్నా ఆళ్లతో ఏందిగాని. మేం నచ్చజెపుతంలే ఆళ్లకి" అంటూ నరసరాజును కూర్చోబెట్టింది చిన్న కోడలు.

"ఏం మడుసులయ్యా మీరు. ఇంటి ముంగిట్లో కొచ్చిన లచ్చిమిదేవిని వదులుకొంటారా ఎవరన్నా! రోగిష్టి ముసలిదానికి సేవలు చేయలేక మేం సచ్చిపోతున్నాం. మీరు సంపాదించిందంతా వైద్దిగానికి కర్సుపెట్టి రూపాయి మిగిలిచ్చుకోలేకపోయినం. ఇంక దిస్టి బొమ్మ ఉండీ ఫ్రయోజనంలే. లేకా ప్రయోజనంలే" పెద్ద కోడలు నిష్ఠూరంగా మాట్లాడింది.

"తల్లి గదా. ఎట్టా సేత్తాం ఆ పని"

"ఎట్టా సేత్తమా. ఇట్టా" మొగుడి చెవిలో ఊదింది చిన్న కోడలు



"ఏం బయంలే పెద్దగనే సెప్పు. ఇక్కడెవురూ పరాయోళ్ళు లేరు. సాంబయ్య నిదురబోతుండడు. మన మాటలు బయటికి ఇనబడవు." పెద్ద కోడలు ధైర్యం చెప్పింది.

చిన్న కోడలు తనకు తోచిన ఉపాయం అందరికీ చెప్పింది.

అప్పుడే రాబోయే మొత్తానికి ఎవరి వాటా ఎంతో కూడా నిర్ణయం చేసుకొన్నారు. వచ్చిన రెండు వేలలో ఆఖరి కొడుకును వదిలేసి మిగతా ఇద్దరూ చెరి తొమ్మిది వందలు ఉపాయం చెప్పినందుకు నరసరాజు రెండు వందలు పంచుకోవాలి.

సాయమ్మ కొడుకులిద్దరూ కర్తవ్యం ఆలోచించ సాగారు. తనకు జన్మనిచ్చిన తల్లిని తాము అంతం చేయబోతున్నారు ఒక వైపు రక్త సంబంధం. ఇంకో వైపు డబ్బు ఆ డబ్బు మీద ఆశలు పెట్టుకొన్న తమ భార్యలు.

నరసరాజు జరగబోయే దారుణాన్ని ఊహిస్తూ వాళ్ళని ప్రోత్సహిస్తున్నాడు. వాళ్ళ భార్యలిద్ద " ఆచరణలో పెట్టమన్నట్లు కనుసైగ చేసారు.

ఇద్దరు అన్నదమ్ములు లేచారు. మంచం ద లావుపాటి దిండును చెరొక వైపు త్తే పట్టుకున్నారు చేసే పాపాన్ని ఇద్దరూ చెరి సగం పంచుకోవాలనేది వాళ్ళ ఉద్దేశ్యం. ఆ పా వల్ల వచ్చే ఫలితంలాగ.

క్రింద చాపమీద భారంగా ఊపిరి పీలుస్తూ పడి ఉంది సాయమ్మ ఆమె కాళ్ళ దగ్గర తల పెట్టుకొని



ఉన్నాడు తొమ్మిదేళ్ళ సాంబయ్య.

ఇద్దరు కొడుకులూ తల్లి తల దగ్గర అటు వైపు ఇటు వైపు కూర్చొన్నారు. వాళ్ళ భార్యలు సంజ్ఞ చేసారు. అదే వాళ్ళకు ధైర్యం. ఊపిరి బిగపట్టి దిండును నెమ్మదిగా క్రిందికి దించసాగారు. దిండు సాయమ్మ ముఖం దగ్గరకొచ్చేసింది. క్షణంలో ఆమె బలహీన ప్రాణ వాయువులు గాలిలో కలసిపోయేవే.

ఇంతలో ...

"అమ్మా" అంటూ వెర్రి కేకపెట్టాడు సాంబయ్య.

ఉత్తర క్షణంలో అన్నదమ్ముల చేతిలోని దిండు అప్రయత్నంగా అంత దూరంలో ఉన్న మంచంమీద పడిపోయింది. ఇద్దరి కాళ్ళలోనూ వణుకు. తమ్ముడు చూడలేదు కదా అనుకొన్నారు.

"ఏందిరా సాంబా .... ఏం జరిగింది" అన్నారు భయంగా.

"అమ్మ ... అమ్మ సచ్చిపోయినట్టు కల వొచ్చిందన్నా. అమ్మను ఇద్దరు రాచ్చసులు గొంతు పట్టుకొని నులమతుండిండ్రు. అమ్మ ఊపిరి ఆడక కాళ్ళ సేతులు కొట్టుకుంటుండింది అన్నా".

"ఆళ్ళిద్దరూ ఎట్టున్నర్రా?"

"ఆళ్ళు నల్లగా ఉందరు. నోట్లొంచి నెత్తురు వస్తుండాది. పెద్ద పెద్ద కోరలు."

తృప్తిపడ్డారు ఇద్దరూ వాడు చూసింది తమను కానందుకు.

"ఆళ్ళు యమభటులయ్యా సాంబయ్యా. మీ యమ్మను తీసుకుపోవడానికొచ్చిన్రు" పెద్ద కోడలు చెప్పింది.

"యాడికి"

"యమదర్మరాజు దగ్గరికి"

"అంటే ఏందొ దినా"

"అంటే ఏంలేదు. మీ యమ్మ సచ్చిపోద్దన్న మాట. ఆనక మీయమ్మ మనకు కనిపించదు."

"ఒరి దేముడో అమ్మ నేకపోతే ఎట్టాగా" వెక్కిళ్ళు పెట్టి, ఏడ్చాడు సాంబయ్య.

"సాంబయ్యా ఏడవమాకయ్యా. అమ్మ సచ్చిపోదు. లేవయ్యా. నువ్వు పడుకో" చిన్న కోడలు బుజ్జగించింది

ఎవరెంత అనునయించినా వినకుండా ఆ రాత్రంతా మేలుకొని తల్లిని చూస్తూ ఏడుస్తూనే ఉన్నాడు

అన్నలిద్దరూ తల్లిని చంపే ప్రయత్నం మానుకొన్నారు. వదినలిద్దరూ ఏం చేయలేక నిస్సహాయంగా సాంబయ్యనే కొరకొరా చూస్తూ ఉండిపోయారు. సాంబయ్య పడుకొంటే తమ పని పూర్తి చేయాలని స్మశానంలోని నక్కల్లా రాత్రంతా జాగారం చేసారు. కాని వాళ్ళ కోరిక తీరలేదు.

ఉదయానికల్లా సాయమ్మ ప్రాణాలు గట్టున పడ్డాయి. తుఫాను కూడా తగ్గిపోయి వాతావరణం తేలిగ్గా మారింది. సాయమ్మ ఆరోగ్యం కుదుట పడింది.

దాంతో సాయమ్మ, కోడళ్ళిద్దరికీ, కొడుకు లిద్దరికీ

# కలువబాల

## రచయితలకు గమనికలు

★ కవరుమీద శీర్షికపేరు పేర్కొనడం మంచిది. రచయితలు తమ పూర్తి పేరూ, చిరునామా రచన చివరకూడా స్పష్టంగా వ్రాయాలి – హామీపత్రం జతచెయ్యాలి.

★ గేయాలు తిప్పి పంపబడవు. వీటి పరిశీలనకు కూడా సుమారు ఏడు నుంచి ఎనిమిది వారాల గడువు అవసరం.

★ కథలుగాని, యితర రచనలుగాని త్రిప్పి పంపబడాలని కోరుకునే వారు – వారి స్వంత చిరునామాగల తగినన్ని **తపాలాబిళ్ల** లంటించిన కవరు పెట్టడం అవసరం.

★ రచనల గురించి పంపిన వెంటనేగాక ఎనిమిది వారాల తరువాత మాత్రమే వాటి పై నిర్ణయంకోసం ఎదురుచూడడం మంచిది. రచనల గురించి ఉత్తర ప్రత్యుత్తరాలకి తావులేదు. కాని– తప్పనిసరి పరిస్థితులలో వాటిపై వ్రాయవలసివస్తే రచయితలు – రచన పేరు – అది పంపినతేదీ, వాటి గురించి **వివరంగా తెల్పనిదే** పరిశీలించడం కష్టం.

★ మా కార్యాలయానికి రచనలు తెచ్చి ఇచ్చేవారు కూడా పై నిబంధనలన్నీ పాటించాలి. వారికి కూడా స్వంత చిరునామాగల తగినన్ని తపాలాబిళ్ళలంటించిన కవరు జత చెయ్యాలి అన్న నిబంధన వర్తిస్తుంది.

★ కార్టూన్‌లు పంపేవారుకూడా ఎనిమిది వారాలలోగా మా మీద ఉత్తరాలదాడి చెయ్యకూడదు ... ప్రతీ కార్టూన్ వెనుక పూర్తి పేరు, చిరునామా వ్రాయాలి.

★ ప్రత్యేక సందర్భాలుగా వేసిన కార్టూన్‌ల కవర్లపై ఆ విషయం వ్రాస్తే వాటి పరిశీలన త్వరితంగా జరుగుతుంది.

★ రచనల ఎంపిక తరువాత వాటి ప్రచురణ వీలువెంబడి జరుగుతుంది.

★ రచయితలకు, కార్టూనిస్టులకు [ఒక్క ఉత్తరాలు, ప్రశ్నావళి, డాక్టర్ సలహాల శీర్షికలో 'పడ్డ' వారికి తప్ప తలిమ్మా అందరికి] అవి పడ్డ "ప్రతు"లను – కాలక్రమంలో వాటి పారితోషికాలను పంపుతాము. కాపీలు టపాలో పోయే ప్రమాదం వుంటుందే తప్ప పంపకపోవడం జరుగదు. **సం॥**

# ఇ·వేమన·పద్యాలు




పడక నేర్పు భామ బంగారమాసించు
మాటలకు వలచుట మహిమ గాదె
కొరక నేర్చినదియు గోకిన చెప్పునా
విశ్వదాభిరామ వినుర వేమ

అకారణంగా శత్రువయిపోయింది. తాము తెచ్చే సంపాదనంతా అనవసరంగా తల్లి బాగోగులకు ఖర్చుపెడుతున్నామని అనుకోసాగారు కొడుకులు తాము ఈ ముసలిదానికి సేవలుచేయాల్సివచ్చిందె అని కోడళ్ళు విసుక్కోసాగారు. అయితే ముసలిదయినా సాయమ్మ ఉదయాన్నె వెళ్ళి గడ్డి కోసుకొచ్చేది. మధ్యాహ్నం ఎండతగ్గిన తరువాత అడవిలోకి వెళ్ళి కట్టెపుల్లలు ఏరుకొనివచ్చేది సాంబయ్య ఆవుల్ని తోలుకువెళ్ళి మేపుకొచ్చేవాడు

సాయమ్మ కోడళ్ళ రుసరుసలు, కొడుకుల విసుగుదల గమనించి బాధపడసాగింది ఇక వాళ్ళతో కలిసి వుండడం కష్టమనిఎంచి ఊళ్ళో నలుగురు పెద్దల్ని పిలిచి ఆస్తులు పంపకాలు పెట్టించింది కోడళ్ళు సంతోషించారు కొడుకులు ఏమీ ఎరుగనట్లు మౌనంగా ఊరుకొన్నారు పంపకాల్లో ముగ్గురు కొడుకులకు మూడెకరాలు సాయమ్మకు ఒక ఎకరం పొలం వచ్చింది సాంబయ్య చిన్నవాడు కాబట్టి తల్లితోనె వుండాలని నిర్ణయించారు ఇంటిస్థలాలు కూడా పంచుకున్నారు మూడు కుటుంబాలవారు మూడుచోట్ల ఇళ్ళు వేసుకున్నారు

ఆనాటినుంచి సాయమ్మ తమ రెండెకరాల పొలాన్ని సాగుచెయించుకొంటూ సాంబయ్య బాగోగులు చూస్తూ రోజులు నెట్టుకొస్తోంది

* * * * * * * * * * * *

ఇదీ గతంలో జరిగింది

ప్రస్తుతం విషమ పరిస్థితిలో ఉన్న తల్లి విషయం చెప్పడానికి అన్నలదగ్గరకు పరుగెత్తాడు సాంబయ్య.

సాంబయ్య అటు వెళ్ళగానె భర్తతో గట్టిగా చెప్పేసింది పెద్దకోడలు ఏమయ్యోయ్ ఎట్లాగయినా మీ అమ్మ చావడానికి ఈత్లేదు రాత్రంతా మేలుకొని కూసొని సేవలుసెయ్ ఎట్లాగయినా ఆమె బతకాల తెల్లారిందాకా కాపాడినవంటే అనక ఇబ్బందిలే. ఉదయాన్నె నేను వచ్చి కాఫీ ఇచ్చి అన్ని ఇసయాలు సూసుకొంటా అంటూ జాగ్రత్తలు సెప్పి భర్తను సాగనంపింది

'ఎలాగయినా సాయిమ్మత్త సావకూడదు దేముడా' నీ కొండకొస్తా' అంటూ కనిపించని దేవుడ్ని ప్రార్థిస్తూ ముడుపులు కట్టసాగింది

సాంబయ్య చిన్నన్న ఇంటికి వచ్చేసరికి గోడ ప్రక్కనే గోనెసంచి కప్పుకొని అటుతిరిగి ఒంటికి పోసుకొంటోంది ఆకారం

"ఎవురా మడిసి" అన్నాడు సాంబయ్య భయంగా

వెనక్కు తిరిగి చూసిన ఆ ఆకారం లేచి నిలబడి "ఏందిరా సాంబా యిట్టా వచ్చినవు అంది

"అన్న అమ్మ సలి జెరంతో వణకతా ఉండది సతో మాట్లాడాలంట పెద్దన్నతో ఇప్పుడే సెప్పొచ్చినా అన్నాడు చలికి ముడుచుకుపోతూ.

'జొంయ్'మని గాలి సుడులు తిరుగుతూ వచ్చింది.

సాంబడి నెత్తిమీద గోనె ఎగిరి ఆ చీకట్లో ఎక్కడో పడిపోయింది భయంకరమైన ఉరుము వెనుకనే మెరుపు. మెరుపుకాంతి చూస్తేక కళ్ళు మూసుకున్నాడు సాంబయ్య.

నువ్వు పోరా. ఇంట్లోజెప్పి నే వస్తా అంటూ లోపలికి వెళ్ళాడు నరసయ్య

సాంబయ్య నెత్తిమీదనుంచి ఎగిరిపోయిన గోనె సంచిని చీకట్లో వెతకలేక నెత్తిన రెండుచేతులూ పెట్టుకొని నడుస్తున్నాడు.

ఇద్దరు అన్నలకు చెప్పిన తరువాత వాడి కంటికి ఇపుడు ఒరే సాంబా పోతున్నానురా వెళ్ళి పోతున్నానురా ఒక్కసారి రారా' అని పిలుస్తోన్న తల్లి రూపం స్పష్టంగా కనిపిస్తోంది గుండెలోంచి దుఃఖం తన్నుకు వస్తోంది ఏడుస్తూ, వెక్కిళ్ళు పెడుతూ వర్షంలో తడుస్తూ పరుగెత్తినట్లు నడుస్తున్నాడు. కాళ్ళు బురదలో కూరుకు పోతున్నాయి

* * * * * * * * * *

సాయమ్మను చూడ్డానికి రాలేనని చెప్పిన పెద్దకోడలు లాగే చిన్నకోడలు కూడా ఎలాగయినా అత్తను చావకుండా చూడమని భర్తను హెచ్చరించి పంపింది. అంతో ఇంతో తిని దుప్పటి కప్పుకొని వెచ్చగా ఇంట్లో పడుకొంది గత తుపానులో సాయమ్మ చావకపోవడంవల్ల తను పెట్టుకొన్న ఆశలు ఎలా నెరవేరకపోయింది తలచుకొని దుఃఖిస్తూ ఉంది సాయమ్మ తుఫాను అయేంత వరకు చావకపోతే తను భర్తతో కొండకు వస్తానని తిరుపతి వెంకటేశ్వరస్వామికి మొక్కుకొంది

తమ భర్తలు, మరిది వెళ్ళేసరికి సాయమ్మ చచ్చిపోయి ఉంటుందని, మరుసటి రోజు ప్రభుత్వం రెండువేల రూపాయలు శాంక్షను చేసి సాంబయ్య మైనరయినందున అతని పేర ఆ మొత్తాన్ని బ్యాంకులో వేస్తారని తెలుసుంటే వాళ్ళు తమ భర్తలను బయటికి పంపేవారు కాదేమో!

ఆ యదార్థం తెలిసిన తరువాత వాళ్ళ గుండెలు తపనతో ఎలా కొట్టుకుంటాయో? □

సీరియల్

# ప్రత్యూష పవనాలు

జి. భవానీ కృష్ణమూర్తి

(గత సంచిక తరువాయి)

ఆగదు ఏ నిముషము నీ కోసము

ఆగితే సాగదు ఈ లోకము – ముందుకు సాగదు ఈ లోకము – అన్నట్టు కాలం ఎవరి కోసము ఆగదు. ఏది ఏమైనా . . తుఫాను వచ్చినా ... ఈ ప్రపంచం తల్లక్రిందులైనాసరే కాలం అలా నిరంతరం పరిభ్రమిస్తూనే ఉంటుంది.

గుంటూరు వెళ్లి మిల్లు వ్యవహారాలు చక్కబెట్టుకుని లారీలో తిరుగు ప్రయాణమయ్యాడు వేణు.

అసలే చలికాలం రాత్రిపూట ప్రయాణం. దట్టంగా మంచు కమ్ముకుని ఉంది.

హాయిగా మందు కొట్టేసి భార్య పక్కలో వెచ్చగా పడుకోవలసిన ఆ చలిలో ప్రయాణం చెయ్యవలసి వచ్చినందుకు చిరాకుపడుతూ లారీ నడుపుతున్న డ్రైవరు ఎదురుగా వస్తున్న లారీని గమనించలేదు. తీరా దగ్గరకు వచ్చేశాక ఏం చెయ్యాలో తోచక ఆ భయంలో స్టీరింగ్ వదిలేశాడు.

నిద్రతో జోగుతున్న వేణు కళ్ళు తెరిచి చూసి జరగబోయే ప్రమాదం గ్రహించేలోగానే రెండు లారీలు గాఢంగా ఒకదాన్నొకటి కౌగలించుకున్నాయి.

ఆ డ్రైవరు, వేణు, ఎదుటి లారీలోని డ్రైవరు కూడా అక్కడికక్కడే ప్రాణాలు వదిలేశారు. ఎదుటి లారీలోని క్లీనరు కుర్రాడు మాత్రం తీవ్రమైన గాయాలతో స్పృహ తప్పి పడిపోయాడు.

తెలతెలవారుతూనే ఆ వార్త తెలిసిన మాలతి కుప్పలా కూలిపోయింది.

మావగారు, అత్తగారు, తండ్రి – అలా ఒక్కొక్కరే దూరం అయిపోయినా భర్త అనురాగంలో – లాలనలో ప్రేమలో ఆ బాధని క్రమక్రమంగా మరచిపోవడానికి ప్రయత్నిస్తున్న అమె భర్త మరణవార్త విని తట్టుకోలేక పోయింది

పోస్టుమార్టం కోసం ఆస్పత్రికి తరలించబడిన వేణు శవాన్ని చూసి కుప్పలా కూలిపోయింది మాలతి.

పదేళ్లయినా నిండని ప్రహ్లాద్, పూర్తిగా జ్ఞానం అయినా తెలియని ప్రత్యూష, ప్రఫుల్ల తల్లి చుట్టు చేరి ఏడవడం మొదలుపెట్టారు

జరిగిన కథ - 15 : మాలతి, వేణుగోపాల్ హైదరాబాద్‌లో కాపురం పెడతారు మారుతీరావు ఆస్తిలో సగం కోడలికి రాయడం చూసి అత్తగారికి కోపం పెరిగిపోతుంది మాలతికి కొడుకు పుడతాడు. తీర్థయాత్రలకి వెళ్ళిన మారుతీరావు గంగలో ఆత్మత్యాగం చేసుకుంటాడు. ఆయన భార్య, కూతుళ్ళు ఆస్తి కోసం దారుణంగా ప్రవర్తిస్తారు. క్రమక్రమంగా దుర్గమ్మలో మార్పు వస్తుంది. ఆమె ఒక కూతురిని కని మరణిస్తుంది ఆడబిడ్డల మాటలను తోసివేసి మాలతి ఆ పాపను తన కూతురితో సమానంగా పెంచుకోవడం మొదలెడుతుంది. ప్రకాశరావు చనిపోతాడు

సావిత్రి, సుగుణ, సుశీలలకి టెలిగ్రాములు వెళ్లాయి. కానీ ఎవరూ రాలేదు.

ఆటో మొబైల్స్‌లో పనిచేసే వారే మాలతికి ఆప్తమిత్రులు, బంధువులు అయి ఆమెకి అండగా నిలబడి జరగవలసిన తతంగాన్ని జరిపించారు.

మాలతికి లోకం అంతా చీకటిగా – అంధకారబంధురంగా అనిపించింది. తనలోని సర్వశక్తులు భర్త వెంటబెట్టుకుని వెళ్లిపోయినట్టు నిర్జీవ ప్రతిమలా ... నిర్వికల్ప సమాధిలో ఉన్న తపస్వినిలా నిద్రాహారాలు మానేసి కొన్ని రోజులు గడిపినా పిల్లల కోసం తినక, తిరక్క తప్పలేదు. ఆటో మొబైల్స్ స్టోర్సుల నిర్వహణ, గుంటూరులోని మిల్లు యజమాన్య బాధ్యతలు తన భుజస్కంధాల మీద వేసుకోక తప్పలేదు.

చైతన్యానికి మారు పేరులా ఉండే మాలతి గంభీరమూర్తి అయింది. పిల్లల సంరక్షణ, వారి భవిష్యత్తు తన జీవిత పరమావధిగా భావిస్తూ కాలం గడుపుతోంది. ఆమె ఆశయాలకు అనుగుణంగా పిల్లలు పెరిగి పెద్దవారయ్యారు.

ప్రహ్లాద్ మెకానికల్ ఇంజనీరింగ్ పాసై తల్లి కోరిక ప్రకారం ఆటో మొబైల్స్ నిర్వహణ చేపట్టాడు.

నమ్మకస్తుడయిన మేనేజర్‌కి మిల్లు నిర్వహణ బాధ్యత అప్పగించి తల్లికి పూర్తి విశ్రాంతి చేకూర్చాడు.

ప్రహ్లాద్ ప్రేమ సంగతి గ్రహించి అతను ప్రేమించిన వత్సలతో పెళ్లి జరిపించి కూతుళ్లతో సమానంగా కోడలిని కూడా అభిమానంతో అక్కున చేర్చుకుంది.

ప్రత్యూష, ప్రఫుల్లకి పెళ్లిళ్ళు అయిపోతే ఇక తన బాధ్యతలు తీరినట్టే. కొడుకు, కోడళ్ల ఆదరణలో పుట్టబోయే మనుమలతో నిశ్చింతగా కాలక్షేపం చెయ్యొచ్చు.

పట్టుమని పదహారేళ్లయినా నిండక ముందే అత్తింట అడుగుపెట్టింది. మామగారి అత్యంత అభిమానం; భర్త అనురాగంతో ఇంచుమించుగా పదేళ్ళు పది నిముషాల్లా గడిచిపోయాయి. ఆ పదేళ్లలోని మధురస్మృతులను అనుక్షణం మననం చేసుకొంటూ వచ్చే జన్మలోనైనా ఆ అభిమానాన్ని, అనురాగాన్ని పరిపూర్ణంగా పొందగలిగే భాగ్యాన్ని ప్రసాదించమని ఆ భగవంతుణ్ణి ప్రార్థిస్తూ కాలక్షేపం చేస్తోంది.

ముగ్గురు పిల్లలు మూడు ఆణిముత్యాలు అది ఆమెకి ఎనలేని తృప్తిని, సంతోషాన్ని కలిగించే విషయం తల్లి ప్రేమానురాగాలని తను చవిచూడలేక పోయింది తన పిల్లలకి మాత్రం తల్లిగానే కాక తండ్రిగా కూడా తనే అయి వారికి ఏ లోటూ రాకుండా పెంచి పెద్దచేసి పరిపూర్ణ వ్యక్తులుగా తీర్చిదిద్దింది మాలతి. ఏ తల్లికి అయితే మాత్రం అంతకంటే ఆనందం, తృప్తి, కోరిక మరేముంటాయి?

* * * * * * * *

ఇద్దరి కళ్ల నుంచీ నీళ్ళు అవిరామంగా స్రవిస్తున్నాయి.

దుఃఖం ఆపుకోలేక వత్సల భుజమ్మీద తల ఆనించి వెక్కి వెక్కి ఏడ్చేసింది ప్రత్యూష.

"ఊరుకో మున్నీ!" తల నిమిరింది వత్సల.

"వదినా! అమ్మ అన్ని కష్టాలు పడి కూడా తల్లీతండ్రీ తనే అయి మాకు ఏ లోటు రాకుండా, ఏ కష్టం కలుగకుండా మమ్మల్ని పెంచి పెద్ద చేసింది. హాయిగా సాగుతున్న మన సంసారంలోకి రాహువులా ప్రవేశించింది ఈ మహాతల్లి. తోడబుట్టిన చెల్లెల్ని ఏ రోడ్డు వారో పారేయమని సలహా ఇచ్చిన ఈ రాక్షసిని అమ్మ మళ్ళీ ఎందుకు గుమ్మం ఎక్కనిచ్చిందో!? పైగా తీరిగ్గా కబుర్లు చెప్తోంది కూడాను!

"మున్నీ! అలా ఇరిటేట్ అయిపోకమ్మా! అసలు ఇందుకే నేను చెప్పనన్నాను. కళ్ళు తుడుచుకోండి ఇద్దరూను" అన్నాడు ప్రహ్లాద్.

"ఈ విషయాలన్నీ చిన్నికి ఎవరు చెప్పారు.?"

"ఎవరూ చెప్పలేదమ్మా. అమ్మ మధ్యాహ్నం ఆ సావిత్రమ్మని ఉతికి



# ప్రత్యూష పవనాలు

ఆరేస్తున్న సమయంలో మధ్యాహ్నం క్లాసులు లేకపోవడంతో ఇంటికి వచ్చిన చిన్ని ఆ విషయాలు అన్నీ విని, అదిగో!! అప్పటినుంచి అలా ఏడుస్తూ కూర్చుందన్నమాట!"

"పాపం! పిచ్చి పిల్ల. అత్తయ్య తన తల్లికాదు అని తెలిసి తట్టుకోలేక పోతోంది" జాలిగా అంది వత్సల.

"అసలు చిన్నీకి తెలిసిందే ఆ విషయం ఒక్కటీను. ఖాళీగా ఉన్నప్పుడల్లా అదే ఎక్కువగా టేపు రికార్డరు ఉపయోగిస్తూ ఉంటుంది. ఈ కాసెట్ దాని కళ్లపడితే ప్రమాదం అనే లాకర్‌లో పెట్టి తాళం వేశాను. ఎందుకేనా మంచిది మళ్ళీ లోపల పెట్టి తాళం వేసేయమ్మా".

"అలాగే అన్నయ్యా. ఈ విషయాలన్నీ తెలిసేనా ఇందాకా ఆవిడతో అలా హాస్యాలాడావు?"

ప్రహ్లాద్ నవ్వి, "ఇదంతా తెలిసి మనూ చాలా బాధపడ్డాడమ్మా. ఛస్తానని బెదరించి అమ్మ కాళ్ల మీద పడమని తల్లిదండ్రుల్ని పంపించాడు. వీళ్ళు ఇవాళ వస్తున్నారని నాకు ముందే ఉత్తరం రాశాడు. అందుకే ఉదయం పదిగంటల దాకా ఇంట్లోనే ఉన్నాను. అప్పటిదాకా రాకపోతే ఇంక ఈవేల్టికి రారేమో అనుకొని బయటికి వెళ్లాను. ఎవరైనా వస్తే నాకు ఫోను చేయమని మల్లికి చెప్తే అది నాకు చేతకాదని తెల్లమొహం వేసింది. టేపురికార్డరు ఎలా ఆన్ చేయాలో దానికి చెప్పి మరీ వెళ్లాను. గుర్తుంచుకుని అమ్మ, ఆవిడ మాట్లాడుకోవడం మొదలు పెట్టగానే ఆన్ చేసింది. చాకిరేవు పెట్టినట్లు జాడించిపారేసింది అమ్మ. దెబ్బకి అదిరిపోయి గత్యంతరంలేక అమ్మ కాళ్ళు పట్టేసుకున్నారు ఇద్దరూను.

నోటితో మాట్లాడుతూ నొసలుతో వెక్కిరించినట్లు నవ్వుతూనే మాటలతో వారి ముఖాలు మాడ్చేశాను నేను. పశ్చాత్తాపపడుతున్న వాళ్లని ఇంతకంటే ఏమంటాం? రేపు వాడు వస్తున్నాడు. నిన్ను అడ్డం పెట్టుకుని వాడు నాటకం ఆడుతున్నాడు. ఒక విధంగా చెప్పాలంటే అది నాటకం కాదు నిజమే. నీకు కూడా మనస్ఫూర్తిగా ఇష్టం అయితే వాడు నిన్ను పెళ్లి చేసుకోవాలని బాగా పట్టుదలగా ఉన్నాడు అమ్మ ఒప్పుకుంటుందో లేదోననే భయం తప్ప నాకూ పెద్దగా అభ్యంతరం ఏమీ కనిపించడంలేదు. బంధుత్వం జోలికి పోకుండా ఉంటే నా మిత్రునిగా నిన్ను అతనికిచ్చి పెళ్లి చేయడానికి చాలా సంతోషిస్తాను. నువ్వు కాకపోయినా మరే అమ్మాయి అయినాసరే వాడిని పెళ్లి చేసుకున్న అమ్మాయి తప్పకుండా సుఖపడుతుంది. ఏమ్మా! వాడు అంటే నీకిష్టమేనా?" చెల్లెలి అభిప్రాయం తెలుసుకోవాలని అడిగాడు.

సిగ్గుతో తల దించుకుంది ప్రత్యూష.




"ఫరవాలేదు నేను, వదినేగా ఇక్కడ ఉంట. మా దగ్గర సిగ్గేమిటమ్మా?"

"బాగుందండీ. పెళ్లి మాట తలపెడితే ఆడపిల్ల సిగ్గుపడక ఎగిరి గంతులేస్తుందా?" చిలిపిగా నవ్వింది వత్సల.

"అదేం కాదులే. అవన్నీ నాకేం తెలుస్తాయి? మీరిద్దరు, అమ్మ ఆలోచించుకుని ఎలా మంచిదనిపిస్తే అలా చెయ్యండి. ఎలా చేసినా నాకు సంతోషమే. నా స్నేహితుడు ... నా స్నేహితుడని కూర్చుని అమ్మ మనసు మాత్రం నొప్పించకు. అంతే నేను చెప్పేది" అంది ప్రత్యూష.

"ఆ విషయం నాకు తెలియదేమిటమ్మా!" నవ్వాడు ప్రహ్లాద్.

"నీకు తెలియదని కాదురా నా ఆరాటం నాది. సరేగానీ నేను చెప్పిన విషయం కనుక్కున్నావా?"

"ఏదీ! ఆ ధీరజ్ గురించేనా?"

"అవున్రా. అతన్ని పిచ్చిగా నమ్మి వెంటబడి తిరుగుతోంది ఈ పిచ్చి మొద్దు. అతను మంచివాడేననుకో కాదనను. అటువంటప్పుడు ఆ రహస్యం ఎందుకు? అదేమిటే అంటే ఏవో వంకాయ కబుర్లు చెబుతుంది. ఎప్పుడేం కొంప ముంచుతుందోనని నాకు చాలా భయంగా వుంది. ముందు దాని సంగతి చూడరా నాయనా".

"నేను అన్నీ సెటిల్ చేస్తానుగా. నువ్వు అనవసరంగా గాభరాపడకమ్మా. పూర్తిగా మా ఇష్టం మీద ఆధారపడి పెళ్లి చేసుకోడానికి నువ్వింకా పసిపిల్లవి కాదు. నువ్వు కూడా తీరిగ్గా ఆలోచించుకో. రేపటి నుంచీ ఆ కష్టసుఖాలన్నీ భరించేది నువ్వు. మేము ఒడ్డున నిలబడి సలహాలిచ్చే వాళ్లమే గానీ, ఆ సంసార సాగరంలో ఈదులాడవలసింది నువ్వు. అంచేత బాగా ఆలోచించుకో" మరోసారి హెచ్చరించాడు ప్రహ్లాద్.

"అలాగే అన్నయ్యా! నిద్రొస్తోంది. ఇంక మీరు కూడా పడుకోండి" అంటూ బయటికి నడిచింది ఆవలిస్తూ.

* * * * * * * * *

స్కూటర్ లాక్ చేసి లోపలికి వెళ్లాడు ప్రహ్లాద్ ప్లాట్‌ఫారమ్ అంతా ప్రయాణీకులతో కోలాహలంగా ఉంది. అప్పుడే వచ్చి ఆగి విశ్రాంతి తీసుకుంటున్నట్లు నిలబడివున్న ట్రయినులో నుంచి జనం బిలబిల్లాడుతూ దిగుతున్నారు.

బ్రీఫ్‌కేసు చేతబట్టుకుని దిగుతున్న మనోజ్‌ని చూసి పలకరింపుగా నవ్వుతూ చెయ్యూపాడు.

గబగబా ఎదురెళ్లి కరచాలనం చేస్తూ, "ఏమిట్రా ఇలా ఉన్నావ్?" అన్నాడు అతని వాలకం చూసి తెల్లబోతూ.

గడ్డం బాగా మాసి వుంది. ప్రయాణపు బడలిక వల్ల ముఖం వాడినట్లుగా ఉంది. కళ్ళు ఎర్రగా ఉన్నాయి.

"మన నాటకంరక్తి కట్టాలంటే కాస్త నాచురాలిటీ ఉండాలి కదరా "నవ్వి", "ఇక్కడి పరిస్థితి ఎలా ఉంది?" అడిగాడు మనోజ్.

"అంతా నువ్వూహించినట్లుగానే జరుగుతోంది. కానీ, ఒరేయ్! నువ్వు తొందరపడుతున్నావేమో బాగా ఆలోచించుకో" హెచ్చరించాడు.

"అవున్రా తొందరపడుతున్నాను. తోడబుట్టిన చెల్లెల్ని ఏ రోడ్డు వారనో పారేయమని తేలికగా చెప్పిన కసాయిదాని కడుపున పుట్టినందుకు ఎంతో సిగ్గుపడుతున్నాను. ప్రఫుల్ల తన చెల్లెలని అమ్మ అందరి ముందు ఒప్పుకుని, చేసిన తప్పుకి లెంపలేసుకోవాలి. అందుకే ప్రఫుల్లనే అడ్డు పెట్టుకుని నాటకం ఆడుతున్నాను."

"ఒరేయ్!... నువ్వు చెప్పేది మున్నీ గురించి కదూ? అన్నీ తెలిసి ..."

"ఆగాగు అలా గాభరాపడకు. అసలు విషయం తెలిశాక ప్రఫుల్ల గురించి అంత నీచంగా ఆలోచిస్తానని ఎలా అనుకున్నావురా? చూస్తుండు కథ నేను నడిపిస్తానుగా".

"ఏమోరా ఏం చేస్తావో? అమ్మ మాత్రం మున్నీని నీకిచ్చి పెళ్లి చెయ్యడానికి ఇష్టపడేటట్లు లేదు" బాధగా నిట్టూర్చాడు ప్రహ్లాద్.

"పోనీలేరా. బలవంతం చేసి ఆంటీ మనసు కష్టపెట్టవద్దు. నేను నీ స్నేహితుణ్ణి. కనుక నువ్వింత వర్రీ అవుతున్నావు గానీ, మున్నీకి నాకంటే మంచివాడు, యోగ్యుడు అయిన భర్త లభిస్తాడు. తను కలకాలం సుఖంగా

ఉండాలి. అదే నేను కోరుకొనేది కూడా. కేవలం అమ్మకి కనువిప్పు కలిగించడానికి, నేను ఆంటీ ముందు ధైర్యంగా తలెత్తుకుని నిలబడగలిగే అర్హత సంపాదించు కోవడానికి మాత్రమే ఈ నాటకం ఆడుతున్నాను. ఎలా జరగాల్సింది అలా జరుగుతుంది. నువ్వేమీ వర్రీ అవకు. పద పోదాం" బ్రీఫ్‌కేస్ మరో చేతిలోకి మార్చుకున్నాడు మనోజ్.

"ముందు ఏదయినా హోటల్‌కి వెడదాం నడు. ఈ నాటకం పేరుతో నువ్వు నిజంగానే తిండీ తిప్పలు మానేశావంటే అన్యాయంగా చచ్చిపోతావు'.

"అది కాదురా ... నేచురాలిటీ ..."

"ఒరేయ్ మనూ!! పైకి కనిపించేది కనుక గడ్డం పెంచుకున్నావు. ఒ. కె! నువ్వు తిన్నావో లేదో ఎవరు చూడొచ్చారురా? శుభ్రంగా పీకలదాకా మెక్కి తిననట్లు నటించలేవా?! "

"నటించచ్చునుకో ..."

"అందుకే పద." అంటూ బలవంతంగా హోటల్లోకి లాక్కుపోయాడు ప్రహ్లాద్.

ఇద్దరూ శుభ్రంగా టిఫిన్లు తిని కాఫీలు తాగారు.

"ఇంక పదరా బావా! స్టేజి మీదకి ప్రవేశిద్దాం" అంటూ స్కూటరు వెనకసీటుమీద కూర్చున్నాడు మనోజ్.

* * * * * * * * *

"అమ్మా .. ఊ ... నీకు సీరియస్‌గా ఉందని ... టెలిగ్రామ్ ఇచ్చాడు ప్రహ్లాద్. ఏమైంది?" నిలబడలేనట్లు నీరసంగా కుర్చీలో కూలబడిపోయాడు మనోజ్.

"నా సంగతికేంగానీ, నువ్వేమిట్రా మరీ ఇంత నీరసంగా ఉన్నావ్?" కళ్ల నీళ్లు పెట్టుకుంటూ, "ఎందుకురా నన్నిలా ఏడిపిస్తావ్?" అంది సావిత్రి.

"నేను బాగానే ఉన్నానమ్మా. నువ్వు కూడా బాగానే ఉన్నావుగా. మరి వాడలా ఎందుకు టెలిగ్రామ్ ఇచ్చాడు? ఏరా ఎందుకిచ్చావ్?" కళ్లు పూర్తిగా తెరవడానికి శక్తి లేదన్నట్లుగా చూస్తూ అన్నాడు మనోజ్.

"ఎందుకా? నీ పెంకితనంతో, మొండినంతో ఆంటీని, అంకుల్‌ని ఏడిపించుకు తింటున్నావని విని స సంగతేమిటో కనుక్కోవడానికి అలా ఇచ్చాను. బాబూ! రారా నాయనా అని పిలిస్తే నువ్వొస్తావో లేదోనని అలా టెలిగ్రామ్ ఇచ్చాను మరి" అన్నాడు ప్రహ్లాద్ తప్పులేదన్నట్లుగా.

'అబ్బెబ్బె' నేను ... నేను అమ్మనీ, నాన్ననీ ఎప్పుడూ ఏమీ అనలేదు అనను కూడా. కానీ, వచ్చిన చిక్కేమిటంటే నన్ను . సారీ ... నువ్వు నిలబడే ఉన్నావు. నేను హాయిగా కూర్చున్నాను. నేనూ నిలబడదామంటే ... ఊహు ... ఓపికలేదు. కాబట్టి ముందు నువ్వు కూర్చో."

"సరే చెప్పు." మనోజ్ పక్కన కూర్చున్నాడు ప్రహ్లాద్.

హాల్లో జరిగే ఈ గందరగోళం విని ప్రత్యూష, ప్రఫుల్ల, వత్సల తమ తమ గదుల్లో నుంచి బయటికి వచ్చి సోద్యం చూస్తున్నట్లుగా ఒక పక్కగా నిలబడి చూస్తున్నారు

మాలతీదేవి అయోమయంగా చూస్తోంది.

అతని వాలకం చూసిన ఆమెకి దగ్గరకు వెళ్లి ఆప్యాయంగా పలకరించాలనే ఉంది. కానీ, ఏదో సంకోచం ఆమెని పట్టి ఆపింది.

తొందరగా చెప్పేడవరా. ఏదో చిక్కు వచ్చి పడిందన్నావ్'

"ఆఁ! అదే చెప్తున్నా. వచ్చిన చిక్కేమిటంటే, మరి నేనేమో ఇంజనీరుని కదా?"

అవునూ.... అయితే?"

'ఎదురు ప్రశ్నలు వెయ్యకు. చెప్పేది విను" ముఖం చిట్లించి, ""నన్ను ఇంజనీరింగ్ చదివించడానికి మా నాన్న బోలెడు డబ్బు ఖర్చు పెట్టాడు కదా.... ఆహ... తన సంపాదనతో కాదనుకో పాపం! మా తాతయ్య మా అమ్మకి కొంత ఆస్తి పంచి ఇచ్చాడుగా. దాన్ని మా నాన్న నామీద పెట్టుబడి పెట్టాడన్న మాట మరి ఆ పెట్టుబడి మీద ఎంతో కొంత లాభం రావాలి కదా! ప్చ్.. అమ్మా నాన్నా అలా ఆశ పడడంలో తప్పు లేదనుకో. అందుకే యాభైవేల కట్నంతో ఒక సంబంధం మాట్లాడారు. ప్చ్! పిల్లకి కాస్త మెల్ల కన్ను అనుకో.... అయినా పాపం కట్నం ఎక్కువిస్తున్నారుగా. అందుకని ఒ. కె! అనేశారు. కానీ .. ఒరేయ్! మరి నేనూ– మనిషినే కదా!..."

"ఆ అనుమానం నీకిప్పుడు ఎందుకొచ్చిందిరా?"

"హు! అనుమానం కాదురా. మాట వరసకి అంటున్నా. మనిషినే కదా! నాకు కూడా ఇష్టాలు, కోరికలు ఉంటాయి కదా?"

"అవును. అది సహజం కదా! ఇంతకీ ఏం జరిగిం దేమిటి?"

"నీ నాలిక తెగ్గొయ్య! అడ్డు ప్రశ్నలు వెయ్య వద్దని చెప్పానా లేదా?" కస్సుమన్నాడు మనోజ్

"ఒరేయ్.... ఒరేయ్.... ఆంటీ చెప్తే ఏమో అనుకున్నాను గానీ, నువ్వు నిజంగానే చాలా మారిపోయావురా. మొన్నటిదాకా నా మీద ఈగ వాలితే ఆ ఈగని చంపడానికి ప్రయత్నించే వాడివి. ఇప్పుడు.... ఇవాళ నా నాలిక తెగ్గోస్తానని గుడ్లెర్ర జేసి మరీ చెప్తున్నావు." కోపంగా అన్నాడు.

"నిజమేరా. ఇదంతా నీ మీద కోపం కాదు. నా మీద నాకే కోపం. నన్ను పుట్టించిన ఆ దేముడి మీద, నన్ను కన్న అమ్మమీద– అందరి మీద కోపం. ఇప్పుడు నువ్వు.... నన్ను రెచ్చగొట్టే సరికి నీమీద చూపించాను. సారీ బ్రదర్" బాధగా, భారంగా నిట్టూర్చి "ఎంతవరకూ వచ్చాను" అన్నాడు.

"నువ్వూ మనిషివే. నీకు సరదాలు, కోరికలు అన్నీ ఉంటాయి. ఆ తరువాత చెప్పు."

"ఊ! ఉన్నాయి కదా! ఆ కోరికల్లో ఒకటి మన ఇద్దరి స్నేహాన్ని బంధుత్వంగా మార్చుకోవాలను కోవడం, అందుకే నీ చెల్లెల్ని నేను పెళ్ళి చేసుకుంటా నన్నాను.




మరి . మా చెల్లెల్ని నీకిచ్చి పెళ్ళి చెయ్యడానికి నువ్వు ఇంతకు ముందే పెళ్ళి చేసేసు కున్నావు మరి. నా కోరిక కోసం వత్సల గారికి ఓ సవితిని తెచ్చి పెట్టడం ఏం న్యాయం చెప్పు "

బాబోయ్! ఆ మాట అనకురా బాబూ! మా ఆవిడ ఎప్పుడు చూసినా కత్తులు, కటార్ల మధ్య ఉంటుంది తాట వలిచెయ్య గలదు" భయంతో ఒక్క గెంతు గెంతాడు ప్రహ్లాద్, ఓరగా వత్సల వైపు చూస్తూ.

ముందు గాభరాపడినా, కావాలనే వాళ్ళిద్దరూ అలా మాట్లాడు తున్నారని గ్రహించిన వదినా మరదళ్ళు తమలో తామే నవ్వుకుంటూ సరదాగా చూస్తున్నారు

మాలతీదేవికి మాత్రం అంతా అయోమయంగా, గందరగోళంలా అనిపించ సాగింది

అబ్బ! ఊరికే మాటవరసకి అన్నారా బాబూ. ఆ మాత్రం జ్ఞానం నాకు లేదనుకున్నావట్రా?'

ఉందని తెలుసు ననుకో కానీ, నిన్ను చూస్తుంటే నా స్నేహితుడు మనూవి కాదని పిస్తోంది అందుకే అలా భయపడ్డాను సరే చెప్పు "

'నా చెల్లెల్ని నీకిచ్చి పెళ్ళి చెయ్యడానికి వీల్లేదు కదా' అందుకని నీ చెల్లెల్ని నేను పెళ్ళి చేసుకుంటా నన్నాను తప్పా?' గట్టిగా అరిచాడు మనోజ్

'అబ్బ' అలా అరవకురా నాయనా లోపల పసి పిల్లలు ఉన్నారు'

# ప్రత్యూష పవనాలు

దడుసుకుంటారు. తప్పు లేదనుకో. ఆ విషయాలన్నీ తరువాత మాట్లాడుకుందాము గానీ, ముందు నువ్వెళ్ళి ఆ గడ్డం గీక్కుని స్నానం చేసిరా. నీ సంగతేమో గానీ, నాకు మాత్రం ఆకలి దంచేస్తోంది. పొద్దున్న స్టేషనుకి వచ్చేముందు కాస్త కాఫీ తాగాను తప్ప ఇంతవరకూ ఏమీ తినలేదు. అప్పుడే పది అవుతోంది" అన్నాడు వాచీ చూసుకుంటూ.

"హు! పిచ్చివాడా! తిండి తిని పదిహేను రోజులైంది తెలుసా?"

"బాప్‌రే! నిరాహారదీక్ష చేస్తున్నావా? ఎందుకురా?"

"నేను కోరుకున్న అమ్మాయితో నా పెళ్ళి జరిపించడానికి మా అమ్మ నాన్న ఒప్పుకునే వరకూ నిద్రాహారాలు మానేసి నిరాహారదీక్ష చెయ్యాలని నిర్ణయించుకున్నాను. కొద్ది రోజుల్లో సన్యాసుల్లో కలిసి పోబోతున్నాను. అందుకే ఇలా గడ్డం పెంచుతున్నాను" కళ్ళు మూసుకుని గడ్డం దువ్వుకుంటూ "ఓం శాంతి, ఓం శాంతి" తపస్సమాధిలోకి వెళ్ళిపోయిన యోగీశ్వరుడిలా అలాగే కూర్చుండిపోయాడు.

"ఒరే నాయనా! నువ్వేపిల్లని చేసుకున్నా మాకేం అభ్యంతరం లేదురా. కానీ, మీ ఆంటీయే తన కూతుర్ని నీకిచ్చి పెళ్ళి చెయ్యడానికి ఇష్టపడడం లేదు. దానికి మేమేం చెయ్యమురా" అంది సావిత్రి, రుద్ధ కంఠంతో.

"చేసిన తప్పులకి చెంపలు వాయించుకుని క్షమార్పణలు చెప్పుకోండి. కాళ్ళు పట్టుకుని బ్రతిమాలండి" నిద్రలో కలవరిస్తున్నట్లుగా అన్నాడు.

"ఆ పని నిన్నటి నుంచీ చేస్తూనే ఉన్నామురా. సిగ్గు విడిచి, అభిమానం వదిలేసి మీ నాన్న కూడా ఆవిడ కాళ్ళు పట్టుకుని మరీ అడిగారు" అంది సావిత్రి ముక్కెగబీలుస్తూ.

"అయినా ఒప్పుకోవడం లేదా?"

"లేదురా, ససేమిరా వీల్లేదంటోంది."

దిగ్గున లేచి రెండంగల్లో వెళ్ళి ప్రఫుల్ల చెయ్యిపట్టి మాలతీదేవి ఎదుటికి లాక్కొచ్చి, "ఆంటీ! ఈ మీ చిన్నకూతుర్ని నా కిచ్చి పెళ్ళి చేస్తారా లేకపోతే ఈ పాయిజన్ మింగి మీ కళ్ళ ఎదురుగానే, మీ కాళ్ళ దగ్గరే ప్రాణాలు విడిచెయ్యనా?" జేబులో నుంచి పాయిజన్ బాటిల్ తీసి మాలతీదేవి ముఖానికి దగ్గరగా పెట్టాడు.

అతని పట్టు నుంచి విడిపించు కోవాలని ప్రయత్నిస్తున్న ప్రఫుల్ల పులివాత బడిన లేడి పిల్లలా గజగజా వణికి పోతోంది.

మాలతీదేవి ముఖం వివర్ణమైంది.

"అన్నయ్యా! ఏమిటిదంతా?" ప్రత్యూష అన్నగారి దగ్గర కొచ్చి భయంగా అడిగింది. ఆమె వెనుకే వత్సల.

ఫరవాలేదన్నట్లు కళ్ళతో నే వాళ్ళిద్దరికీ ధైర్యం చెప్పాడు.

మాలతీదేవి అప్రయత్నంగా సరేనన్నట్లు తల ఊపింది. అసలు ఆమె ఏం చేస్తోందో ఆమెకే తెలియడం లేదు. అంతా అగమ్య గోచరంగా ఉంది.

"థాంక్యూ ఆంటీ! థాంక్యూ వెరీమచ్" ప్రఫుల్ల చేతిని వదిలేసి, తల్లి దగ్గరకి వచ్చి విరగబడినవ్వుతూ, "చూశావామ్మా. నువ్వు చెయ్యలేని పని నేను చేశాను. ఆంటీని పెళ్ళికి ఒప్పించాను" అన్నాడు గర్వంగా.

"కానీ.... కానీ.... ఈ పెళ్ళి జరగడానికి వీల్లేదు" అంది సావిత్రి.

"ఎందుకని?" కఠినంగా మారిపోయింది అతని గొంతు

"ఎందు కేమిటి? జరగడానికి వీల్లేదు అంతే."

"అయితే– నేను చావడమే నీ కిష్టమా? ఆంటీ కూడా ఒప్పుకున్నాక ఇప్పుడు నీ కెందుకు ఇష్టం కావడం లేదు."

"నేను.... నేను ఆ అమ్మాయిని అనుకున్నాను. నువ్వు మధ్యలో ఇప్పుడీ అమ్మాయిని తీసుకొచ్చావు" అంటూ ప్రత్యూష వైపు చూపించింది సావిత్రి.

"నేను చెప్పింది ఈ అమ్మాయి గురించే. నువ్వు పొరపాటుగా విని ఉంటావు. ఎవరైతే ఇప్పుడు ఏమైంది? కాకపోతే పెద్దమ్మాయికి చెయ్యకుండా చిన్నమ్మాయికి పెళ్ళి చెయ్యడానికి ఆంటీ ఇష్టపడరు. అంతేగా. ప్రహ్లాద్ తల్చుకున్నాడంటే నాలుగు రోజుల్లో ఏదో ఒక సంబంధం చూసి సెటిల్ చేసేస్తాడు."

"అందుకు కాదు...."





"మరేమిటి? నా కోరిక నెరవేర బోతోందని సంతోషిస్తుంటే మధ్యలో నీ సణుగుడు?" చిరాగ్గా చూశాడు.

"ఒరే మనూ! ఎవరైతే ఏమైంది అని ఇప్పుడు నువ్వేగా అన్నావు. ఈ చిన్నమ్మాయికి బదులు ఆ పెద్దదాన్ని చేసుకోరా" అంది బ్రతిమాలుతున్న ధోరణిలో.

"అమ్మా! ఇదేమీ కూరగాయల బేరం కాదు. వంకాయలు బాగా లేకపోతే బీరకాయలు కొనుక్కుందాం అనుకోడానికి. అయినా పెళ్ళి చేసుకునే వాడిని నేను నా కిష్టం వచ్చిన పిల్లని చేసుకుంటాను. ఆ పిల్లని కన్న మహాతల్లి నా కాళ్ళు కడిగి కన్యాదానం చెయ్యడానికి సిద్ధంగా ఉన్నారు. మధ్యలో నీ కేమిటి బాధ?"

"ఆ అమ్మాయి నీకు వరస కాదు" తడబడుతూ చెప్పింది సావిత్రి.

"వాట్! వరస కాదా? మరి.. ఈ అమ్మాయికి అక్క ఆ అమ్మాయి. ఆ అమ్మాయి మాత్రం వరస ఎలా అవుతుంది? అయినా ఇదివరకు ఎన్నో సంబంధాలు చూశాం. పిల్లలు నాకు నచ్చక, వాళ్ళు ఇచ్చే కట్నాలు మీకు నచ్చక ఆ సంబంధాలు వదులు కున్నాము గానీ, ఇలా వావి వరసలు అంటూ ఎప్పుడూ ఆలోచించ లేదు కదా?"

"అవన్నీ వేరు, ఇది వేరు"

"ఎందుకట ఆ స్పెషాలిటీ" వెటకారంగా అన్నాడు.

"అదంతా నీ కనవసరం. వీల్లేదంటే వీల్లేదు."

"అయితే సరే. నా విషయం మరచిపో యింక. ఒరే ప్రహ్లాద్! ఇంట్లో చచ్చిపోతే అనవసరంగా మీ ఇల్లు మైలపడి పోతుంది. అలా బయటికి వెళ్ళి ఈ పాయిజన్ తాగేస్తాను. ప్రహ్లాదా! నా కోసం ఏడుస్తూ కూర్చోక మున్సిపాలిటీ వాళ్ళకి ఫోను చేసి నా డెడ్‌బాడీని దహనం చేయించు. లేకపోతే ఇన్నాళ్ళు పెరుగు, నేతులతో పోషించిన ఈ శరీరాన్ని కుక్కలు నక్కలు పీక్కు తింటాయి. "జేబులో నుంచి పాయిజన్ బాటిల్ చేతిలోకి తీసుకుని, ఏడుస్తూ, "ఒరేయ్ ప్రహ్లాదా" "వచ్చే జన్మలో కూడా నీకు స్నేహితుడిని కావాలని ఆ దేముణ్ణి కోరుకుంటూ ప్రాణాలు విడుస్తాను. ఆ జన్మలో నైనా నీ చిన్న చెల్లెల్ని పెళ్ళి చేసుకునే భాగ్యం కలిగించమని ఆ దేముడికి ఇప్పుడే అప్లికేషను పెట్టేస్తాను. లేకపోతే ఆ జన్మలో కూడా నేను పెళ్ళి కాకుండానే చచ్చి పోవాల్సి వస్తుంది. అయినా ఈసారి నేను ఏ అమ్మాయిని చేసుకుంటానన్నా సంతోషంతో ఆశీర్వదించ డానికి ఇష్టపడిన తల్లి కడుపునే పుడతానులే. లేకపోతే ఇలాగే అర్థాంతరంగా చచ్చి పోవాల్సి వస్తుంది." ముక్కెగబీలుస్తూ వెనక్కి తిరిగి "అమ్మా! నాన్నా! ఆంటీ! మీకు ఇవే నా తుదివందనాలు. ఎక్కువ శ్రమ పడకుండా– బాధపడకుండా చచ్చి పోవాలని ఆశీర్వదించండి" అంటూ చేతులు జోడించి నమస్కరించాడు

"సావిత్రీ! బాబుని ఆపు" మాలతీదేవి కంగారుగా లేచి నిలబడింది

"నన్ను కన్నతల్లికే లేని ఆరాటం మీకెందుకండీ? మీరు నా మీద చూపించే ఈ అభిమానానికి శతకోటి వందనాలు." అంటూ వంగి మాలతీదేవి పాదాలకి నమస్కరించాడు మనోజ్.

"మనిషిని కనుక, నా మనసు పాషాణం కానందుకు ఇప్పుడు.... నిజంగా ఈ క్షణంలో చాలా విచారిస్తున్నాను బాబూ. నా బిడ్డ లాంటి వాడివి నా మాట విను బాబూ. నీకు నచ్చిన పిల్లని పెళ్ళి చేసుకోడానికి అమ్మ ఒప్పుకోలేదని ఏకంగా ప్రాణాన్ని తీసుకోడానికి సిద్ధపడతారా ఎవరైనా! భవిష్యత్తు అంతా ముందే ఉందయ్యా." బుజ్జగిస్తున్నట్లు చెప్పింది మాలతీదేవి.

"ఇప్పటిదాకా నీ కిష్టం వచ్చిన పిల్లని చేసుకోరా నాయనా అన్న మనిషి ఇప్పుడు ఎందుకిలా మాట్లాడాలి? పోనీ అని బ్రతిమాలుతున్నా కారణం చెప్పదు. కన్న తల్లి కదా ఆవిడ అనుమతి లేకుండా చేసుకోడానికి మనసొప్పక ఊరుకుంటున్నాను గానీ, ఎదిరించి చేసుకోలేక ఇలా తాపత్రయ పడుతున్నానా?"

"ఆ విషయం మీ అమ్మకి తెలియాలి. నేనేం చెప్పనయ్యా." సావిత్రి వైపు తిరిగి, "సావిత్రీ! ఇంకా ఎందుకు దాపరికం? అభిమానానికి పోయి కన్నబిడ్డని దూరం చేసుకోకు. అతని పచ్చని జీవితాన్ని చేతులారా నాశనం చెయ్యకు" అంది తీవ్రంగా.

సావిత్రి ముఖం పక్కకి తిప్పుకుని, "బాబూ! అది నాకు చెల్లెలు. నీకు పినతల్లి అవుతుంది." చెప్పలేక చెప్పలేక చెప్పింది.

"చెల్లెలా? మరి ఆ విషయం మాకెవరికైనా ఎప్పుడైనా చెప్పావా? అసలు నీకో అన్నగారున్నాడని గానీ, ఆయన బ్రతికి ఉన్నారో, పోయారో; ఆయన పెళ్ళాం పిల్లలు ఏం చేస్తున్నారో.... ఎలా ఉంటున్నారో ఎప్పుడైనా ఆలోచించావా? హు! నీకవన్నీ అక్కర లేదు. ఆస్తి మాత్రం కావాలి తండ్రి చనిపోయాక పుట్టడం ఆ అమ్మాయి చేసుకున్న దోషమా? పుట్టగానే తల్లిని కోల్పోవడం ఆమె నేరమా? అంతమాత్రంచేత దరిద్రురాలు, ముదనష్టపుది అయిపోయిందా ఆ అమ్మాయి. ఆ విషయం అంత రహస్యంగా దాచిపెట్టడానికి కారణం ఏమిటి? ఛ! నువ్వసలు ఆడదానివేనా? నేను భస్మాసుని అంతలా. ." మధ్యలో నే అతని భుజం మృదువుగా తడుతూ, "బాబూ మనూ! ఆపు నాయనా గతాన్ని తిరగతోడు కోవడం ఎందుకు?" అంది మాలతీదేవి వారింపుగా

"అదికాదు ఆంటీ! తోడబుట్టిన అన్నగారిమీద, చెల్లెలిమీద అంత ద్వేషం ఎందుకు? వాళ్ళ ఉనికిని అంత రహస్యంగా దాచి పెట్టడం ఎందుకు? ఆస్తులు, అంతస్తులు, శాశ్వతమా? ప్రేమానురాగాలు, ఆదరాభిమానాల కంటె ఆ ఆస్తులు ముఖ్యమా? ఆ ఆస్తులు అయినా శాశ్వతంగా మిగిలి ఉన్నాయా? పోనీ, అవి పోయిన మనుషుల్ని తెచ్చి ఇవ్వగలుగుతాయా?"

"నిజమేరా! నేనా విషయం తెలుసుకునే సరికి చాలా ఆలస్యం అయిపోయింది చేసిన పొరపాటు బయట పెట్టుకోడానికి ముఖం చెల్లలేదు." అంది సావిత్రి పశ్చాత్తాప పూర్వకంగా.

"క్షమించమ్మా. నీ మనసు నొప్పించి, నిన్ను నలుగురిలో అవమాన పరచాలన్నది నా అభిమతం కాలేదు నీ నుంచ నిజం బయట పెట్టాలనే




తాపత్రయంతో ఇంత నాటకం ఆడితే తప్ప ఫలితం లేకపోయింది తల్లి కళ్ళు తుడిచి మాలతీదేవి దగ్గరకు నడిచి, "క్షమించండి ఆంటీ! జరిగిన విషయాలన్నీ గుర్తు చేసి మీ మనసు గాయపరిచాను." అన్నాడు మనస్ఫూర్తిగా.

"నేనసలు మరచిపోతే కదయ్యా, నువ్వేదో గుర్తు చేశావను కోవడానికి జరిగినదేదో జరిగి పోయింది కన్న తల్లి మనసు కలతపెడితే ఫలితాన్ని పిల్లలు తప్పనిసరిగా అనుభవించ వలసి వస్తుంది ఎప్పటికైనా అంచేత అమ్మ మనసు బాధ పెట్టక ఆవిడ చెప్పిన పిల్లని పెళ్ళి చేసుకుని సుఖంగా ఉండు బాబూ అంది అనునయంగా.

ఆంటీ! ఇలా అడగడానికి సాహసిస్తున్నందుకు మన్నించండి ప్రహ్లాద్ మీకు చెప్పే ఉంటాడు. మా స్నేహాన్ని బంధుత్వంగా మార్చుకోవాలని నా కోరిక మీ రంగీకరిస్తే సంతోషిస్తాను అంగీకరించక పోయినా బాధపడను. అంతా మీ ఇష్టం' చేతులు నులుముకుంటూ తల దించుకున్నాడు వినయంగా.

'ఆలోచించుకోవడానికి నాకు కాస్త వ్యవధి ఇవ్వు బాబూ నా బిడ్డ ఎంతో అల్లారు ముద్దుగా. కష్టం అంటె ఏమిటో తెలియకుండా పెరిగింది. అటువంటి పిల్ల పెళ్ళి విషయంలో ఏదో ఒకటిలే అని సరిపెట్టుకుని దాని జీవితాన్ని కన్నీటి కడలిలో ముంచలేను"

"నేనెలాంటి వాడినో మీకు తెలుసు. నా మనసేమిటో మీకు చెప్పాను మీ దయ . నా ప్రాప్తం" అని ప్రఫుల్ల కోసం చుట్టూ చూశాడు. అక్కడ కనిపించ

## గడుసులోకం

—బాబు







## ప్రత్యూష పవనాలు

లేదు.

ప్రత్యూష గదిలోకి నడిచాడు.

వత్సల, ప్రత్యూష ఇద్దరూ చెరో వైపున కూర్చుని ప్రఫుల్లకి ఏదో నచ్చ చెప్తున్నారు.

ఒకడుగు ముందుకి వేసి, "ప్రఫుల్లా! అమ్మచేత నిజం చెప్పించాలన్న ఆరాటంలో నీ పట్ల అనుచితంగా ప్రవర్తించాను నన్ను మన్నించమ్మా" అన్నాడు లోగొంతుకతో.

మెల్లగా తల పైకెత్తి చూసింది ప్రఫుల్ల.

రెప్పలు తడిగా ఉన్నాయి.

మెల్లగా తన భుజాలమీద ఉన్న వత్సల, ప్రత్యూషల చేతుల్ని తప్పించుకుని, లేచి నిలబడి, పైటతో కళ్ళు, ముక్కు తుడుచుకుంటూ కాస్త ముందుకి జరిగి, "మీరు.... మీరు మా అక్కని పెళ్ళి చేసుకుంటా నంటున్నారు. మా అమ్మ ఒప్పుకుంటే.... మీరు మా అక్కని పెళ్ళి చేసుకుంటే అక్కని ఎక్కడికి తీసి కెడతారు?" అడిగింది.

"మా యింటికి" అన్నాడు చిన్నగా నవ్వుతూ.

"అమ్మో! అయితే ఈ పెళ్ళికి ఒప్పుకోవద్దని మా అమ్మకి చెప్పేస్తాను" అంది అరచేతులు గుండెల మీదికి చేర్చుకుని.

"పోనీ, ఇంకెలా చెయ్యమంటావో చెప్పమ్మా!"

"మీరే ఇక్కడ ఉండిపొండి."

"ఇట్సాల్ రైట్!" భుజాలు కొద్దిగా పైకెగరేసి, కళ్ళు మూసి తెరిచాడు, ఓరగా ప్రత్యూష వైపు చూస్తూ.

క్రింది పెదవిని పళ్ళ మధ్య కొరుకుతూ పైట చెంగుని వేలికి చుట్టుకుంటూ వత్సలని అనుకుని తల దించుకుని నిలబడిఉంది ప్రత్యూష.

"మరి మీ ఉద్యోగం?"

"వెరీ సింపుల్! అది అక్కడుంటుంది. మనం ఇక్కడ ఉంటాము. మీ అక్క కంటే ఎక్కువది కాదుగా వెధవుద్యోగం" అన్నాడు తేలిగ్గా.

"అవుననుకోండి. కానీ, ఛ! ఉద్యోగం లేకుండా ఎలా?" అంది ముఖం అదోలా పెట్టి.

"ఉద్యోగం లేకపోతే మీ ఇంట్లో నాకు అన్నం పెట్టరా?" అన్నాడు నవ్వుతూ.

"అలా అని కాదు. పూర్తిగా పుట్టింటి వారిమీదే ఆధారపడే మగవాడిని భర్తగా గౌరవించలేదు ఏ ఆడదీ కూడా "

"మరెలాగబ్బా? మీ అక్కని అక్కడికి తీసి కెళ్ళొద్దన్నావ్. ఒ. కె.! నన్నిక్కడే ఉండి పొమ్మంటున్నావు అదీ ఒ. కె! పుట్టింటి వారిమిద ఆధారపడే మగవాడిని.... ఆడది.... గౌరవించదు. అంటే మీ అక్క రోజూ నన్ను తిడుతూ- కొడుతూ ఉంటుందా? అయితే కాస్త సీరియస్‌గా ఆలోచించాల్సిన విషయమే ఇది" అన్నాడు గడ్డం దువ్వుకుంటూ, ఇబ్బందిగా ముఖం పెట్టి.

పైట చెంగుని నోటికి అడ్డు పెట్టుకుని నవ్వుని బలవంతంగా ఆపుకుంటూ పక్క గదిలోకి పారిపోయింది ప్రత్యూష.

"చిన్నీ! ఏమిటమ్మా ఇవన్నీ... ముందు అత్తయ్య ఒప్పుకుంటే మిగిలిన వాటిని ఎలాగో సర్దుబాటు చేసుకోవచ్చు. ఆ విషయాలన్నీ మీ అన్నయ్య చూసుకుంటారు కదమ్మా" అంది వత్సల నవ్వుతూ కాస్త మందలింపుగా.

"పరవాలేదు లేమ్మా. అక్క గురించి చెల్లెలికి ఆ మాత్రం ఆరాటం ఉండడం సహజమే కదా చిన్నీ! నీ మాట నిజమ్మె ఆంటీ ఒప్పుకోవాలే గానీ, ఏ సమస్యా రాకుండా నేనేదో విధంగా అన్నీ సెటిల్ చేస్తానమ్మా. ఒ. కె.?"

సరేనన్నట్లు మెరిసే కళ్ళతో చూసింది.

"గుడ్! వస్తానమ్మా" అంటున్న మనుకి "ఒరేయ్ మనూ!" ప్రహ్లాద్ పిలుపు వినిపించింది

"ఏమిట్రా?" అంటూ హాల్లోకి వచ్చాడు.

"మెల్లగా ఏమిటని అడుగుతావేరా? ఇప్పుడు సమయం మధ్యాహ్నం రెండు గంటలు. నీకు ఆకలి వెయ్యడం లేదా?" అన్నాడు పొట్ట తడుము కుంటూ.

"లేదు బిడ్డా లేదు. ఇప్పుడు మేము వ్రతదీక్షలో ఉన్నాము కదా?" గడ్డం దువ్వుకుంటూ కళ్ళు మూసుకుని "ఓం శాంతి! ఓం శాంతి!" అన్నాడు మనోజ్.

"ఒరేయ్! ఒరేయ్! వ్రతదీక్షా లేదు. వంకాయ పచ్చడీ లేదు. నీకు పదే పది నిముషాలు టైమిస్తున్నాను. వెళ్ళి నీట్‌గా గడ్డం చేసుకుని, స్నానం చేసేసి రారా. ఇలా నిన్ను చూస్తుంటే నాకు ఏడుపొస్తోందిరా. వెళ్ళు ముందు."

"వెళ్ళు నాయనా. నీ మూలంగా అందరూ భోజనాలు మానెయ్యాల్సి వస్తుంది. అసలే వేళదాటి పోయింది కూడాను" అంది మాలతీదేవి మృదువుగా.

ఆమె ముఖం ఎప్పటిలా నిర్మలంగా, శాంతికి నిలయంలా ఉంది.

ఆవిడ మాట తిరస్కరించే శక్తి తనకి లేనట్లుగా వెంటనే తల వంచేసి, "ఒకే, ఆంటీ! ఐదు నిముషాల్లో వస్తాను." అనేసి వెళ్ళి బాత్ రూములో దూరాడు.

"చిన్ని! మున్నీ! వత్సలా!" పిలిచి వాళ్ళు రాగానే, "అమ్మ వద్దన ఏర్పాట్లు చూస్తోన్నట్లుంది. కాస్త సహాయం చెయ్యండి వెళ్ళి" అన్నాడు తను పిల్లలున్న గదిలోకి దారితీస్తూ.

సిగ్గుతో చితికి పోతూ, ముడుచుకుని కూర్చుని ఉన్న సావిత్రి, రామకృష్ణలని చూసి మనసాప్పక, "సావిత్రీ! ఏదో కుర్ర చేష్టలు. సీరియస్‌గా పట్టించుకోకండి. ఇద్దరూ లేచి భోజనాలకి రండి" అంటూ డైనింగ్ టేబులు దగ్గరకి పిలుచు కొచ్చింది మాలతీదేవి.

(ఇంకావుంది)

# గోవిందు

## వి.వి.బి. రామారావు

మాస్టారికి వచ్చిన అనుమానం ముందే వచ్చి ఉన్నా బాగుండేది. తీరా పని అప్ప చెప్పడం- తన ఎస్తువులు అతను పట్టుకుని వెళ్ళిపోవడం జరిగిన తరువాత చటుక్కున వచ్చింది సందేహం.

వెనక్కి తిరిగి చూసుకుంటే అంత తెలివి తక్కువగా ఎందుకు తొందరపడ్డానా అని మనసులోనే చిరాకుపడ్డారు.

'పని ఉంది' అని ఆయన నోట వెంట వచ్చిందో లేదో "వస్తున్నా సార్!" అంటూ పక్కనే ఉన్న సైకిల్ షాపులో మంచి సైకిలు ఒకటి తీసుకొని బయలుదేరి వచ్చాడు ఆ కుర్రాడు.

"ఏం చదువుకున్నావ్?"

"చదువుకోలేదు బాబూ! మా నాన్న మా అమ్మ నన్ను చిన్నప్పటి నుంచి ఈ పనిలో పెట్టేశారు."




"అరెరె అదేమిటోయ్ ఇంత చిన్న వాడివి. సొంతం నీకు పద్నెనిమిదేళ్ళు లేని నీవు చదువుకోకపోతే ఎలా? నీ వృత్తి నువ్వు చేసుకో వచ్చునుకో- కాని కుర్చీకి ఇంత చొప్పున ఇన్ని కుర్చీలకి అని కొటేషన్ ఇవ్వాలన్నా-రసీదు ఇవ్వాలన్నా రాయడం చదవడం రావాలి కదా!"

మేష్టారిలో ఒక రకమైన ఉద్వేగం వచ్చింది.

ఎంతయినా ముప్పై ఏళ్ళ సర్వీసు కదా-

"అయినా ఏం పోయిందిలే... వాడవాడనా వయోజన విద్యా కేంద్రాలు పెడుతున్నారు. అందులో చేరు. కొద్ది నెలల్లో తెలుగు రాయడం చదవడం నేర్చుకోగలవు. ముఖమూ, మాటా తేటగా కనబడుతోంది. చదువు చాలా ముఖ్యం..."

"బాబూ ఎన్ని కుర్చీలండీ?"

"ఇవిగో ఇవి రెండు మేడ మీద ఇంకొకటి ఉంది. వైరు మంచిది వెయ్యాలి సుమా-. నీ పనితనం బాగుంటే మరి నాలుగు బేరాలు నీకు ఒప్ప చెపుతాను. ఇంతకీ ఏం ఇమ్మంటావ్!"

"డెబ్బై ఇదిచ్చెయ్యండి".

"ఎక్కువయ్యా..."

"ఎక్కువ కాదు బాబూ సరిగ్గానే అడుగుతున్నాను. పనితనం మీరే చూద్దురుగాని..."

"ఇరవై చొప్పున తీసుకో.. మూడింటికీ అరవై ఇస్తా..."

"మరి రిక్షా ఖర్చులు అవీ..,"

"మరేం అనకు... అవన్నీ దృష్టిలో పెట్టుకునే నేనూ చెప్పాను."

"బాబూ చిన్న తాడు ముక్క ఉందా..."

బహు నేర్పుగా కుర్చీలు సైకిలుకి కట్టేసి నిమిషంలో మాయమైపోయాడు.

# కథ కాని కథ

అం దరిలాగే
పబ్లిక్ బస్‌లో
అయన రోజూ
వచ్చేవారు
చీటికి మాటికి
స్ఫూడియోలల్లో
సినిమా పాత్రకు
తిరిగేవారు
ఊళ్ళోవాళ్ళకు
పుబుసుపోక కని
వుపన్యాసాలు
దంచేవారు
దానికి దీనికి
దేనికోదానికి
దానాలిమ్మని
అడిగేవారు
ఖద్దరు తొడిగిన
ప్రతిఆసామికి
ముద్దుగ సలాము
కొట్టేవారు
ఉద్యోగ రీత్యా
నే నా ఊరికి
ఉద్వాసమిచ్చా
పదేళ్ళపాటు
ఆదివారమని
తాపీగా మన
"ఆంధ్రపత్రిక"ను
తిరగేస్తున్నా
ఎలక్షన్లలో
గెలిచి మంత్రిగా
సెలెక్షనైనది
ఆ ఘనుడేనట!
కాకినాడలో
కల్లుదుకాణం
నూజివీడులో
నూనెఫ్యాక్టరీ
భీమవరంలో
బీదల సత్రం
చింతపల్లిలో
సినిమాహాలూ.....
అంతంలేదా
"లిమ్టు"కు నేస్తం!
అన్నీ అన్నీ
ఆయనవేనట!
ప్రజాసేవకై
దేశంకోసం
"మంత్రి"గ
ఆమంత్రణ పాలిస్తూ
శీఘ్రం "తానే
హీరోగా ఒక
సినిమా తీస్తా" నని
చెప్పారట!
ఊరి పెద్దలా
మెర్సిడీస్‌లో
ఊరేగించిన
ఫొటో పడింది!

ఏల్చూరి విజయరాఘవరావు.

పడక కుర్చీలో కూచుని ఆలోచిస్తున్నారు మాస్టారు. తను అసలు కొన్నదే మూడు కుర్చీలు యాభైకి. చాలా రోజులు క్రిందట అనుకోండి. మరి ఇప్పుడు వాటికి వైరు వెయ్యడానికి అరవయ్యే!

ఎందుకో మెరుపులా ఆలోచన వచ్చింది.

తన దగ్గరికి ఇంటికి తీసుకొచ్చిన అతను కూడా చిన్నవాడే. మూడూ యాభైకిచ్చేస్తానన్నాడు. ఫ్రేములు చక్కగా ఎయింట్ చేసి చిక్కగా ప్లాస్టిక్ వైర్‌తో నేసిన మూడు కుర్చీలూ, సెట్‌గా ముచ్చటగా కనిపించాయి.

కొంప తీసి ఈ కుర్రాడు మూడింటినీ తీసుకుని ఉడాయించడు కదా... ఇంకా నయం కనీసం ఆ కుర్రాడి పేరయినా అడిగి తెలుసుకున్నాడు గోవిందట... మంచి పేరే... కుర్రాడూ నీట్‌గానే ఉన్నాడు. చదువుకున్న వాడిలాగే కనిపించాడు. అబద్ధం ఆడాడా? అందుకే ఇలా అనుమానం హెచ్చయిపోతోంది. మోసగింపబడతానేమోనన్న భయం.

"రోజుకి ఎన్ని కుర్చీలు అల్లుతావ్?"

"సరదా మీద అయిదయినా చేసేస్తా బాబూ."

"ఒక్కొక్క రోజు ఒక్కటీ చెయ్యాలని ఉండదు."

## గోవిందు

"మరి ఎప్పుడు తెచ్చేస్తావ్.. నేను రాలేను సుమా... కుర్చీలు ఇంట్లో ఇచ్చేసి డబ్బు తీసుకు వెళ్ళు."

"ఇవాళ సోమవారం కదండీ... లక్ష్మివారం సాయంకాలం ఇస్తా. ప్రస్తుతం పని కొంత రద్దీగా ఉంది. లేకపోతే రేపే ఇచ్చేద్దుననుకోండి."

–మంగళవారం నాడు మాస్టారికి గుండెలో గుబులు మొదలయ్యింది.

ఒక వేళ ఇప్పుడు మళ్ళీ ఆ కొట్టు దగ్గరకు వెళ్ళినా అది మూసి ఉంటుంది శెలవు దినం కాబట్టి. ఇంతకీ ఆ కుర్రాడు ఒక్కడే ఉన్నాడు. తీరా వాడికీ ఆ కొట్టువాడికీ సంబంధం లేకపోతే... ఈ కుర్రాడు ఇంటికి పట్టుకుపోయి నేసి వీధులంట అమ్మేస్తే తను కొన్నాళ్ళ క్రిందట కొన్నట్టే మరెవరో కొనేసుకుంటారు.

ఎందుకైనా మంచిది పోలీసు వాళ్ళ చెవిని వేస్తే? వాడు దొంగే అయితే ఈసరికి కుర్చీలు అల్లటం వాటిని వీధులంట తిప్పి అమ్మేయటం జరిగిపోయే ఉంటుంది. పోలీసులకి చెప్పే ముందు వాడు నిజంగా దొంగేనా అన్నది ఖరారు చేసుకోవడం న్యాయమనిపించింది. పోలీసులు మాత్రం ఏం చేస్తారు? ఎవరో కొనేస్తే వాట్ని పట్టుకోగలరా?

లక్షలు లక్షలు పనాయబ్ అయిపోతే దిక్కు లేదు- బొక్కి కుర్చీల గోడు ఎవడు పట్టించుకుంటాడు!

బుధవారం సాయంకాలం వరకూ కుర్చీలూ, గోవిందూ మనసులో మెదులుతూనే ఉన్నా మాస్టారికి తీరిక కుదరలేదు వెళ్ళి కనుక్కోవడానికి.

ఈమారు జాగ్రత్తగా పరిశీలనా దృష్టితో చూడాలనుకుని బయలుదేరారు.

వీధి ముందు ఏదో ఒక రాటకి మేదరి వీధి అని ఒక బోర్డు ఉంది.

వీధి ముందునే రోడ్డు మీద ఒక తాటి రేకు చాప ఒక తక్కెడా గుళ్ళూ...

చాప చుట్టూ మనుషులు. చాప మీద ఈగలూ. ఈగల క్రింద ఏదో పెద్ద పెద్ద మాంసం ముక్కలూ. గొడ్డు మాంసం కాబోలు.

వెధవది అక్కడికి వెళ్ళినపుడు అవేమి తనకంట ఎందుకు పడలేదో-

మాస్టారి వంక చాప చుట్టూ గుమి గూడిన మనుష్యులు వింతగా చూస్తున్నారు.

మాస్టారికి కడుపులో ఏదో వికారం పెడుతున్నట్టనిపించింది.

ఎవరినని అడగాలి?

మాకేం తెలీదంటే ఏం చెయ్యాలి? వెధవ బొక్కి కుర్చీల కోసం ఇంత ఆత్రం పడుతున్నాడేమిటీ వెర్రి మొహం గానీ అని వాళ్ళనుకుంటే?

"ఏమిటి బాబూ ఇలా వచ్చేరు... అర్జంటుగా బ్యాంకు కుర్చీల పని ఒప్పుకోవలసి వచ్చింది- తమ పని కొంచెం ఆలస్యమైంది. ఇదిగో ఒకటి పూర్తి చేశా... రేపు సాయంకాలానికి తమ ఇంటికి అప్ప చెప్పేస్తా... శ్రమ తీసుకుని వచ్చారు.."

"అబ్బే లేదయ్యా ఎలా చేస్తున్నావో చూడాలనిపించింది. ఇటు వైపు ఎటూ వచ్చేను కదాని... తొందర లేదని ముందే చెప్పాగా. కొంత టైము తీసుకున్నా చేసిన పని గట్టిగా చెయ్యి... వస్తాను.'

చదువుకుని తల చెడగొట్టుకున్నది తను. తను తనలాంటి చదువుకున్న వాళ్ళు-

చదువుకోకపోయినా మనుష్యులని మనుష్యులుగా చూడడం చదువుకున్న వారిని గౌరవించడం తెలిసింది వాళ్ళకే. వాళ్ళ వల్లే దేశంలో మంచి- విలువలూ ఈ మాత్రంగా ఉన్నాయి.

అప్పుడు జ్ఞాపకం వచ్చింది.

తను లోపలికి రమ్మని నాలుగుసార్లు అంటే గాని మెట్ల దగ్గరే ఆగిపోయిన గోవిందు అరుగు మీదకి రావడానికే ఏదో ఆలోచిస్తూ తన వంక భయం భయంగా చూస్తున్నట్టు. చదువుకున్న వాళ్ల దగ్గర భయపడుతూ, నిజాయితీనీ, విలువలనీ, మంచినీ నిలబెడుతున్న వాళ్ళు ముమ్మాటికీ గోవిందు లాంటి వాళ్ళే- చదువుకోని వాళ్ళే-

మేస్టారి మొహం ఎర్రగా అయి మంట పుడుతున్నట్టనిపించింది. □

# ఆశ్రిత కల్పవల్లి విజయనగరం పైడితల్లి



పైడితల్లి అమ్మవారి గుడి

అనాదిగా మనదేశంలో ప్రతి చోటా ఏదో ఒక దేవతను నమ్ముతూ ఆరాధించటం, ఏటా పండుగ చేసుకోవడం పరిపాటి. కోరిన కోరికలు నెరవేర్చే దైవంగా విజయనగరం పైడిమాంబను ఉత్తరాంధ్ర ప్రజలు తరతరాలుగా ఆరాధించడం నేటికీ సాంప్రదాయంగా వస్తోంది. విజయదశిమి తర్వాత వచ్చే మంగళవారం నాడు ఈ పండుగ జరుపుకుంటారు.

ఈ జాతర ప్రతి సంవత్సరం అత్యంత వైభవంగా కన్నులపండుగగా జరుపుకోవడం విశేషం. ప్రజలందరూ కులమత వర్ణ విచక్షణ లేకుండా అందరూ ఆనందాన్ని పంచుకుంటారు. పండుగ ముందు రోజు తొలేళ్ళు. ఆ రాత్రి విజయనగరం సోయగాన్ని చూడడానికి రెండు కళ్ళు చాలవు. పట్నణమంతా రంగు రంగుల విద్యుద్దీపాలతో అలంకరించబడి, పగలా? రాత్రా! అనే సందేహాన్ని కూడా కలుగజేస్తుంది. ప్రతి వాడలో బుర్ర కథలు, హరికథలు, నాటకాలు, రికార్డు డాన్సులు లాంటి అనేక కార్యక్రమాలు జరుగుతాయి. ఇక సినిమా హాళ్లలో విరామం లేకుండా ఉదయం నుండి లెఖ్కలేనన్ని ఆటలు వేస్తారు. నగరం శివారు గ్రామాలైన మొయిద, డెంకాడ, తాడివాడ, భోగాపురం, కుమిలి, నాతవరం, గాజులరేగ, గంట్యాడ, రెడ్డిపల్లి మున్నగు పలు చోట్ల నుండి ఈ పండుగ తిలకించడానికి జనం తరలివస్తారు. ఏ హోటళ్లలోనూ ఖాళీ వుండదు. ఏ వీధీ నిర్మానుష్యంగా కనిపించదు. పగలంతా కోయ నృత్యాలు, పులివేషాలు, పంజాబీ నృత్యాలు, డప్పు వాయిద్యాలతో వీధులన్నీ ఎంతో సందడిగా వుంటాయి. ఈ పండుగకు కొత్త అల్లుళ్లను కోడళ్లను, బంధుమిత్రుల్ని పిలవడం పరిపాటి. కొన్ని లక్షలమంది ఈ పండుగలో పాల్గొంటారు.

## సిరిమాను ఉత్సవం

ఈ పండుగలో ప్రధాన ఘట్టం సిరిమానోత్సవం. ఆ రోజు సాయంత్రం నాలుగున్నర గంటలకి ప్రారంభమై సూర్యాస్తమయానికి ముందుగా ముగుస్తుంది. సిరిమాను చివరిభాగాన కూర్చున్న పూజారిని అమ్మవారి ప్రతినిధిగా భావించి ప్రజలు అరటిపళ్ళు విసిరి సత్కరిస్తారు. ఈ సిరిమాను అమ్మవారి ఆలయం వద్ద నుండి బయలుదేరి మూడుమార్లు కోటగుమ్మానికి మ్రొక్కి వెళుతుంది. ఇప్పటికీ విజయనగర మహారాజావారి సంతతి సిరిమానుపై కూర్చున్న పూజారిని పట్టు వస్త్రాలతో సత్కరిస్తారు. మూడు రోజులు ఆ పూజారి కఠోర ఉపవాస దీక్షలో ఉంటాడు. మంగళవారం తెల్లవారు ఝామున దేవాలయంలోపైడిమాంబ విగ్రహం ఎదుట కథ చెప్పి రైతులకు విత్తనాలు పంచుతాడు. ఆ విత్తనాలు విత్తితే పంటలు బాగా పండుతాయని రైతుల నమ్మకం. సిరిమాను ముందు తెల్ల ఏనుగు ఆకారంలో బొమ్మ పాలధార అంజలి రథం నడుస్తాయి. మ్రొక్కుబడుల కోసం అనేక వేషాలు వేసిన వాళ్ళు బాజాబజంత్రీలతో ఈ వేడుకలో పాల్గొంటారు. సిరిమాను రథాన్ని మనుషులు లాగుతారు. అది కదలుతున్నంత సేపూ బండారు (పసుపుకుంకుమ కలిపిన నీరు) చల్లుతుంటారు. అమ్మవారి పండగ నెల రోజులు ముందు నుంచే సాంస్కృతిక, వినోద కార్యక్రమాలతో నగరమెంతో హడావిడిగా వుంటుంద. ఫిలిమ్ డివిజన్‌వారు అనేక లక్షలమంది పాల్గొంటున్న ఈ ఉత్సవాన్ని చిత్రీకరించి తెరకెక్కిస్తే పండుగ ప్రాముఖ్యత నలుదిశలా వ్యాప్తి చెందగలదు

## ప్రచారంలో ఉన్న కథలు

పైడిమాంబ గురించి అనేక కథలు ప్రచారంలో వున్నాయి విజయనగర సంస్థానాధీశుల ఆడబడుచు పైడిమాంబని ఎంతో మంది అంటూ వుంటారు. విజయనగర సంస్థానాధీశుల మూల విరాటుడు పిడుగు భీమరాజా మనుమడు జగన్నాధపురంరాజా పరిసర ప్రాంతాలలో దండయాత్ర చేసినప్పుడు కలహండీ అనే వూళ్లో కనబడిన కన్యయే ఈ పైడిమాంబని మరికొందరు వూహాగానం. విజయవాడ కనకదుర్గ ప్రతిరూపమని మరికొందరు చెబుతారు.

పైడిమాంబ ఆలయ ప్రాంగణం విజయనగరం మూడు లాంతర్ల వద్ద వుంది. పూర్వం ఇక్కడ జంతుబలులు కూడా జరిగేవి. కాని నేడు ప్రభుత్వం జంతుబలిని నిషేధించింది. ఈ ప్రాంతం ప్రజలందరికీ పైడిమాంబ అంటే ఎంతో విశ్వాసం. కాబట్టే పైడితల్లి, పైడిరాజు, పైడయ్య, పైడమ్మ, పైడినాయుడు, పైడప్ప మున్నగు పేర్లు ఎక్కువగా పెట్టుకుంటూ వుంటారు.

సుమారు ఎనిమిది సంవత్సరాల క్రితం రెండు లక్షల రూపాయలతో రాజగోపురాన్ని నిర్మించి దేవాలయాన్ని పునర్నిర్మించారు. పండుగ నెల్లాళ్ళు వుందనగా ఈ ఆలయానికి మ్రొక్కుబడుల రూపంలో ఎన్నో వందల చీరలు వస్తుంటాయి. చీర చూపేందుకు, కొబ్బరికాయ కొట్టేందుకు ఇలా రకరకాలుగా భక్తుల నుండి కావలసినంత ఆదాయం ఆలయానికి వస్తుంది. ప్రతి రోజూ ఉదయం ఆరు గంటలకు సుప్రభాతం, దైవ ప్రార్థనల రికార్డులు వీనుల విందుగా పుర ప్రజలకు వినిపిస్తూ వుంటాయి ఆశ్రితజన కల్పవల్లి విజయనగరం పైడితల్లి అని ఈ ప్రాంతం వారి గట్టి నమ్మకం.

వ్యాసం, ఫోటోలు దూరి వెంకటరావు

సిరిమాను రథంపై పూజారి



పాఠకుల శీర్షిక

# చిన్నారి బాలల దీనగాథలు

## ప్రతి పౌరుడు సహకరించాలి

"పిల్లలూ, దేవుడు, చల్లనివారే, కల్లాకపట మెరుగని కరుణామయులే" అన్నారు ఒక కవి.

కాని ఈ నాడు చిన్నారి బాలలను దైవస్వరూపులుగా భావించే వారు కరువయ్యారు. పిల్లల భవిష్యత్తు ముఖ్యంగా తల్లితండ్రుల మీద ఆధారపడి ఉంది. మొదటలో పసిపిల్లలకు ఏమీ తెలియదు. వారి నడవడిక మరియు ప్రవర్తనపై పరిసరాల ప్రభావం ఎంతో ఉంటుంది. కొంత మంది తల్లితండ్రులు తమ పిల్లలను చెడు మార్గాలకు ప్రోత్సహిస్తున్నారు. ఇది చాలా శోచనీయమైన విషయం. జనాభా పెరుగుదలతో మనదేశం రెండవ స్థానం ఆక్రమించుకున్నప్పటికి అభివృద్ధి శూన్యం. "నేటి బాలలే రేపటి పౌరులు" కాని నేటి బాలలు ఈ విధంగా బానిసలుగా తయారవుతుంటే




భారతదేశం ఎలా అభివృద్ధి చెందుతుంది? విద్య, విజ్ఞానం అనునవి వయసుతో రావు. విజ్ఞానం నేర్చుకొన వలసిన వయస్సులో పిల్లలు రిక్షా కూలీలుగా, పోర్టర్లుగా, ఏదీ లేకపోతే చెడు మార్గాలు అవలంబిస్తూ జీవిస్తున్నారు. విజ్ఞానం, విద్య, ఇవి ఏమీ తెలియని బాలలు వీధుల వెంట అడుక్కుంటూ కాలం గడుపుతున్నారు.

ఈ చిన్నారి బాలల దీనగాథలు కడతేరాలంటే ప్రభుత్వంతో పాటు ప్రజలు కూడా పాటుపడాలి చదువుకున్న యువకులు ఒక సంఘంలా ఏర్పడి, ఈ బాలలలోని నిరక్షరాస్యతను తొలగించాలి. ఆర్థిక



స్తోమత గలవారు వీరికి సదుపాయాలు సమకూర్చాలి. ఇలా చేసిన యెడల భారతదేశ పౌరుడిగా మన కర్తవ్యంలో కొంతైనా నిర్వహించిన వారౌతాము. పసిపిల్లల మనసులో, చిన్నతనంలో పడిన ముద్ర శాశ్వతంగా ఉంటుంది. అందువలన చిన్నవయసులో చెడు ముద్ర పడకుండా జాగ్రత్త పడాలి. ఇది పిల్లల తల్లితండ్రుల బాధ్యతే గాక కర్తవ్యం కూడా!! ఈ చిన్నారి బాలల సమస్యలను వినయంతో పరిశీలించి వారు కూలీలుగా, బానిసలుగా గాక అక్షరాస్యులుగా తయారు చేయాలని ప్రభుత్వానికి నా చిన్న విన్నపము

-కె. ఎస్. వి. రవికుమార్,
మైలవరం (కృష్ణా)

## పోలిక వరమా

"అమ్మా! నానమ్మ ఏపుడూ నన్ను తిడుతూ ఉంటుంది. అన్నయ్య నేమీ అనదు. వాడి వస్తువులన్నీ నేను తీయక పోయినా నేనే విరగ్గొట్టానని



అంటోంది. అన్నయ్య కూడా నా మీదే చెప్తున్నాడు" కళ్ళ నిండా నీళ్ళతో మెడచుట్టూ చేతులు వేసి, ఏడుపు గొంతుతో అంటున్న బాబీ వైపు సాలోచనగా చూసింది సునీత. ఉద్యోగ రీత్యా తామిద్దరూ పగలు ఉండక పోవడంతో, పిల్లలిద్దరి ఆలనా, పాలనా అత్తగారు చూడవలసింది. పెద్ద బాబు నానీ అంటే అందరికీ అవ్యాజ మైన ప్రేమా, గారాబం. కారణం వాడి కన్నీ వాళ్ళ పోలికలూ, అలవాట్లూ వచ్చాయని, వాడు ఏపని చేసినా మెచ్చుకుంటూ, తప్పైనా సమర్థిస్తూ మురిసి పోతుంటారు. బాబీకి తన పోలిక లంటారు. చీటికీ మాటికీ వాడి అలవాట్లనూ, మాటలనూ ఏదో ఒకటి అంటూ, దెప్పి పొడుస్తూ, కసురుతూ ఉంటారు. బహుశా కోడలినైన నా పోలికలు బాబీకి వచ్చాయనే, వాళ్ళ ప్రవర్తన ఆవిధంగా ఉండటం అన్పిస్తుంది.

ఇవన్నీ అర్థం చేసుకునే వయస్సు వాడికి లేదు. కాని తామిద్దర్నీ ట్రీట్ చేసే విధానం వేరుగా ఉన్నదనే నిజం ఆ చిన్నారి మనస్సు అర్థం చేసు కుంటోంది. దీని ఫలితంగా చిన్న తనం నుండే వారిద్దరికీ అన్నదమ్ముల మధ్య ఉండే అనురాగం, ఆత్మీయత లోపిస్తాయి.

పిల్లలు పెద్దవారౌతున్న కొద్దీ, వాళ్ళు ప్రవర్తించే తీరు, మాట్లాడే విధానం పెద్ద వాళ్ళను బట్టి ఉంటుంది. ప్రతి ఒక్కరి మీద ఒక అవగాహన అంటూ ఏర్పరచు కోవడం జరుగుతుంది.

పుట్టే బిడ్డలు మనం కోరిన పోలికలతో పుట్టరు. ఎవ్వరి పోలిక లైనా పిల్లలందరూ ఒక్కటే. పోలిక లను బట్టి ప్రేమను పెంచుకోవడం చాలా మూర్ఖత్వం.

ఇంట్లో పెద్దవారు ఈ యథార్థాన్ని గ్రహించి, పిల్లల పట్ల ప్రవర్తించే తీరు సమంగా ఉంటే, వారిలో ఇలాంటి భేదాభి ప్రాయాలు పసి ప్రాయంలో నే కలుగవు.

–పి. నిరంజని, శ్రీహరికోట □

కూపన్

ఆంధ్ర సచిత్ర వారపత్రిక

చిన్నారి బాలల దీన గాథలు

రచన పంపిన వారి పేరు : ..........................

పూర్తి చిరునామా : ..........................

..........................

..........................

పిన్ కోడ్

# నిర్ణయం




– వారణాసి ప్రసాదరావు

"జేబులోని డబ్బులేమన్నా తీశావా శాంతా?" ఆఫీసుకు సిద్ధమవుతూ అడిగాను.

"డబ్బులా......నేను తీయలేదే" నిమ్మరసం అందిస్తూ అంది శాంత.

"సరిగ్గా చూడండి. అయినా నేనెందుకు తీస్తాను– తీస్తే చెప్పనా" మళ్ళీ అంది!

నిమ్మరసం తాగేసి కుర్చీలో స్థిమితంగా కూర్చుని జేబులోని డబ్బు మళ్ళీ లెక్కపెట్టాను. సాధారణంగా జీతం డబ్బులు ఫస్టునే ఇంటి కిచ్చేయడం. మూడువందల దాకా నాకోసం ఉంచుకోవడం నా అనవాయితీ! డబ్బుల విషయంలో నాకు అజాగ్రత్త ఎక్కువ..... శాంత చాలా సార్లనేమాట ఈసారి నిజమవదుకదా....

"సరిపోయిందా....."

"లేదు సరిగ్గా వంద తక్కువ. నూట ఎనభై వుంది".

"గుర్తుతెచ్చుకోండి ఏమయినా ఖర్చు పెట్టారేమో–అయినా మీకు మరీ అశ్రద్ధలెండి. చిన్న పిల్లాడికన్నా అన్యాయం. ఎంత డబ్బయినా జేబులో నే వదిలేస్తూ వుంటారు."

ఇక మొదలయింది.....!

వంద రూపాయలు పోయాయన్న బాధకన్నా "శాంత" వచనాలను భరించడం కష్టం! చిన్నప్పట్నుంచీ కష్టాల్లో పెరిగినా స్వయంకృషితో ఉన్నతస్థితికి వచ్చాను. తామిద్దరిలో ఎవరదృష్టవంతులో మరి. శాంత తన ఇల్లాలయింది! నిజంగా తనొచ్చిన వేళావిశేషమే అంటుంది–తను వచ్చిన సంవత్సరమే మా తాతగారి ఆస్తి కొంత కోర్టు తీర్పు వలన నాకు సంక్రమించింది కాబట్టి!

ఏమయినా తను మరిచిపోలేనిది ఒక్కటే. అది తన సహజసిద్ధమైన ఆడంబర రహిత జీవితం! పేరుపొందిన ఓ కంపెనీలో ఉన్నతోద్యోగిగా నాజీతంలో మూడు వేలను ఇంటికి మినహాయిస్తే మిగిలిన మూడు వందలూ తన ఆరోగ్యానికీ, ఇతర ఖర్చులకు తప్పనిసరి అవుతుంది!

జీతం ఎన్నిసార్లు పెరిగినా తన ఖర్చు మాత్రం గత నాలుగేళ్ళుగా స్థిరంగా వుంటోంది. అవసరాల నిమిత్తం డబ్బును ఎంతగా ఖర్చుచేసినా లెక్క చేయని తను ఆ డబ్బు వృథాగా పోయినా ఎవరయినా దొంగిలించి నట్టు తెల్సినా బాధపడతాడు.

"ఏమిటాలో చిస్తున్నారు– సరిపోయి నట్టేనా....?"

ఉలిక్కిపడ్డాను. "ఆఁ... లేదు... లేదు అన్నట్టు రఘు తీసాడేమో వచ్చాక అడుగు. వస్తాను. టైమయింది..." "బాగుంది వాడెందుకు తీస్తాడండీ... అయినా మీవన్నీ ఖచ్చితమైన పద్ధతులాయె. అడిగితే ఎంతయినా యిస్తారు కానీ.... జేబులోంచి మమ్మల్ని తీయనివ్వరుగా...."

"ఏమో.... అవసరపడి తీసాడేమో.... అడుగు–" అని బయటపడ్డాను. రోడ్డుమీదికి వచ్చాక హాయిగా అన్పించింది. నూర్రూపాయల సంగతి మర్చిపోయాను. ఎందుకంటే– నూర్రూపాయల లోటును ఈ నెల ఖర్చుల్లో పూడ్చుకోగల అడ్జస్టుమెంటు గుణం నాలో వుంది కనుక. కానీ ఒక్కటే చిక్కు ... నిజాన్ని నిజంగానే చెప్పాలి. పెళ్ళయిన తర్వాత ముఖ్యంగా తమ ఆర్థిక స్థితిగతులు మెరుగయిన నాటి నుండీ తనకో స్టేటస్ గిరి గీసుకుని అక్కడ్నించి వెలుపలికి ససేమిరా చూడని శాంతతోనే అవలేక పోతున్నాడు అడ్జస్ట్‌మెంట్....!

*   *   *   *

సాయంత్రం ఇంటికి వచ్చి ఆశ్చర్యపోయాను!

వాతావరణం మారిపోయి వుంది. మా వంశోద్ధారకుడు (బి. యి. సీటు రాక పాలిటెక్నిక్‌లో పాతిక వేలతో చదువులు వెలిగించీ, నిరుద్యోగ రాజ్యాన్ని చక్రవర్తిలా ఏలుతున్నాడు) స్కూటర్ మీద రాజ్యపాలనకు వెళ్ళేందుకు సిద్ధంగా వున్నాడు. శాంత తన పేరును తానే చెడగొట్టుకున్న దానిమల్లే వుంది!

"ఏమిటయింది ..." బూట్లు విప్పుకుంటూ అన్నాను.

"ఇంకేమవ్వాలి ... ఇంతకీ మీ డబ్బు సంగతేమయింది ..."

"సరిపోలేదు ... రఘును కనుక్కున్నావా ..."

"నేనుదయమే చెప్పాను కదండీ ... వాడుతీయనే

లేదన్నాడు. అయినా మిమ్మల్నవాలి లిండి ... అసలే ..."

"అబ్బా ... అసలేం జరిగిందో చెప్పక ఈ వాయింపులెందుకోయ్ శాంతం-" నవ్వుతూ అన్నాను.

"మీకు అంతావేళాకోళమే ...!! దాని కొడుకు లేడూ ... రమణగాడు! వాడూ మన చిన్నాడూ ఈ గదిలో నే. రాత్రంతా ఫాన్ క్రింద కూర్చుని తగలడ్డారు. పరీక్షలు కదా పోనీ కలిసి చదువుకుంటున్నారులే అని వెనకేసుకొచ్చారు కదా... దాని ఫలితమే ఇది....!"

నాకంతా అర్థమయిపోయింది!!

'దాని' – అంటే" మా పనిమనిషి రంగమ్మ కొడుకు రమణ టెన్త్ క్లాసు కుర్రాడు. వాడు పుట్టుకలో పేదయినా చదువులో ఉద్దండుడు. కష్టపడి చదువుతాడు. వయసుకు మించిన తెలివితేటలు కన్పిస్తాంటాయతనిలో ... ఏ భేషజాలూ తెలియని రమణతో పాటే ఒకే స్కూల్లో చదువుతోంది కిషోర్ అనబడే మా రెండో పుత్రరత్నం! అన్నింటా అమ్మ పోలిక ...! నాలాగా కష్టాల్తో పెరగకపోయినా కనీసం నా బుద్ధులతో నయినా పెరగాలని కోరుకొంటే దానికి వ్యతిరేకంగా పెరిగినవాడు!

"మీది మరీ చోద్యం లెద్దురూ ... పనిమనిషి కొడుకుతో మనవాడికి స్నేహమేమిటి ... కుంక మొహం వెధవ ... వాడున్నూ ..." అక్కసునంతా వెళ్ళగక్కుతోన్న శాంతను శాంతపరిచాను నెమ్మదిగా. ఇప్పట్నుంచీ వాళ్ళ మనసుల్లో అలాంటి బీజాలు నాటవద్దనీ – అదీగాక వాళ్ళిద్దరికీ చదువులో అలా పోటీ పెట్టటం వల్లనయినా చదువుతాడనీ నచ్చ చెప్పాను. అయినా కొడుకు చదువుల్లోని సారమేమిటో తెలియంది కాదు శాంతకు. అందుకే కాబోలు అయిష్టంగానైనా వూరుకొంటోంది రమణను చూసయినా నెగ్గుతాడేమోనని–!

"ఏమిటలా చూస్తారు –"

ఉలిక్కిపడ్డాను. శాంత అసలు విషయం ఇంకా చెప్పనే లేదనీ అదిప్పుడు మొదలవుతుందనీ గుర్తొచ్చి–

స్టడీ అయ్యాను. కుర్చీలో కూర్చుంటూ.

# నిర్ణయం

"అలా వచ్చి చదువుకుంటాడు కదాని మామూలు గానే అడిగాను .. ఏరా అయ్యగారి గదిలో డబ్బులేమయినా పడివుండటం చూసావా – అని. వాడలాంటిదేమీ చూడలేదనే అన్నాడు. ఒట్టు వేసాడు కూడా. కానీ అదుంది చూసారూ ... రంగి! దానికేమొచ్చిందో రోగం "నా కొడుక్కి దొంగతనం అంటకడుతున్నారా?" అంటూ రగడపడిపోతోంది ... వింటున్నారా ..."

"ఊ ... ఊ ..."

"అయినా పుచ్చుకాయల దొంగా అంటే భుజాలు తడుముకున్నట్టు చేయని దానికి పూర్కే కిందా మీదయిపోవడమెందుకట దానికి ... అయినా ఆ అలగా బుద్ధులు ఎక్కడికట పోతాయి? ఆ వెధవే తీసేసి తల్లికిచ్చేసి వుంటాడు నంగనాచిలా ... దరిద్రపుగొట్టు వెధవ! అయినా ఎవరి హద్దుల్లో వారి నుంచక నెత్తికెక్కించుకుంటే జరగాల్సినవే జరుగుతాయిలెండి ...!"

"శాంతా –" నాకే ఆశ్చర్యంగా వినిపించింది!

"ఏమిటి చెప్పండి"– రుసరుసల్లోనే వుంది రిప్లయ్.

"నిమ్మరసం ..."

"అదేమిటి సాయంత్రాలు కాఫీ గదా మీ అలవాటు"

"నిజమే! కానీ బుర్రంతా వేడెక్కిపోయింది."

"ఊఁ ... ఇదో సరసం, తిన్నానుండండి"

గబగబా తయారయ్యాను. ఈవెనింగ్ డ్రస్ వేసుకొని బయల్దేరాను. వెళ్ళేముందు గ్లాసెడు రసమూ తాగి – "సారీ శాంతా ... ఆ వందా నిజంగా పోలేదు ఆఫీసులో నా టేబులు సొరుగులోనే మరిచిపోయాను. ఆ విషయం రాగానే చెప్పాననుకో నా మతిమరుపు మీద మళ్ళీ విష్ణువ గీతాలు పాడతావని భయమేసి వచ్చిన వెంటనే చెప్పలేదు." అనేసి బుగ్గమీద చిటికేసి కదిలాను.

"అన్నట్టు ఆ కుర్రాడినేమీ అనవసరంగా ఆడిపోసుకోవద్దు" – హెచ్చరించి మరీ బయట పడ్డాను . నిజమనేది నిలకడ మీదనే తెలుస్తుంది అని మనసులో అనుకుంటూ.

శాంత గొంతు మరి వినిపించలేదు. బహుశా – ఏమిటీమనిషి ... అసలీయన ఈ యుగపు మనిషేనా ... అనుకుంటూ వింతగా బయటకు వెళ్తున్న నాకేసి చూస్తూ వుండిపోయి వుంటుంది కాబోలు

* * * * * *

"ఏరా చిన్నా రమణ రాలేదా" భోజనంచేసి టేబిలు పైనున్న పేపర్ని తీసుకుంటూ అన్నాను.

"వాడు రాడట డాడీ – అయినా వాళ్ళమ్మ వాడ్ని దం మారో దం చేసింది డాడీ" కిచకిచమన్నాడు చిన్ని.

మనసు చివ్వుమంది.

"నిజంగానా" అప్రయత్నంగా వచ్చింది నోటి వెంబడి.

"నిజం డాడీ – వాడోసారి మా క్లాసులో మా ఫ్రెండు పెన్ను కొట్టేసాడు కూడా. అప్పుడు మా మాష్టారూ చిన్న దం మారో దం ఇచ్చార్లెండి ..." వాడుతిట్టాంట్రలట డాడీ.

"నోర్మూయ్‌రా వెధవా ..."

"అదేమిటి వాడ్ని కసురుకుంటున్నారూ –" శాంత వస్తూనే అందుకుంది.

"అఁ ఏం లేదులే. నెలకు మూడు పెన్నులు పారేసే నీ కొడుకు ఎవరో ముచ్చటపడి యిచ్చిన పెన్నుతో నెట్టుకొస్తున్న వాడ్ని ఎద్దేవా చేస్తుంటేనూ ..."

"సర్లెండి వాడికీ వీడికా పోలిక ...?" మూతి తిప్పేసింది మెరుపు వేగంతో. "నువ్వు చదువుకోరా నాన్నా ... వాడు మరి రాడులే ... రావద్దన్నానుకూడా. కావలిస్తే నువ్వు మన జడ్జిగారబ్బాయితో కల్సి చదువుకో ... గుర్రం గుర్రంతో నే స్నేహం చేయాలి. గాడిద గాడిదతోనే చేయాలి ..."

"నోర్ముయ్యవే ... అసలు ఈ సంఘం గురించి నీకేం తెల్సు ... చలువరాతి మేడలు .. జిలుగు గుడ్డలు ... పూల కారుల్లో షికార్లు కోరుకొనే పెళ్ళామూ ... ఆ మేడా గుడ్డా – కార్లూ నీవు అన్న ఆ గాడిదల శ్రమతోనే తయారయినవి. ఆ సంగతి తెల్సుకో" – ఆవేశంగా శ్రీశ్రీ గారిలా విరుచుకు పడిపోదామన్న నా తపనంతా నా అంగిట్లోనే మింగుడుపడిపోయింది పిల్లల ముందు అలా వాదించడం ఇష్టం లేక ...

మనసు మరల్చుకొనేందుకు పేపర్లో తలదూర్చాను.

* * * * * *

ఆఫీసు పనిమీద హైదరాబాద్ వెళ్ళి వచ్చి ఇంట్లో అడుగుపెడుతూ ఆశ్చర్యపోయాను. అదో విధమైన ప్రశాంతం ... అందరి మొహాల్లోనూ ఓ రకమైన అపరాధ భావన ... గమనించనే గమనించాను.

భోజనాలయ్యాక స్థిమితంగా పక్కమీదకు వాలుతూ అడిగాను శాంతను విశేషాలేమిటీ ...

"ఏముంటాయి ..."

"ఏమీ లేకుంటే నీవిలా వుండవే. తుఫాను ముందు ప్రశాంతంలా ..." బుగ్గ గిల్లాను.

"ఊఁ ... వెళ్ళొచ్చినా వేళాకోళం మానరు. అది లేదూ సుజాత .. రంగి కూతురు నూతిలో పడింది.



వెంటనే తీసి గడ్డి పెట్టారులెండి ...! ఉలిక్కిపడి నిటారుగా కూర్చున్నాను.

"ఇంతకూ ఏమయిందనీ–

ఏముందీ నే చెపితే నమ్మారు కాదు ... అదో దాని తమ్ముడో ఆ వంద కంటబడిందనో ... అవసర పడిందనో కొట్టేసి వుంటారు. చివరకి చేసింది తప్పనో లేక తీసినట్టు వాళ్లమ్మకు తెల్సి పోయిందనో మళ్లీ భయపడి తెచ్చి మన ముందు గదిలోని టేబిలు పైన పెడుతూ కంటపడిపోయిందా వగలాడి..."

తర్వాత ...

"ఈ సంగ్తంతా తెల్సి రంగి వాళ్ళిద్దర్నీ చావ గొట్టింది. మళ్లీ రోషానికేం తక్కువ లేదులెండి ... నూతిలో దూకిందట ... దూకదూ మాయలాడి!"

మైగాడ్ ... ఇంత చిన్న విషయం ఎంతవరకు వెళ్ళింది ... నా మనసు పరిపరి విధాలా పోసాగింది!

"పోనిద్దురూ... వాళ్ల విషయాలతో మీ మనసునెందుకు పాడుచేసుకోవడం. లేవండి – పెద్దాడు రెండో ఆట సినిమాకు ఫ్రెండ్సుతో వెళ్లాడు. చిన్నా మేడమీదకు పోయాడు."

ఉలిక్కిపడ్డాను. నా స్థితిని గమనించి నన్ను కొత్త మూడ్‌లోనికి తెచ్చేందుకు ప్రయోగిస్తోంది అస్త్రం! అంటే ఏదో విశేషమే ... ఈ అస్త్రం సాధారణంగా తన డిమాండ్సు ఏవయినా వుంటే బయటపెట్టే ముందు సంధిస్తూ వుంటుంది కాంత!

ఏదో మిస్టరీ వుండే ఉంటుంది ...!

* * * * * *

ఆదివారం –

అలవాటుగా క్లబ్‌కు వెళ్లదలుచుకోలేదు.

ఆ ప్రాంతం అభాగ్యుల నివాసం! రంగమ్మ ఉండేదక్కడే. ఒకప్పుడు బాగా బ్రతికిన రంగమ్మ కుటుంబం. ఇప్పుడు బ్రతికి చెడినదయింది. భర్త పోయినా కూతుర్నూ, కొడుకునూ తన రెక్కల కష్టంతో చదివిస్తూనే వుంది. కూతురు సుజాతను ఇంటర్ దాకా చదివించింది. ఫీజులకూ, పుస్తకాలకూ తను పనిచేసే స్థితిమంతులు ఆదుకొనేలా అభ్యర్థించేది రంగమ్మ. ఎందుకు రంగమ్మా కూతుర్ని చదివిస్తున్నావంటే ఆమె జవాబు –"బాబూ దాని తండ్రే గనక బతికుంటే సదివించడా :.. పనిమనిషి కూతురు పనిమనిషిగానే బతకాలా ... అట్టు సదువుకోవాలే గానీ ఎంత వరకన్నా సదివిస్తాను. పస్తులుండయినా సదివిస్తాను బాబూ" అని.

ఆమె పట్టుదలకూ ఆత్మవిశ్వాసానికీ చలించి పోయేవాడు తను. పరోక్షంగా కాంతకేకాదు రంగమ్మకుకూడా తెలియకుండా ఎన్నోసార్లు ఆదుకున్నాడు.

రంగమ్మకు తగిన పిల్లలు వాళ్లు! పట్టుదలనూ కృషినీ విద్యా యజ్ఞంలో ఆజ్యంగా పోసిన వాళ్లు ...

సుజాత ఇంటర్ ఇంచుమించు ఫస్టుక్లాస్ మార్కులతో పాసయింది ... ఆపై చదువులకు ససేమిరా అంది! ఓసారి తనే అన్నాడు. ఏం సుజాతా చదవరాదా అని. లేదు బాబూ మరింక చదవను. అమ్మను ఇంకా ఈ స్థితిలో ఎన్నాళ్లని చూస్తాను.. వచ్చే నెలలో నర్సు ట్రయినింగ్‌కు పిలుస్తారట.· ఎప్పుడయి చేస్తే తప్పకుండా సెలెక్టు అవుతావన్నారు ప్రిన్సిపాలుగారు.

ముచ్చట వేసింది సుజాత మాటలకు. చదువుకున్న పిల్లనన్న భావం ఏ కోశానా లేకుండా తల్లితో బాటే సహాయంగా తనూ పనులు చేయబోవడం చూసి ఎన్నోసార్లు వారించాడు తను. ఏ శాప వశానో పేదరికపు ఛాయలో బ్రతుకుతోన్న ఆ పిల్లలిద్దరూ ప్రాణం పోయినా దొంగతనానికి ఒడిగట్టే వాళ్లు కాదు. సుజాత పెద్దమనిషి కాక పూర్వం ఎంతో చనువుగా తన ఇంట్లో తన పిల్లల్తో పిల్లగా కల్సిపోయి తిరిగేది ... వ్యక్తురాలయిన తరువాత రాను రానూ రాకపోకలు తగ్గించి వేసింది

సుజాత తమ్ముడు రమణ పదేనేళ్లవాడు ... పుస్తకాలు తప్ప వాడికింకో ప్రపంచం లేనేలేదు. తనని సరిగ్గా కన్నెత్తి చూసేందుకయినా సాహసించని వాడు తన డబ్బు దొంగిలించగలిగే స్థాయికొచ్చాడా ... నో .. నెవ్వర్!




నా ఆలోచనల్లోనే ఆ ప్రాంతం దాటిపోయి నందుకు నవ్వుకున్నాను.

రంగమ్మ ఇంటికి వెళ్లాలి. ఈ సమయంలో ఆవిడెలాగూ ఉండదు ... సుజాతను అసలు విషయం అడగాలి! కానీ ఆ ప్రాంతానికి వెళ్తే ఎవరైనా ఏదన్నా అనుకొనే ప్రమాదం ఉండొచ్చు. సంశయంలో ఉండగానే కనిపించాడు రమణ! వాణ్ణి పిలిచాను. వాడి మంచి చెడ్డలన్నీ తెల్సుకొని నెమ్మదిగా అడిగాను. అక్క యింట్లో వుందా –

తలూపేడు.

చూడు రమణా ...ఆ నర్సు ట్రయినింగు విషయమేదో మాట్లాడాలని అయ్యగారోసారి రమ్మంటున్నారని చెప్పు. వెళ్లు ఆఁ చూడు ... అదిగో ఆ రామాలయం దగ్గరకు షికారుగా వెళ్తుంటాను కదా అక్కడికి రమ్మన్నానని చెప్పు – పంపించి నడక సాగించాను.

పది నిముషాలు గడిచినయ్.

సుజాత వస్తోంది. పమిట నిండుగా కప్పుకుని తల వంచుకొని వస్తోంది!

దగ్గరగా వచ్చి తలెత్తి చూసి చేతులు జోడించింది! ప్రతిగా విష్ చేస్తూ రా అమ్మాయ్ రా – ఆహ్వానించి కూర్చోమని చెప్పాను.

కోర్సువు ట్రియినింగూ పై చదువులూ అవీ మాట్లాడేను. డైరెక్టుగా అసలు విషయాలకు దిగితే ఆమెను మరింత డిస్టర్బ్ చేయడం తప్ప మరేం ప్రయోజనం వుండదని!!

సుజాతా ... మరేంలేదు. నేను హైదరాబాద్ వెళ్లాక ఏదో పొరపాటు చేసావని తెలిసింది నీవు చాలా బుద్ధిమంతురాలవని నా నమ్మకం ... కానీ జరిగిందేమిటో తెల్సుకుందామనీ ... ఇలా పిల్చాను.

"...."

సంశయించకు సుజాతా పెద్దవాడిని ... నీకు తండ్రిలాంటి వాడిని కూడా ... నా దగ్గరెందుకూ దాపరికం ... మరొక్క విషయం ఆ డబ్బేదో నీవు తీసావని నీ నోటితో నే చెప్పినా నమ్మను. కానీ ... నీవు

బాబుగారూ ... ఉగ్గబట్టుకున్నదల్లా ఒక్కసారిగా భోరుమంది.

అరరె ... ఏమిటీ చిన్న పిల్లలా ... నో ... నో ... ఓదార్చాను.

సుజాతా జరిగిందేమిటో చెప్పు ... ఏం చెప్పదల్చు కున్నావో నిర్భయంగా చెప్పు. బుజ్జగించాను ఆమె తల నిమురుతూ.

జస్ట్ ఓ వంద రూపాయల కారణంగా నీ నిండు జీవితాన్ని ముగించుకోవాలని చూసేవంటే ... అది ... అది కలలో కూడా నేను నమ్మలేనమ్మాయ్ ...!

సుజాత కన్నీరాగలేదు ... ఆమె మనస్సు కుదుట పడేందుకు మౌనంగా వుండిపోయాను.

కొన్ని క్షణాలు గడిచినయ్!

"నేను ... నేను ..." ఆమె చెప్తోంటే మెచ్చుకోలుగా చూసాను.

ఆమె చెప్పుకుపోతోంది ...!

* * * * * *

ఆల్‌రైట్! ఇన్నాళ్ళుగా తను దేన్ని పట్టించుకో వలసివుండీ పట్టించుకోలేదో చివరికి దాని ఫలిత మేమయిందో తెల్సివచ్చింది. అది– తల్చుకున్నకొద్దీ

ఆవేశం ముంచుకు రాసాగింది!

శాంతా ఏదీ ఆ చీటీ-నిగ్రహించుకొనేందుకు ప్రయత్నించసాగాను.

చీటీ ఏమిటండీ?

సుజాత రాసినది.

సుజాత రాయడమేమిటండీ......

షటప్. నా కంతా తెల్సు. ఎందుకలా చేసావ్? కేవలం....కేవలం ఓ వంద రూపాయల కారణంగా సాటి ఆడదాని బ్రతుకు బూడిదయ్యేందుకు కారణమయ్యావేం? గుమ్మంలో స్కూటర్ చప్పుడు వినబడటంతో టిన్నన్‌గా నిలబడ్డాను.

రఘూ-నా ఆవేశం కట్లలు తెంచుకుంది

ఏమిటి డాడీ-

రాస్కెల్....ఇడియట్-పటాసుల్లా పేలినయ్ వాడి బుగ్గలు!

నా ఆవేశం చల్లారేటప్పటికి అవి రక్తం చిందేందుకు సిద్ధంగా వున్నాయ్! ఒక్కసారిగా దుఃఖం కోపం, తెలియని కసీ, ఉద్వేగం, సానుభూతీ ఏమిటేమిటో అన్నీ ఒక్కసారిగా నా మీద దాడి చేస్తుండగా నిస్త్రాణగా కూలబడి పోయాను. ఆవేశం అణగారింది! దీర్ఘంగా నిట్టూర్చాను.

నా ఆవేశాన్ని అడ్డుకోబోయిన శాంత మూలకుపోయి రోదిస్తోంది....! చూడండీ- మీరు ఈ రెండంతస్తుల భవనంలో వుంటున్నారు. మూడు పూటలా మృష్టాన్న భోజనం తింటున్నారు. జల్సాగా విలాస జీవితం గడుపు తున్నారు. వీటన్నిటికీ కారణం నేను! అలాంటి జీవితాలకు అలవాటు పడిపోయి అవే శాశ్వత మనుకుంటూ పైకెగరాలని చూసారు మీరు నిలబడిన నేలనే మర్చిపోయారు అందుక్కూడ కారణం నేనే!

ఎలా అంటారేమో.... నా భార్యాబిడ్డలు సుఖంగా జీవించాలనీ.... ఒకరి దయాదాక్షిణ్యాలపై బ్రతకరాదనీ.... ఎన్నో కష్ట నష్టాలు భరించీ స్వయంశక్తితో పైకి వచ్చిన నేను ఆ కష్ట నష్టాలేవీ మీకు తెలియనివ్వకుండా సుఖాలన్నీ మీకు అమర్చి పెట్టానుగా అదీ కారణం....! పస్తులతో సైతం కొన్నాళ్ళు గడిపిన నేను- మీ సుఖం ఆనందాలే నా "కడుపు నిండు" అని భావించాను. కానీ ఆ సుఖాలే మీ కళ్ళకు పొరలు కప్పించి కష్టజీవుల బ్రతుకులో ఆడుకునేలా చేస్తాయని భావించ లేదు....! ఆల్‌రైట్....! నేనిప్పుడు తెల్సుకో గల్గాను. నేనెంత పొరపాటు చేసానో.... ఇప్పుడు చెప్తున్నాను వినండి.... ఇప్పుడు జరిగిందానికి ప్రాయశ్చిత్తం జరగాలి. సుఖాలవల్ల మీ కళ్ళ ముందు ఏర్పడ్డ భ్రమలు సైతం తొలగిపోవాలి.... అందుకోసం.... అందుకోసం....!" ఒక్కక్షణం ఆగి ఊపిరి పీల్చుకుని ధృఢంగా చెప్పేను నా నిర్ణయాన్ని!

'డాడీ-"

"ఏవిటండీ మీరంటున్నదీ.... మీకేం మతిపోలేదు కదా...."

"షటప్.... ఇంకా పోలేదు కనకనే స్థిమితంగా చెప్తున్నాను.... నా నిర్ణయానికిక తిరుగు లేదు.... అంతే!"

# నిర్ణయం

"హుఁ....! నిర్ణయం... ఏమిటండీ మీ నిర్ణయం....!? మన పరువు మర్యాదల సంగతి మరిచిపోయి ఏం మాట్లాడుతున్నారో తెల్సా...."

"తెలుసు! ఆ పరువు మర్యాదలన్నవి ప్రవర్తన శీలాన్నిబట్టి కాక కేవలం డబ్బుతోనే లెక్కవేసే నీ వల్లనే వీడిలా తయారయ్యాడన్న తిరుగులేని నిజమూ తెల్సు....! వీడినలా పెంచినందుకూ.... ఆ పెంపకంలో నన్ను జోక్యం చేసుకోనివ్వకుండా వెనకేసు కొచ్చినందుకూ నీకిది సరయిన శిక్ష అవుతుంది కూడా.... ఒరేయ్.... జీవితంలో ఓనమాలు తెలీని వెధవా.... తెల్సుకో! మనిషిగా ఎలా బ్రతకాలో ఎందుకు బ్రతకాలో తెల్సుకో- నా నిర్ణయం నీ పది ఖచ్చితంగా తెల్సుకొనేలా చేస్తుందిలే- ఛో...."

ఇక చెప్పదల్చుకున్నది ఏమీలేనట్టుగా నిట్టూర్చి అక్కడ్నించి నిష్క్రమించాను.

* * * *

జవితం నేర్పిన అనుభవాల్లోంచి నిర్ణయాలు ఎన్నెన్ని తీసుకున్నా ఖచ్చితంగా వాటి నమలు జరపడంలో బలహీనులయితే ఎలా వుంటుందో నాకు నేనే ఉదాహరణంగా మిగిలిన నేను ఒక్కసారిగా దృఢ సంకల్పంతో నిట్టూర్చాను....

సుజాత తమ కోడలుగా వచ్చి తీరుతుంది. ఈ నిర్ణయంలో పునరాలోచన లేనే లేదు! అందుకనేమో- కడుపు నిండ కున్నా మనసు "నిండు"గా వుంది! డాబాపైన వెన్నెల్లో గతాన్ని నెమరేసుకున్న కళ్ళకు ఎప్పుడు మగత వచ్చిందో తెలీదు.... మనసు తెరలపై సుజాత కదలాడ సాగింది! విచిత్రమైనది.... విధి! పద్నెనిమిదేళ్ళ సుజాత.... వినయం... విధేయతలతో మెరిసే సుజాత తన కోడలుగా రాబోతోంది....!! సూటు బూటుల్లో దర్జాగా మెరిసిపోతూ కాలేజీ నాలుగ్గోడల మధ్య జీవితాన్ని నేర్చుకొచ్చిన తన కొడుకు అందుబాటులో వున్న సుజాతను అంమకున్నాడు..!

పాపం ఆ పిచ్చి పిల్ల ఎలా లొంగి పోయిందో ఏమిటో అబలగా మిగిలి....!

తన జేబులోంచి డబ్బుతీసి రూపాయికో చాక్లెట్ కొని రేపర్నూడదీసి తిని పారేస్తూ పెరిగిన కొడుకు తను పొందిన ఆ తియ్యని అనుభవానిక్కూడా ఓ వంద పారెయ్యా లనుకున్నాడు కాబోలు ... డాడీ జేబులో ఎంతుంటుందో ఆయనకే లెక్క వుండదను కున్నాడేమో- గాగంతో జేబుల్లోంచి డబ్బుతీస్తే వెనుకటి రోజులు గుర్తొచ్చి!

"ఈ డబ్బుతో కడుపులాంటి దేదయినా వస్తే తీయించేసుకో" - రాసిన స్లిప్‌నూ వందనోటునూ కవర్లో పెట్టి దార్లో కనబడిన సుజాత కిచ్చిన ఘనుడు- తన వంశోద్ధారకు డయ్యాడు....!

తర్వాతి కథలో రమణ తీసాడేమో అని శాంత పరోక్షంగా ఆరోపించడం.... రమణను వాడి తల్లి దండించడం జరిగినయ్... కానీ నిప్పుమీది నివురు తొలగినట్టుగా- అనాలోచితంగా సుజాత తమ్ముడి పుస్తకాల్లో దాచిన నోటు రంగమ్మ కంట పడనే పడింది! అప్పటికే పిచ్చి పిల్ల నిజం చెపితే బాగుండేది.... కానీ గొప్పవాళ్ళతో చెలగాటమనో.... తమ లాంటి వారి కోపాలు తమకే చేటనో- పెదవి విప్పింది కాదు.... చెయ్యని నేరానికి శిక్ష అనుభవించడమే కాక దొంగగా ముద్రపడ్డ తమ్ముడ్ని చూసాక మానసిక సంఘర్షణను జయించలేక పోయింది....!

"ఈ వంద నోటు మా తమ్ముడు దొంగిలించింది కాదు.... మీ పెద్దబ్బాయి నాకు ఇచ్చింది....! ఈ డబ్బు నా కెందు కిచ్చారో న్యాయం.... దైవం.... పాపభయాల్లో ఏ ఒక్కటయినా మీ అబ్బాయికి వుంటే నా ఎదుటే నిలదీసి అడగండి-" తెగించి అడిగెయ్యాలని వచ్చిన పిల్ల.... అది మళ్ళా తనకే చేటవుతుందని భయపడింది కాబోలు.... అడగ దల్చుకున్న మాటలు కాగితమ్మీద రాసి దాన్ని వందనోటుతో జతపర్చి తన ఇంట్లో డ్రెస్సింగ్ టేబిలుపైన పెడుతూ శాంత కంట పడింది....!

కాగితమ్ముక్కలో రాసింది చదివి చించి పారేసిన శాంత జరగరానిదేదో జరిగే వుంటుందని ఊహించీ, ఆ నిజమేమిటో తెల్సుకోకుండా.... ఆ పాపమేదో మళ్ళీ తన కొడుకు మీదికే వస్తుందన్న భయం కొద్దీ తిరిగి దొంగతనం నేరం అంటగట్టింది అక్కా తమ్ముళ్ళపైన.... సంగతి తెల్సి మళ్ళీ రెచ్చిపోయింది రంగమ్మ. ఆపై ఇక అసలు విషయం తల్లికి తెలిస్తే ఏమవుతుందో ఊహించుకున్న సుజాత తన రహస్యాన్ని తనతోపాటు నిక్షిప్తం చేయాలను కుంది....! పూర్ సుజాతా.... నీలాంటి ఆడపిల్లలు చేయాల్సింది ఆ పని కాదమ్మా.... అలా మిమ్మల్ని అన్యాయం చేసిన మగాళ్ళను చొక్కా కాలరు పట్టుకుని ధైర్యంగా నడిబజార్లోనే నిలదీయ గలగాలి.... అది మీరు చేయాల్సింది! ఆ చొరవా.... ధైర్యం లేనప్పుడు మీకు కాలేజీ యూనివర్శిటీ చదువు లెందుకూ.... చాటు మాటు ప్రేమ లెందుకూ....?! □

## అమ్మ 'తోడు'

–చిన్నప్పుడు
తప్పటడుగులు వేస్తూ నడిచేటప్పుడు
అడుగులు వేసేదు-
"అమ్మ–తోడు"గా
–మధ్యప్పుడు
అబద్ధాలను నిజం చేసేటప్పుడు
చేతిలో చెయ్యి వేసేదు
"అమ్మ తోడు"గా
–పెద్దప్పుడు
పాల గుండెల పడతిపక్కలో వున్నప్పుడు
ఆలోచించి నిర్ణయానికి వచ్చేదు
అమ్మ ★ "తోడు"గా

–డా. అయల సోమయాజుల గోపాలరావు

★పాలను విరిచే మజ్జిగ

## ఆదిశంకరులు ఆరవ శతాబ్ది వారు:

సుప్రసిద్ధ పరిశోధకులు శ్రీ చీమకుర్తి శేషగిరిరావు జూన్ 14వ తేదీన తెలుగు గోష్ఠి సమావేశంలో శంకరాచార్యుని కాల నిర్ణయము - ఒక పునఃపరిశీలన" అనే పరిశోధన వ్యాసం చదివి శంకరాచార్యులు ఆరవ శతాబ్దివారు కావడానికి ఎక్కువ అవకాశాలున్నవని అన్నారు శంకరుల జీవిత కృషి వివరాలు తెలిపే సారస్వతం విరివిగా వున్నా, అది అంతా 12వ శతాబ్ది తర్వాతే. డాక్టర్ పోతుకూచి సుబ్రహ్మణ్య శాస్త్రి శంకరుల కాలం 392-424 మధ్య అని నిర్ణయించారు ప్రస్తుత భారతదేశ చరిత్రకారులు శంకరుల జనన సంవత్సరం 788 అని అంటున్నారు దీనికి ఆధారం శంకర మందారమనే గ్రంథంలో పేర్కొన్న 3889 శ్లోకాలు కాంపూచియాను 877లో పాలించిన ఇంద్రవర్మ తన గురువు శివసోమునికి ఇచ్చిన దాన శాసనంలో అతనిని యేనాధీతాని శాస్త్రాణి భగవచ్ఛంకరా హ్వయాత్ అని వుండడంవల్ల ఈ శ్లోకంలోని శంకరుడే ఆదిశంకరులని చరిత్రకారులు భ్రాంతిపడ్డారు 711లో భారతదేశంలోని సింధు ప్రాంతం అరబ్బుల వశమయింది అవైదిక మతాలయిన బౌద్ధాదులను ఖండించిన శంకరులు ఇస్లామును ఖండించి వుండరా? సంక్షేప శారీరం రచించిన సర్వజ్ఞాత్మ ముని ఇతడు. సురేశ్వరాచార్యుని శిష్యుడు ఈ గ్రంథ రచనా కాలంలో రాజన్య వంశీయుడు. మను కులాదిత్యుడు, శ్రీమత్యక్షత శాసనుడు భూమిని పాలిస్తున్నట్టు సర్వజ్ఞాత్మ ముని తన గ్రంథంలో తెలిపారు ఈ విషయం భండార్కార్ చూచినా, చాళుక్య విక్రమార్కుడని భ్రాంతిపడ్డారు రాజన్య నామంకల ఒక రాజవంశం వరాహమిహిరుని కాలంలో ఉత్తర భారతంలోని మధురా ప్రాంతంలో ఒక గణ రాజ్యాన్ని పాలించేది వరాహమిహిరుడు 5, 6 శతాబ్దాలవాడు రాజన్య వంశ నాణేలు మధురా ప్రాంతంవి 5, 6 శతాబ్దాలవి లభించాయి ఈ గణ రాజ్యం 600 లో హూణుల దండయాత్రతో అంతరించింది. కనుక సర్వజ్ఞాత ముని కాలం ఆరవ శతాబ్దం దాటదు శంకరుల కన్న కుమారిలుడు 48 సంవత్సరాలు పెద్ద అని బృహచ్ఛంకర విజయం వల్ల తెలుస్తున్నది. వీరిద్దరూ సమకాలికులు 7వ శతాబ్దంలో వున్న ఋగ్వేద బాష్య కర్త స్కందస్వామి, ఇతని శిష్యుడు మహేంద్రుడు కుమారిలుని ఉదాహరించారు కనుక కుమారిలుడు 5వ శతాబ్ది చివర, ఆరవ శతాబ్ది ప్రారంభంలో వుండి వుంటాడు ఆంధ్రదేశీయుడగు భావవివేకుడు తర్క జ్వాలలో గౌడపాదుని, మాండూక్యకారికలను ఉదాహరించాడు కనుక గౌడపాదుని తర్వాతి వాడు కాశ్మీర రాజగు గోకర్ణుని నాణెములు 6వ శతాబ్దివి దొరికాయి. గోకర్ణుడు వైదిక మతస్థాపనకు శంకరులకు తోడ్పడినాడు ఈ కారణాలను బట్టి శంకరులు 538లో జన్మించి వుండవచ్చును - అని శ్రీ శేషగిరిరావు అన్నారు. పండితులు పరిశీలించాలని

## హైదరాబాద్ నోట్‌బుక్

కోరుతున్నాను ఈ వ్యాసాన్ని ఆంగ్లంలోకి అనువదించి వివిధ దేశ సంస్కృత, చరిత్ర విద్వాంసులకు పంపాలని పలువురు సూచించారు.

### శ్రీ చీమకుర్తి శేషగిరిరావుకు సన్మానం:—

మిత్రులు శ్రీ చీమకుర్తి శేషగిరిరావును చూచినప్పుడల్లా నాలో మూడు భావాలు – ఆశ్చర్య సంతోష విషాదాలు ముప్పేటగా అవరిస్తాయి. పూర్వం చతుర్వేదాలు, షట్శాస్త్ర పండితులు ఉండేవారు. ఇప్పుడూ ఉన్నారు శ్రీ శేషగిరిరావు ఆధునిక సకల శాస్త్ర పండితులు, ఎక్కాలు మొదలు ఎలెక్ట్రానిక్స్ వరకు ఎం ఎ లకు పాఠం చెప్పి, పి హెచ్ డి లను తయారు చేస్తున్న మేధావి చరిత్ర, భూగోళం, గణితం, ఖగోళం, పురాతత్త్వం, రసాయనం, భౌతికం, జాంతవం, సముద్రం, వాస్తుకళా– ఒకటేమిటి ఆధునిక సకల శాస్త్రాలలోను నిష్ణాతుడు కనుక ఆశ్చర్యం కలుగుతుంది ఇలాటి మహా మేధావితో కలిసి పని చేసే భాగ్యం కలిగింది కదా అని సంతోషం కలుగుతుంది ఇలాటి వానికి ఏ విశ్వవిద్యాలయంలోను ప్రశాంతంగా పరిశోధన చేసుకునే అవకాశం లేదే అని విషాదం కలుగుతుంది అలాటి అవకాశాలు కలుగక పోతేనేమి, శేషగిరిరావు తెలుగు విజ్ఞాన సర్వస్వం 14 సంపుటాలకూ సంకలన కర్తగా వుండి, పెక్కు సనామక, అనామక మౌలిక వ్యాసాలు వ్రాసి, తన జ్ఞాన మంతా దానిలో నింపారు ఆంధ్ర సారస్వత పరిషత్తు కోసం ప్రపంచరాజ్య సర్వస్వం రచించారు. తెలుగు విశ్వవిద్యాలయం కోసం శ్రీయుతులు వజ్ఝ శ్రీనివాస శర్మ, తిరుమల రామచంద్రలతో పాటు లలిత కళా పదకోశాన్ని సిద్ధపరచారు ఆంగ్లంలో తెలుగు బాషా సమితి కల్చరల్ వాల్యూం రచించారు, సంపాదకులుగా వున్నారు 1984లో తెలుగు గోష్ఠి నెలకొల్పి, తెలుగు మరుగులు మొదలైన గ్రంథాలను వెలువరించారు 74 సంవత్సరాలు నిండినా నవనవోత్సాహంతో నిరంతరం పరిశోధన నిమగ్నులై వుంటారు ఈ మేధావి 1913 జూన్ 14న పొన్నూరు తాలూకా వెల్లటూరులో జన్మించారు ప్రాథమిక విద్య, సంస్కృతం అన్నగారయిన శ్రీ వెంకటేశ్వర్లు వద్ద, శ్రీ గుదిమళ్ల తిరుమల లక్ష్మీనరసింహాచార్యుల వద్ద నేర్చి చేబ్రోలులో మాధ్యమిక విద్య, తెనాలిలో హైస్కూలు విద్య ముగించి, గుంటూరు ఎ. సి కాలేజీలో బి ఎ నాల్గవ సంవత్సరం చదువుతూ స్వాతంత్ర్యోద్యమంలో చేరారు 1935 లో తాలూకా కాంగ్రెస్ కమిటీ కార్యదర్శిగా వున్నారు సహకారోద్యమంలో వివిధ సంస్థలను నిర్వహించారు మూడెకరాల భూమిని దానం చేసి చీమకుర్తిలో హైస్కూలు స్థాపించారు యుద్ధ వ్యతిరేకోద్యమం నిర్వహించారు 1942లో కనుపర్తి ఉప్పు కొటార్లపై దాడి చేయడం వల్ల అరెస్టు వారంటు రాగా తప్పించుకొని 1942 నుంచి 46 మార్చి వరకు అజ్ఞాతవాసంలో వుంటూ సేవ చేశారు భయంకరాచారి, పాటిబంద నాగేశ్వరరావు, వి వి రావు (బొంబాయిలో లాయరు)ల పై కుట్రకేసు మోపింది ప్రభుత్వం బొంబాయిలో మూర్జీ వల్లభదాస్ క్యాంప్ ఆర్గనైజరుగా వున్నారు. మూంజీగారి గెరిల్లా క్యాంపుకు యువకులను పంపారు 1946లో అజ్ఞాతవాసం చాలించారు

శ్రీ చీమకుర్తి శేషగిరిరావు, శ్రీమతి రాజేశ్వరి





"సింగారమణి" బిరుదం అందుకుంటున్న నాట్య కౌముది
కుమారి జొన్నలగడ్డ అనూరాధ

1947 కాంగ్రెస్ సోషలిస్టు వింగ్‌లో చేరారు 1948లో సోషలిస్టులతో పాటు కాంగ్రెస్ నుంచి విడిపోయి కాంగ్రెస్, సహకార పదవుల కన్నిటికీ రాజీనామా యిచ్చారు 1951లో దాని నుంచి వైదొలగి నిర్మాణ కార్య క్రమం కొనసాగించారు అప్పటికి ఆస్తంతా కరిగి పోయింది ఉద్యోగాన్వేషణలో చెన్నపురి చేరి తెలుగు భాషా సమితిలో చేరారు తగిన పని లభించింది గొప్ప పని చేశారు శేషగిరిరావును 75వ జన్మదినోత్సవం సందర్భంగా జూన్ 14న రాంనగర్ కమ్యూనిటీ హాలులో, ఆయన బంధుమిత్రులు, అభిమానులు ఘనంగా సన్మానించారు ఉదయం ఆయుష్య హెూమాది వైదిక కార్యకలాపాలు జరిగాయి సన్మాన

# హైదరాబాద్ నోట్‌బుక్

సభకు వృద్ధకాంగ్రెస్ వాది శ్రీ గుళ్ళపల్లి ఆదినారాయణ అధ్యక్షత వహించారు. సన్మాన సంఘ ప్రతినిధి, పంజాబ్ నేషనల్ బ్యాంక్ అడ్మినిస్ట్రేటివ్ ఆఫీసర్ శ్రీ బొల్లాపల్లి వెంకట సుబ్బారావు స్వాగతం చెప్పగా, డాక్టర్ చింతా వేంకటేశ్వర్లు వివిధ సంస్థల సన్మాన కర్తలను ఆహ్వానించారు ప్రముఖ పత్రికా రచయిత శ్రీ జి కృష్ణ, డాక్టర్ పరబ్రహ్మ శాస్త్రి, డాక్టర్ రాజారామ్‌దాస్ (ఉస్మా), డాక్టర్ పోరంకి దక్షిణా మూర్తి, డాక్టర్ అక్కిరాజు రమాపతిరావు, శ్రీ యార్లగడ్డ అంజనేయులు, డాక్టర్ ముదిగొండ వీరభద్రశాస్త్రి, డాక్టర్ బూదరాజు రాధాకృష్ణ, తూనికల కొలతల శాఖ డిప్యూటీ కంట్రోలర్ శ్రీ సి బి ఎల్ వి ప్రసాదరావు మున్నగు వారు శేషగిరిరావు బహుముఖ ప్రజ్ఞను ప్రశంసించి వివిధ బహుమతులు అందజేశారు డాక్టర్ ఎం. రాఘవరావు (ఉస్మా) సన్మాన పత్రం చదివారు. డాక్టర్ గోపీ కవిత చదివారు డాక్టర్ ముక్కామల రాధాకృష్ణ శర్మ, వసంతరావు వెంకటరావు, డాక్టర్ వుల్చల శ్రీరామచంద్రుడు, మున్నగు విద్వాంసులు పాల్గొన్నారు ఎయిర్‌ఫోర్స్ వింగ్ కమాండర్ శ్రీ ఎస్ వి. సుబ్బారావు ధన్యవాదాలు చెప్పారు పిదప దాదాపు ఆరేడు వందల మందికి విందు భోజనం జరిగింది

## నగర కూచిపూడి నర్తకి అనూరాధకు మరొక బిరుదు :–

సుప్రసిద్ధ కూచిపూడి నర్తకి నాట్య కౌముది జొన్నల గడ్డ అనూరాధను ఇటీవల బొంబాయిలోని ప్రముఖ సాంస్కృతిక సంస్థ సుర్‌సింగార్ సంసద్ "సింగార మణి" బిరుదంతో సత్కరించింది ఈ సత్కారం మే 30న బొంబాయిలోని బిర్లా క్రీడా కేంద్రంలో జరిగిన స్వామి హరిదాస్ సంగీత సమ్మేళనంలో జరిగింది మేనేజ్ మెంట్ టెక్నిక్ నిపుణుడు, పార్లమెంటు సభ్యుడు ప్రొఫెసర్ సి పి ఠాకూర్ బిరుద ప్రదానం చేశారు కుమారి అనూరాధ అరగంటసేపు నృత్యం ప్రదర్శించి ప్రేక్షకులను ఆనందింప జేసింది

## ఉపశ్రుతి :–

బస్సుల్లో చిల్లర లేకుండా బాధపడుతున్నాము బోకుగా రూపాయి టిక్కెట్టు పెట్టించండి– అన్నాను ఒక కండక్టరును మానవ జన్మే బాధలకు కదండీ ఈ బాధ తీరితే మరొక బాధ ఇదొక బాధల గొలుసు – అన్నాడు కండక్టర్ అరె! ఇదేమిటి ఆర్ టి సి వారంతా వేదాంతులవు తున్నారే?– అని ఒక ప్రయాణికుడు ఛలోక్తి విసిరాడు రాష్ట్ర అధినేత వేదాంతే గదా!– అన్నారు గుంపులోంచి ఎవరో

–తిరుమల రామచంద్ర




Printed and Published for Nageswara Rao Estates Private Ltd., by S. Nageswara Rao, at the Andhra Patrika Press, Gandhinagar, Vijayawada - 520 003. Acting Editor : M. Madhava Rao, Chief Editor : S. Radhakrishna.
Phones : Business : 61247, 61248, 75569 Editorial : 75667



# దూరదర్శనం

లత

## అహంకార్

రవీంద్ర ఠాగూర్ నాటకం కోడలు కవయిత్రి అయితే మామగారికి సంతోషం సాహిత్య పరిషత్తు వగైరాలో సన్మానింప బడటం ఇంట్లో అందరికీ ఇష్టం కాని ఆమె భర్త — పురస్కారం పొందిన ఆమె కథని హర్షించలేడు ఇంట్లో వాళ్ళు ఆమె సన్మాన పత్రాలు పగల కొడతాడు స్వయంగా రచయిత్రి తన కలల్ని తగల పెడుతుంది. ఆ కథలో ఏముందో చెప్పడు అది రవీంద్రుని సొమ్మన్ను అందరూ అహంకారం పొందారు బెంగాలీలో అహంకారం అంటే ఆత్మస్థైర్యం.మనకి అహంకారం అంటే పొగరు ఏదయినా చక్కని కథ గురు దేవులది కదా

## చక్రవర్తి

సీరియల్ ఆఖరి భాగం. హమ్మయ్య ప్రేమ్ — పెళ్ళి అటు వాళ్ళు ఇటు వాళ్ళూ చక్రవర్తి మధ్యవర్తిత్వంతో ఒప్పుకొని — చెరో ఫోటో తీసుకొచ్చి వాళ్ళిద్దరినీ ఏడిపిస్తారు ఆ కార్యక్రమం అయిన తరువాత స్వీట్స్ తింటారు ఇది ఆఖరి భాగం ఆనందించండి మీరంతా టీ వి వారికి ధన్యవాదాలు తెలుపండి అక్షింతల రూబిన్ జిందాబాద్ వెళ్ళిపోయినందుకు కృతజ్ఞతలు ఈద్ ముబారక్ సందర్భంగా ఢిల్లీ కార్యకమం ప్రసారం చేశారు

ఆ తరువాత ఒక అమ్మాయి తెలుగులో ఏడో శృతిలో పాడిన కీచు పాట వినిపించారు

## చహరే

రచన అసిత్‌కుమార్

చహరే అంటే ఫేజెస్ అని ఇంగ్లీషులో వేశారు అప్పుడు కూడా తెలుగులో వాడే చహరా అనే పదంకి దగ్గరే — అతని చహరా తెలియటంలేదని గుణం చిరుభామాగా వాడుతున్నాం మనం — ఫేజెస్ ఆఫ్ వుమన్ అనగా స్త్రీల బహుముఖాలు లేక చహరా

ఒక తల్లి లేని ఉష తమ్ముడినీ చెల్లెలునీ పెంచుతూ తన తాగుబోతు తండ్రితో దెబ్బలు తింటూ కూడా తాను ప్రేమించిన ప్రియుడు ఎంత బతిమాలినా పట్నం వెళ్ళదు అతనితో రాలేనని చెప్పదు. అతను ఎదురుచూసి వెళ్ళి పోతాడు ఆ రోజు నించీ రైలు శప్పుడు వినిపిస్తే దిగాలుగా చూస్తూ ఉంటుంది ఇది ఒక ఆడపిల్ల చహరా

## స్వరరాగసుధ

శ్రీ బాలమురళీకృష్ణ

మోహన — మేచకల్యాణిజన్యం షడ్జమం — చతుశృతి రిషభం — అంతర గాంధారం — పంచమం — చతుశృతి ధైవతం

ఈ రాగంలో నవరసాలు ఉన్నాయి చాలా పాటలున్నాయి అంతగా ప్రచారంలో లేని దీక్షితుల వారి కృతి పాడారు మురళీగారు నరసింహస్వామి మీద చక్కని కృతి ఆయన స్వర కల్పన అద్భుతం — ఈ కార్యక్రమం టి వి పరువుహెచ్చు చేసింది మిగతా కార్యక్రమాల తలనొప్పులకి ఈ కార్యక్రమం దివ్యౌషధంగా పనిచేస్తున్నది

## జాబులు జవాబులు

ఆడపిల్ల అద్దె కొంప బాగా లేదని చిట్టీ చిన్నీ వగైరాలు అన్నారు అదే నాటిక గురించి సుబ్బి సీత, వెంకులు చాలా బాగున్నాయని వ్రాశారు

భావవల్లరి ఘంటసాల వారితో రికార్డు చేయటం సాధ్యమంటారా? అన్నాడు పార్వతీశంబాబు ఏమిటో మరి? జోకు కాబోలు ఢిల్లీ నుంచి వచ్చిన చిత్రహార్‌లో మిస్టర్ ఇండియాలో శ్రీదేవి — పిల్లలూ — బంతీ పాట మళ్ళీ వేశారు అశ్రద్ధ విషయంలో హైదరాబాదంత కాదు గాని మొత్తానికి ఢిల్లీ దర్బారు కూడా అంతే.

## కబీరు

ఈ భాగంలో కథ సాగలేదు గాని మధ్యయుగాల నాటి మర్యాదలు మాషా అల్లా — రామ్ రామ్ లాటివీ గుర్రాలమీద రాజభటులూ — జాడీల్లో ఆసవాలు పెట్టుకున్న యునానీ వైద్యుడూ, కడుపు నొప్పి లాగా కబీరుకి జోస్యం చెప్పిన గుడ్డివాడూ. రహస్యంగా వచ్చి పాలిచ్చి పోయిన కబీరు తల్లి

"కబీరు"లో సీనా గుప్తా



ఎవరికి వారే రాబోయే కథకు వాతావరణం కల్పించారు కబీరు ఇంకా ఆరు నెలల పసివాడే — అసలు కథ ముందుంది పునాది బాగుంది అది చాలు

## రథ చక్ర

పడవలో కూర్చున్న తల్లికి తన యవ్వనం కుంటి భర్త అతని పిచ్చి పూనకాలు హిమాలయాలకని అతను ఇల్లు విడిచిపోవటం అన్నీ గుర్తుకు వస్తాయి ఏదో ఆవేశంలో భార్యని కలిస్తే కొడుకు పుట్టాడు — అదొకయాక్సిడెంట్ ఇది గొప్ప నాటిక కాదు ఓ మాదిరిగా ఉంది రచయిత చంద్రేలాగా మొదట కనిపించింది ఇప్పుడు చదివేపాటి టైము ఉండదు దక్షిణ భారత రచయితలు ఎవరైతేనేం? అని ఢిల్లీ సవతి సోదరులు ఎప్పుడూ భావిస్తారు. ఇప్పుడూ అంతే

## ఆగదు ఉదయం

—రచన దివ్య ప్రభాకర్

సొసైటీ లేడీగా మారిన అమాయకురాల్ని భర్త అనుమానించి పరశురాం అనే మిత్రుడితో ఆమెను చంపమంటాడు. కాని ఆమె నిర్దోషి. ఈ వారం పిస్టల్ చప్పుడూ చావు కేకతో ఈ భాగం పూర్తి అయింది నిజంగా ఆమె చనిపోదు అనుకుంటాను అక్కడే మరో స్నేహితుడు టేప్‌రికార్డరు పెట్టాడు ఏమయినా ఈ నాటిక ఒకటే బాగుంది

## అమృత

సుప్రసిద్ధ హిందీ రచయిత్రి మహాదేవివర్మ కవిత ఆధారంగా అమృత కవిత మనం విన్నాం నాకావిడ కవిత్వం గుర్తులేదు — జ్ఞానపీఠం ఎవార్డు పొందిన మహిళ మహాదేవివర్మ ఆశాబోస్లేకి గాయనిగా మంచి ప్రాధాన్యత ఇచ్చారు

## వెన్నెల వేట

రచన యర్రంశెట్టి శాయి నిర్మాత కందనాతి చెన్నారెడ్డి — ఈ వారం మందుకొట్టే సీను అయిం తరువాత ఎడిటరు అక్కయ్యగారూ — మా ఆయన కాలిమీద మచ్చ ఉన్నది ఏం చేయమంటారు? అన్న ప్రశ్న — చెల్లీ మీ ఆయనకి ఈ రెండు మాత్రలూ వెయ్యి అన్న డాక్టరు ప్రశ్నలూ జవాబులూ వ్రాసి — వారఫలాలు కూడా తనే వ్రాస్తాడు ఇంతలో చెప్పకుండా ముఖచిత్రం వేసినందుకు ఆ అమ్మాయి వచ్చి చివాట్లు పెడుతుంది ఆ అమ్మాయి వెళ్ళినాక, కల నిజమాయెగా కన్య తను వచ్చెగా అని ఆఫీసులోనే గంతులు వేస్తాడు ఎడిటరు పత్రికా సంపాదకులు ఇంత చౌకబారుగా ప్రవర్తిస్తారో?

స్వయంగా నేను కొన్నాళ్ళు ఒక వీక్లీకి ఇన్‌ఛార్జిగా ఉన్నాను ఇంత చౌకబారుతనం ఏ ఎడిటర్లోనూ, సబ్ ఎడిటర్‌లోనూ నాకు కనిపించ లేదు ఇంటి దగ్గర వాళ్ళెలా ఉంటారో నాకు తెలియదు ఆఫీసులో చాలా హుందాగా ఉంటారు ఈ వెన్నెల వేట చాలా అసహజంగా ఉంది పత్రికలలో విదూషకులు ఉంటారని నాకు తెలియదు పత్రికా ప్రపంచాన్ని ఇలా చీప్‌గా చూపించటం ప్రజలకూ, ప్రభుత్వానికీ లోకువ చేయటం కాదా? వెన్నెల వేట పేరుకి న్యాయం చెయ్యాలంటే పత్రికల ఎడిటర్లు పనికి రారు వాళ్ళు గౌరవనీయులు □

# ఫ్రెంచ్ టెన్నీసు ఛాంపియన్‌షిప్ '87 సమీక్ష

పారిస్‌లో షుమారు శతాబ్ద కాలము నుండి జరుగుచున్న ఫ్రెంచ్ ఓపెన్ టెన్నీసు ఛాంపియన్‌షిప్ 1987 టైటిల్స్ పురుషుల విభాగములో ఇవాన్ లెండిల్,మహిళల విభాగములో స్టెఫీగ్రాఫ్‌లు కైవసం చేసుకున్నారు. ఇవాన్ లెండిల్‌కు యిది మూడవ విజయం. 1984లో మొదటిసారి గెల్చాడు. ఆ తర్వాత 1986లో విజయం పొందాడు. ఈసారి లెండిల్‌పై ఆది ఓటమి పొందిన మాట్స్ విలాండర్ 1985 ఫ్రెంచి ఓపెన్ విజేత.

27 ఏళ్ళ ఇవాన్ లెండిల్‌కు యిది అయిదవ అంతర్జాతీయ పోటీలో గెలుపు. ఫ్రెంచి ఓపెన్ టెన్నీసులో మూడు విజయాలు గాక 1985, 86 లలో యునైటిడ్‌స్టేట్స్ ఓపెన్‌లో కూడా గెలుపు పొందాడు. మహిళల విభాగములో గెలుపొందిన పశ్చిమ జర్మనీకి చెందిన అమ్మాయి స్టెఫీగ్రాఫ్‌కు యిది మొట్ట మొదటి విజయం. 18 ఏళ్ళకు యింకా ఎనిమిది రోజులు తక్కువ వయసులో ప్రపంచ నెంబర్ వన్‌గా యున్న మార్టినా నవ్రతిలోవాపై 6-4, 4-6, 8-5



స్టెఫీగ్రాఫ్

స్కోరుతో గెలుపొంది సంచలనం సృష్టించినది. ఫ్రెంచి ఓపన్ టెన్నిస్ మహిళల పోటీ 90 ఏళ్ళ చరిత్రలో యింత పిన్న వయసులో గెలుపొందిన వారు యింతవరకు లేరు. మార్టినా నవ్రతిలోవా 1982, 1984 లో విజేత.

చెకస్లోవేకియాకు చెందిన ఇవాన్ లెండిల్ స్వీడన్ క్రీడాకారుడు మాట్స్ విలాండర్‌పై 7-5, 6-2, 3-6, 7-6 తేడా స్కోరుతో గెలుపొందారు. నాలుగు గంటలకుపైగా ఎంతో ఆసక్తికరముగా ఫైనల్ పోటీ జరిగినది. మన దూరదర్శన్ ఆదివారం ప్రత్యేక కార్యక్రమములో సహితము నిలుపుదలచేసి యీ పోటీ ప్రసారము చేయుట టెన్నీసు అభిమానులకు ఎంతో ఆనందం కలిగించినది. కాని ఆదివారం సినిమా యితర కార్యక్రమములకు అలవాటు పడిన మహిళా జనం, యువతకు మాత్రము నిరుత్సాహము కలిగించినది.

జూన్ 7 రాత్రి మన టి. వి. లో ప్రసారమైన (పారిస్‌లో మిట్ట మధ్యాహ్నం నుండి జరిగిన) ఫైనలు పోటీ నాలుగు గంటలకుపైగా ఇవాన్ లెండి ల్, మాట్స్ విలాండర్ మధ్య జరిగినది. లెండి ల్‌కు విజయం ఎంతో శ్రమతో దక్కినది. మొదటి సెట్‌లో ని మూడు ఆటలు 21 నిమిషములలో పూర్తి అయ్యాయి. మొదటి ఆటలో లెండి ల్ తప్పులను అవకాశముగా తీసుకొని విలాండర్ 'లవ్' గెలుపు పొందారు. ఆ తర్వాత పోటీలలో ఆటగాళ్ళకేగాక ప్రేక్షకుల ఓపికకు పరీక్షగా జరిగినది. ఇద్దరు క్రీడాకారులు 'బేస్ లైన్'ను వదలలేదు. కొన్ని సమయములలో లెండి ల్ ముందుకు వచ్చాడు. లెండి ల్ బంతులను విలాండర్ జవాబుగా పంపుట ప్రేక్షకులను కొంత ఆకర్షించినది. ఆట నాల్గవ సెట్‌లో వర్షము వలన 35 నిమిషములు నిలుపుదల చేయబడినది. ఆఖరికి ఫలితం తెలియుటకు 4 గంటల 18 నిమిషములు పట్టినది. ఇదివరలో 1982 లో విలండర్, విలాస్ మధ్య జరిగిన పోటీ కన్న నాలుగు నిమిషములు తక్కువ. అప్పుడు 4 గం. ల 22 నిమిషముల రికార్డు (ఎక్కువ) టైము.

పురుషుల పోటీకి ముందు రోజు జరిగిన మహిళల పోటీ ఆశించిన ఆసక్తి కలిగించలేదు. నవ్రతిలోవా ఆట మొదలు పెట్టిన 37 నిమిషాలలో మొదటి సెట్టులో 6-4 స్కోరుతో ఓటమి పొందుట నిరాశ కలిగించినది.

ఈసారి విజయం వలన లెండి ల్‌కు 1,95,000 డాలరులు, విలాండరునకు 97,500 డాలరులు, స్టెఫీగ్రాఫ్‌కు 1,80,000 డాలరులు, నవ్రతిలోవాకు 90,000 డాలరులు బహుమతి లభించినది.

పురుషుల డబుల్స్‌లో జారీడ్ (స్వీడన్), రాబర్ట్ సిగోసో జంట నోవా, ఫర్గటా (ఫ్రాన్స్)పై 6-7, 6-7, 6-3, 6-4, 6-2 గెలుపు పొందారు. మహిళల డబుల్స్‌లో నవ్రతిలోవా, ష్రివర్ జంట గ్రాఫ్ సబటానీలపై 6-2. 6-1 గెలుపు పొందారు. మిక్సడ్ డబుల్స్ టైటిల్ ఎమిలివోసాన్‌గ (స్పెయిన్) పామ్‌షివర్(యు. ఎస్. ఏ.)లు సాధించారు.

ఈసారి మహిళల డబుల్స్ పోటీ విజయం వలన నవ్రతిలోవాకు 24 గ్రాండ్ స్లామ్ విజయాలు లభించాయి. అందులో 17 విజయాలు ష్రివర్ పార్ట్‌నర్‌గా సాధించినవి.

అంతర్జాతీయ క్రీడా పోటీలలో ముఖ్యముగా టెన్నీసు పోటీలలో ఫ్రెంచ్ ఓపెన్ ఛాంపియన్‌షిప్‌నకు శతాబ్ద చరిత్ర కలదు. అంతర్జాతీయ టెన్నీసు రంగము ఏర్పడిన 20 ఏళ్ళలో టెన్నీసు ఆట ఫ్రాన్స్‌లో ఎంతో ఆసక్తిగా ఆడబడేది. వింబుల్డన్ వలె మొదట స్థానికుల నిమిత్తం ఆ తర్వాత ఐరోపా వాసులకై జరిగిన యీ పోటీలో ప్రపంచ అగ్రగామి పోటీలలో ఒకటిగా ప్రాముఖ్యత పొందినది.

1891 లో ప్రారంభించబడిన యీ పోటీలలో మొదటి ఆరు సంవత్సరములు పురుషుల నిమిత్తం జరిగేవి. 1897 లో మహిళల సింగిల్స్, 1906 లో పురుషుల డబుల్స్, 1925 లో మహిళల డబుల్స్, మిక్సడ్ డబుల్స్ పోటీలు ప్రవేశపెట్టబడినవి. ప్రారంభ పోటీలో (1891) లో విజయం పొందిన ఘనత జె. బ్రిగ్స్‌కు దక్కినది. పురుషుల సింగిల్స్‌లో ఎక్కువసార్లు గెల్చిన ఘనత ఎ. విచరట్ (1894, 95, 96, 1901, 1902) పి. ఎమ్ (1897, 98, 99, 1900) ఎం. డకుగ్యోస్ (1903, 4, 7, 8, 9, 12, 13, 14) నకు లభించినది. 1978 నుండి 1981 వరకు నాలుగు సార్లు వరుసగా గెల్చిన ఘనత బోర్గ్‌కు కలదు.

మహిళల సింగిల్స్ పోటీలు 1897 లో ప్రారంభించిన తర్వాత 1899 వరకు 1902, 1903 లలో సి. మ్యాసన్, 1920 నుండి 23, 1925, 26 లో గెల్చిన కీర్తి ఎస్. లెంగ్లనాలకు కలదు. లాయిడ్ 1974, 75, 79, 80, 83 లో గెల్చినది.

పురుషుల డబుల్స్ పోటీ 1906 నుండి 1914.



లెండాల్

1920 లో అనగా పదిసార్లు గెల్చిన రికార్డు ఎం. డమగ్యాస్, గెర్మట్‌లకు దక్కినది.

మొదటి ప్రపంచ యుద్ధము వలన యీ పోటీలు 1916 నుండి 1919 వరకు, రెండవ ప్రపంచ యుద్ధము వలన 1940-45 వరకు జరగలేదు. ఇప్పటికి పురుషుల సింగిల్ పోటీలు 82 సార్లు, డబుల్స్ పోటీలు 68 సార్లు మహిళల సింగిల్స్ 76 సార్లు, డబుల్స్ 57, మిక్స్‌డ్ డబుల్స్ 57 సార్లు జరిగినవి.

ఫ్రాన్స్ అందాల దుస్తులకు, అలంకరణలకు ప్రసిద్ధి అయితే యీ పోటీల సమయములో ఆ అందాలను టెన్నిస్ ఆటతో పాటు తిలకించే అవకాశము దక్కుతుంది.

-ముకరమ్